# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

ఫిబ్రవరి 2007 67 రు. 10

- ఫోకస్ : సచార్ కమిటీ నివేదిక
  ముస్లింల సామాజిక, ఆర్థిక స్థితి
- మన విద్యారంగం ఓ చిల్లుకుండ
- ఆర్టీసీ డిపోల మూసివేత
- సింగూరు, నందిగ్రామ్
- ఓగ్నితో మునిగిన మగ్గం
- స్త్రీల అస్తిత్వాలకు కొత్త సవాళ్లు

సలహా మండలి:
ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు
ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ
ప్రొ॥ చక్రధరరావు
కాత్యాయని
బి.సాంబశివరాజు

గౌరవ సంపాదకులు:
ఎ.బి.కె. ప్రసాద్
ప్రధాన సంపాదకులు:
వి. హనుమంతరావు
వర్కింగ్ ఎడిటర్:
ఎన్. వేణుగోపాల్

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

వార్షిక చందా: రు.120 విడి ప్రతి : రు. 10

67 ఫిబ్రవరి 2007

సంపాదకీయం

## జీవిత ఖైదీల ఉసురు పోసుకోవడం ఎందుకు?

రాజకీయనాయకుల అత్యాచారాలనూ, హింసనూ, హత్యాకాండలనూ క్షమించి వారిమీద కేసులు ఎత్తివేస్తున్న మహాఘనత వహించిన పాలకవర్గాలు మనవి. పోలీసు అధికారుల మీద, ఇతర ప్రభుత్వ అధికారుల మీద వాళ్లు ఎటువంటి నేరాలు చేసినా అసలు కేసులే నమోదుచేయని, వారిని ఎన్నడూ బోనెక్కించని అపూర్వమైన న్యాయవ్యవస్థ మనది. నిన్నటికి నిన్న పసిపిల్లలను అమ్మేవ్యాపారంలో తలమునకలుగా కూరుకుపోయిన ఒక పోలీసు ఉన్నతాధికారి సతీమణినీ, ఫైర్ ఇంజన్ల కొనుగోలులో అక్రమాలకు పాల్పడిన ఆ అధికారినీ, అర్బన్ కోఆపరేటివ్ బ్యాంకు పెట్టి ప్రజలను ముంచిన మరొక పోలీసు ఉన్నతాధికారి కొడుకునూ, అబద్ధాలతో శౌర్యచక్రాలు సంపాదించిన పోలీసు అధికారులనూ క్షమించి వారిమీద ఏ చర్యలూ ఏ విచారణలూ చేపట్టని ఔదార్యం మనది. వందమంది నేరస్తులు తప్పించుకుపోయినా ఫరవాలేదు, ఒక్క అమాయకుడికి మాత్రం శిక్షపడగూడదు అనే న్యాయసూత్రంలో మొదటిసగాన్ని ఇంతగా అక్షరాలా పాటిస్తున్న మన పాలకులు, వేలాదిమంది అమాయకులమీద అన్యాయమైన శిక్షలు అమలు చేస్తూనే ఉన్నారు. ఏదో తాత్కాలిక అవసరాలకోసమో, క్షణికావేశంలోనో నేరాలు చేసి, ఏ అంగబలమూ అర్థబలమూ లేనందువల్ల దొరికిపోయి, విచారణ జరిగి, శిక్షలు పడి ఇప్పటికే ఏళ్లకు ఏళ్లు జైలు జీవితం అనుభవించి, ఇప్పటికే పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న, కుటుంబాలు ధ్వంసమైపోయిన ఖైదీలకు క్షమాబిక్ష పెట్టడానికి మాత్రం చేతులురాని దయాస్వభావం మనది. నిజానికి అది క్షమాభిక్షకూడాకాదు. జీవిత ఖైదీలకూ, ఇతర ఖైదీలకూ వారి సత్ప్రవర్తనను బట్టి, ప్రత్యేక సందర్భాలను బట్టి శిక్షాకాలంలో తగ్గింపు ఇచ్చే సంప్రదాయం ఎన్నో దశాబ్దాలుగా అమలులో ఉంది. జైలుశిక్ష అనేది నేరస్తులను సంస్కరించేదిగా ఉండాలనీ, అది వారిని మరింతగా నిరాశా నిస్పృహలలోకి నెట్టివేసి, నేరస్వభావాన్ని పెంచేదిగా ఉండగూడదనీ ఎంతో మంది విశ్లేషించారు. ఒక ఖైదీ ఐదు సంవత్సరాలకు మించి జైలు జీవితం గడిపితే అటువంటి మానసిక స్థితిని ఎదుర్కోవచ్చునని, అందువల్ల ఐదు సంవత్సరాలలోనే విడుదల చేయాలని సలహా ఇచ్చారు. అటువంటి మానవీయమైన ఆలోచనలనూ, సలహాలనూ పెడచెవిన పెట్టిన గత ప్రభుత్వం ఖైదీలపట్ల నిర్దాక్షిణ్యమైన, ప్రతికూల వైఖరిని ప్రదర్శించింది. అప్పుడు ప్రభుత్వ వైఖరిని విమర్శించిన అప్పటి ప్రతిపక్షం, ఇప్పటి పాలకపక్షం ఈ జీవితఖైదీల విడుదల సమస్యలో ఇమిడి వున్న మానవతాదృక్పథాన్ని పక్కనపెట్టి, దాన్ని తన క్షుద్ర రాజకీయ ఎత్తుగడగా వాడుకుని దాని సామంజస్యాన్ని అపహాస్యం చేసింది. తద్వారా అసలు ఖైదీల విడుదలనే వివాదాస్పదం చేసి కోర్టుల చిక్కుముడులలో పడేసింది. ఇప్పటికే ఐదు సంవత్సరాలు, ఏడు సంవత్సరాలు, అంతకన్న ఎక్కువకాలం జైళ్లలో గడిపిన ఖైదీలు విడుదల అవుతామని ఆశలు పెట్టుకున్న జనవరి 26 వచ్చింది, పోయింది. వారి ఆశలు అడియాసలయ్యాయి. ఇప్పటికైనా ప్రభుత్వం తనలో కనీస మానవత్వం అయినా ఉన్నదని రుజువు చేసుకోవడానికయినా ఖైదీల విడుదల గురించి తగిన చర్యలు తీసుకోవలసి ఉంది.

◆

# లోపలి పేజీల్లో...




## సచార్ కమిటీ నివేదిక

జస్టిస్ రాజిందర్ సచార్ నేతృత్వంలోని ఏడుగురు సభ్యుల ఉన్నతస్థాయి కమిటీ తన నివేదికను సమర్పించిన 2006 నవంబర్ 17 నుంచీ, ఆ నివేదికను ప్రభుత్వం పార్లమెంటులో ప్రవేశపెట్టిన నవంబర్ 30 నుంచీ, రాజకీయ వర్గాలలో, పత్రికలలో పెద్దఎత్తున చర్చ జరుగుతోంది. ఆధునిక భారత చరిత్రలో అత్యంత ప్రధానమైన పత్రాలలో ఒకటిగా నిలిచిపోయే సచార్ కమిటీ నివేదిక, ఏమి సాధించినా సాధించకపోయినా, గత ఐదు దశాబ్దాలుగా దేశంలో ముస్లిముల గురించి సంఘ్ పరివార్ శక్తులు సాగిస్తున్న అబద్ధ ప్రచారాలను బద్దలు కొట్టిన ముఖ్యమైన, సాధికారికమైన పత్రంగా నిలిచిపోతుంది.

### ఫోకస్ : సచార్ కమిటీ నివేదిక






**వీక్షణం**

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040 - 66843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, ఆజామాబాద్, హైదరాబాద్.

సహాయ సంపాదకులు : డి.వి.రామకృష్ణారావు
సర్క్యులేషన్ మేనేజర్ : వై. రామచంద్రం 9949391028
కంపోజింగ్ & లే ఔట్ : సి. రాజశేఖర్

## పాఠకుల వీక్షణం

'ప్రసార, ప్రచార మాధ్యమాలు–విశ్వసనీయత' అంశం ఫోకస్‌గా వీక్షణం జనవరి సంచికలో ప్రచురించిన వ్యాసాలు బాగున్నాయి. రచయితలు సీరియస్‌గా చర్చించవలసిన విషయాలను ఎంపిక చేసుకుని చక్కగా చర్చించారు. ఇటువంటి రచనలు వీక్షణం నుంచి మరింతగా ఆశిస్తున్నాను.

– నాగసూరి వేణుగోపాల్
విశాఖపట్నం

వీక్షణం చాలా అవసరమైన సమాచారాన్ని, విశ్లేషణను అందజేస్తున్నది. దినపత్రికలు, టీ.వీ ఛానళ్లలో వస్తున్న సమాచారాన్ని అర్థం చేసుకోవడానికి తగిన పనిముట్లను, విశ్లేషణాసాధనాలను మీరు అందిస్తున్నారు. కృతజ్ఞతలు. చాలా విషయాల మీద మీరు ఏం రాస్తారా అని ఎదురుచూస్తున్నాం.

– రవి
ఒంగోలు

అకడమిక్ వ్యాసాల గురించి ఇదివరకు కొందరు పాఠకులు అసంతృప్తి వెలిబుచ్చినప్పటికీ మీరు అటువంటి రచనలు వేస్తూనే ఉన్నారు. జనవరి సంచికలో ప్రజాస్వామ్య వ్యవస్థలో పత్రికల పాత్ర – ఒక పరిశీలన వ్యాసంలోగాని, కోయజాతి జీవన విధానం – ఒక పరిశీలన వ్యాసంలోగాని కొత్త పరిశీలనలు ఏమయినా ఉన్నాయా? అవి ఆయా రచయితలకు అకడమిక్‌గా పేరు చూపుకోవటానికి పనికి రావచ్చు గాని పాఠకులుగా మాకు ఎందుకు పనికి వస్తాయి? మీ పత్రిక విలువను ఇటువంటి వ్యాసాలతో తగ్గించకండి

– కె. సుదర్శన్
గోదావరిఖని

'వందేమాతర వివాదం – అపోహలు, యథార్థాలు' డా. ఎస్.ఎం. రహ్మతుల్లా గారి వ్యాసం చదివాను. ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్య, లౌకిక రాజ్యంలో మొట్టమొదట దేశానికి గౌరవమివ్వాలా? లేక తన మతానికి గౌరవమివ్వాలా? వివరిస్తే బావుండేది.

బానిసత్వ బంధనాల్లో చిక్కి అలమటిస్తున్న భారతజాతిలో పౌరుషాగ్నిని జ్వలింపజేసిన మహామంత్రం "వందేమాతరం". తెల్లవాడి కరకు తూటాలకు గుండెలు ఎదురొడ్డిన సగటు భారతీయుడి రణన్నినాదం వందేమాతవం. విభజించి పాలించిన బ్రిటిష్ పాలకుల కూటనీతికి విరుగుడుగా ఆనాడు ముప్పయికోట్ల జనావళి (ముస్లింలతో కలిపి) లో చలనశీలాన్ని, జ్వలనశక్తిని నింపి, పోరుబాటలో సంఘటితంగా కదం తొక్కించిన వందేమాతరానికి సరిపోలిక ప్రపంచ స్వాతంత్ర్య సంగ్రామాల చరిత్రలో నభూతో నభవిష్యతి. కోట్లాది భారతీయుల్లో గుండెల్లో కొలువైన గేయమది.

వందేమాతర గేయంలో ఎంపిక చేసిన చరణాలు యావత్ జాతికి బెంగాల్ ఇచ్చిన బహుమతి అని 1939 నాటి హరిజన్ సంచికలో మహాత్మా గాంధీ ప్రస్తుతించారు. స్వాతంత్ర్యోద్యమానికి పర్యాయపదంగా నిలచిన వందేమాతరం స్థానం సుస్థిరమైందంటూ పండిత్ నెహ్రూ 1948లో అంజలి ఘటించారు. అంతటి ఉత్కృష్ట చరిత్ర గల్గిన జాతీయగీతం నేడు రాహువుల పాలబడి వివాద గ్రస్తమవుతున్న తీరు ఆలోచనా పరుల్ని కలచివేస్తున్నది. స్వాతంత్ర్య ఉద్యమ సారథ్యం తమదేనంటూ భుజకీర్తులు తగిలించుకొనే కాంగ్రెసు పార్టీలోని కొందరు నాయకులు ఇప్పటి వ్యర్థ రాద్ధాంతానికి శ్రీకారం చుట్టిన ఘనులు.

ఇప్పుడు ఆలపిస్తున్న వందేమాతరం గేయం తొలిరెండు చరణాల్లో ముస్లింలకు అభ్యంతరకరమైనది ఏముంది? భారతమాతకు వందనం తియ్యని నీటితో కమ్మని పండ్లతో, చల్లని గాలులతో పచ్చని పైరుతో విలసిల్లే భారతమాతనకు వందనం, రాత్రులు తెల్లని వెన్నెలతో పులకిస్తూ విరబూసిన చెట్లతో శోభిస్తూ, స్వచ్ఛమైన నువ్వులతో, మధురమైన మాటలతో మాకు సుఖాలు కలిగిస్తూ వరాలనిచ్చే భారతమాతకు వందనం అంటూ దేశాన్ని తల్లిగా భావిస్తూ నమస్కరించడంలో ఎవరైనా ఎందుకునొచ్చుకోవాలి?

వందేమాతరంపై లోతైన అధ్యయనం చేసిన త్రిసభ్య కమిటీ దాదాపు ఏడు దశాబ్దాల క్రితమే సర్వ సమ్మత గేయంగా దాన్ని నిర్ధారించినప్పుడు, స్వాతంత్ర్య వజ్రోత్సవ సంవత్సరంలో ఈ తరహా రాద్ధాంతాలకు తావెక్కడిది?

– జూల ముత్తెన్న
మెదక్

### రచయితలకు సూచన

**ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడ అంతే. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.**

- సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. అంటే ఏ నెల సంచిక ఆ నెల మొదటి వారానికల్లా పాఠకులకు చేరుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారం లోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028

# కొత్తపుస్తకాలు









- **నీతిశాస్త్రం, నైతిక జీవితం** (ఎథిక్స్ అండ్ ది మొరల్ లైఫ్) - హోరాల్డ్ హెచ్.టిటస్ - అనువాదం : అర్వియార్ మాస్టారు - లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ, 20 పేజీలు, 1/8 డెమీ, రు. 6, ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 5-85-4/బి, పండరీపురం, 1వ లైను, గుంటూరు - 522 002.
- **మార్క్స్ తదనంతరకాల కొన్ని మార్క్సిజపు ధోరణులు** - డేవిడ్ మెక్‌లలాన్ - అనువాదం : ఇంగువ మల్లికార్జునశర్మ - లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ, 188 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 5-85-4/బి, పండరీపురం, 1వ లైను, గుంటూరు.
- **దర్పణం** కవితా సంపుటి - గురు కంభంపాటి, 44 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : గురు కంభంపాటి, కనుమలచెరుపు పోస్టు, బొల్లాపల్లి మండలం, గుంటూరు జిల్లా - 522 657, మరియు అన్ని ముఖ్య పుస్తక విక్రయ కేంద్రాలు.
- **భారత సామాజిక విప్లవ పరివర్తన** - అవగాహన - కామ్రేడ్ వసంతాడ రామలింగాచారి - కామ్రేడ్ వసంతాడ రామలింగాచారి స్మారక కమిటీ ప్రచురణ, 232 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : ఎన్. అప్పలాచారి, శేషాద్రిపురం, వయా పొందూరు, శ్రీకాకుళం జిల్లా, మరియు అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో.
- **బతికిన కోడు** - కందుకూరి రమేష్‌బాబు - సామాన్య శాస్త్రం ప్రచురణ, 120 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : అన్ని ప్రధాన పుస్తక కేంద్రాల్లో లభిస్తాయి.
- **చిన్నితెర చిత్రాలు** - డా. గోపు లింగారెడ్డి - సుషమా పబ్లికేషన్స్ ప్రచురణ, 99 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : డా. గోపు లింగారెడ్డి, 7-1-249, మంకమ్మతోట, కరీంనగర్ - 505 001, మరియు అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో.
- **వార్తామాధ్యమాల విశ్వసనీయత** - తెలుగు పత్రికల, ఛానళ్ల వర్తమాన పోకడలు - డా. నాగులపల్లి భాస్కరరావు, నాగసూరి వేణుగోపాల్, కృష్ణప్రకాష్, సెంటర్ ఫర్ మీడియా స్టడీస్, హైదరాబాద్ 2006 నవంబర్ 8న నిర్వహించిన సెమినార్, 54 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : సిఎమ్ఎస్ 1300-ఎ, రోడ్ నెం. 66, జూబిలి హిల్స్, హైదరాబాద్, ఆకాష్ పబ్లికేషన్స్, జి-14, ఇండస్ట్రియ్ ఎస్టేట్, సామలకోట్.
- **జిహాద్ -** ముహమ్మద్ అబ్దుర్రషీద్ - 56 పేజీలు - 1/8 డెమీ. రు. 25, ప్రతులకు : ముహమ్మద్ అబ్దుర్రషీద్, 19-2-127/బి/8/సి, న్యూ రోడ్, తాడ్‌బన్, హైదరాబాద్ - 500 064. సెల్ : 98485 16163
- **ప్రత్యేక తెలంగాణ ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించదు నూతన ప్రజాస్వామిక విప్లవమే ఏకైక ప్రత్యామ్నాయం -** ప్రత్యేక తెలంగాణ పై సి.పి.ఐ (ఎం-ఎల్) వైఖరి, జనవిమోచన సి.పి.ఐ. (ఎం-ఎల్) ప్రచురణ - 55 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : జి.వి. రాఘవులు, అన్నపూర్ణ పౌల్ట్రీ కాంప్లెక్స్, జగ్గంపేట, తూర్పుగోదావరి, సహచర బుక్‌మార్క్స్, దిశ బుక్‌హౌస్
- **ప్రపంచీకరణ - విద్య -** చుక్కా రామయ్య - రామయ్య విద్యాపీఠం ప్రచురణ, 146 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు : జూలూరు గౌరిశంకర్, జర్నలిస్టు, సంపాదకుడు, 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్, మరియు అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో.








# 2007 సంవత్సర ఆరంభములో దేశ ఆర్థిక స్థితిగతులు

**– వి. చలపతిరావు**

2007 సంవత్సర ఆరంభములో మనదేశ ఆర్థిక స్థితిగతులు, ఈ సంవత్సరంలో ఎలా ఉండగలవో సమీక్ష చేసుకోవటం అవసరం. మన దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం లభించి 60 సంవత్సరంలు గడిచిపోయినవి. ఇప్పటికి 10 పంచవర్ష ప్రణాళికలు అమలు పరచబడినవి. ఈ సంవత్సరం నుండి 11వ పంచవర్ష ప్రణాళిక అమలు పరుచుటకు గాను ప్రణాళిక సంఘము తయారు చేసిన దానికి సంబంధించిన అప్రోచ్ పేపర్‌ను జాతీయ అభివృద్ధి మండలి సమావేశంలో ఇటీవల ఆమోదించడమయినది. జాతీయ అభివృద్ధి మండలి సమావేశం లో పాల్గొన్న రాష్ట్రాల ముఖ్యమంత్రులు తమతమ రాష్ట్రాలకు సంబంధించిన అభివృద్ధి అంశాలపై ముఖ్యంగా కడు సంక్షోభంలో ఉండి రైతులు ఆత్మహత్యలకు కారణమవుతున్న వ్యవసాయ రంగమును గట్టెక్కించుటకు విపులంగా చర్చించినట్టు లేదు. ఈ దేశంలో ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టి 16 సంవత్సరంలు గడిచినవి. పశ్చిమ దేశాలు, ప్రపంచబ్యాంక్ ప్రతిపాదిత సదరు ఆర్థిక సంస్కరణలు అమలు వలన మన దేశం ఆర్థిక వ్యవస్థ ప్రస్తుతం 8 శాతం జి.డి.పి. సాధనతో ముందుకు పోతున్నదని మన ప్రధానమంత్రి, ఆర్థికమంత్రి గర్వంగా చెప్తున్నారు. అయినను 100 కోట్లకు మించి జనాబా ఉన్న ఈ దేశానికి ఇప్పటికి ఆర్థిక స్వాతంత్ర్యం రాలేదు. ఎందుకంటే ఈ దేశంలో 50 శాతం ప్రజలు ఇప్పటికీ కటిక దారిద్ర్యంలో (దారిద్ర్య రేఖకింది భాగంలో) నివసించుచున్నారు.

కాని ప్రణాళిక సంఘము, ఆర్థిక శాఖల వార్షిక అభివృద్ధి రిపోర్టులలో మాత్రం బీదరికం రేఖ కింది నివసించే వారి సంఖ్య మొత్తం జనాభాలో 27 శాతంనకు తగ్గినట్టు చూపుతున్నారు. ఇంకొకవైపు ప్రజా పంపిణి స్కీం కింద సదరు బీద జనులకు ఇచ్చే తెల్లకార్డుల ప్రకారం, బీదరికం రేఖ కిందనివసించే ప్రజలు 65 శాతం అని చెప్పబడుతున్నది. అదే విధంగా కేంద్ర స్కీంల కింద ఎక్కువ నిధులు గ్రాంటుల రూపంలో పొందటానికి రాష్ట్ర ప్రభుత్వాలు తమ రాష్ట్రాలలో గల బీదరికపు రేఖ కింద నివసించే వారి సంఖ్య కూడ ఎక్కువ చేసి చూపటం ఆనవాయితి అయింది. కనుక వాస్తవంగా బీదరికపు రేఖ కింది ఉండే వారి సంఖ్య ప్రణాళిక సంఘం, ఆర్థిక శాఖ అభివృద్ధి రిపోర్టులలో గల 27 శాతంనకు, ప్రభుత్వాలు తమ ఓటు బ్యాంకులను పెంచుకొనుటకు అర్హతలేని వారికి కూడ తెల్లకార్డులు ఇచ్చిన, కేంద్ర గ్రాంట్లు పొందుటకు ఎక్కువచేసి చూపే సంఖ్య 65 శాతం నకు మధ్య ఉండగలదని, అంటే 50 శాతంగా అంచనా వేయడమయినది. ఇక్కడ విచారించవలసిన విషయమేమిటంటే, భారతదేశం 2010 వరకు ప్రపంచంలో ఒక పెద్ద ఆర్థిక శక్తిగా, 'సూపర్ పవర్'గా ఎదగ గలదని అప్పటి వరకు ఈ దేశపు జి.డి.పి. 9 నుండి 10 శాతం వరకు పెరగ గలదని మన ప్రధానమంత్రి, ఆర్థికమంత్రితో సహా ప్రభుత్వంలోని వివిధ నాయకులు చెప్పుచున్నారు. అభివృద్ధి శాతం రిత్యా మన దేశం ఒక ఆర్థిక శక్తిగా ఎదుగుచుండవచ్చును. కాని ఒక దేశంలో సుమారు 50 శాతం ప్రజలు బీదరికంలో జీవస్తుంటే ఆ దేశాన్ని ఆర్థిక శక్తి, సూపర్ పవర్ అని అనగలమా? ఆర్థికాభివృద్ధి ఫలాలు దేశంలోని బీదవారికి కనీసం మౌలిక విషయాలలో కూడ అందకూడదా? ఇటీవల ప్రభుత్వ సంస్థ అయిన జాతీయ సాంపిల్ సర్వే సంస్థ వారి సర్వే ప్రకారం దేశం లోని ముప్పది కోట్ల ప్రజల తలసరి రోజు ఆదాయం కేవలం 12 రుపాయలని తేలింది. అందుకే దేశంలోని గిరిజనులు దళితుల పరిస్థితి చాలా హీనంగా ఉంది. అందుకు తోడుగా దేశంలోని ప్రజాపంపిణి విధానము బలహీనపడింది. తెల్లకార్డుల మీద వీరికి సరఫరా అయ్యే బియ్యం, గోదుమలు వగైరా అత్యవసర వస్తువులు గత 2 సంత్సరంలనుండి సజావుగా సరఫరా కావటం లేదు. ఇటీవల కిరోసిన్ కోట కూడ తగ్గించారు. ప్రజా పంపిణి కొరకు కేటాయించిన వేలాది క్వింటాళ్ల బియ్యం చీకటి బజార్‌కు పోతున్నవి.

దేశంలోని బీదలకు సహాయకారిగా ఉండే ప్రభుత్వ పాఠశాలలు, ఆస్పత్రులు, సహకార సంస్థలు రోజురోజుకు బలహీనపడుచున్నవి. ప్రైవేటైజేషన్, గ్లోబలైజేషన్ మత్తులో ప్రభుత్వాధి నేతలు, అధికార్లు కార్పొరేట్ హాస్పిటల్లను, విద్యాసంస్థలను, ప్రైవేట్ బ్యాంకులను ఎక్కు ప్రోత్సహిస్తున్నారు. కార్పొరేట్ హాస్పిటళ్లు, బీద మధ్యతరగతి రోగులను బాగు చేయటమేమో కాని, లక్షలలో బిల్లులు వేసి వారి మూలుగులను పీల్చుతున్నారు. కార్పొరేట్ కాలేజీలు, విద్యాసంస్థలు ఇతర వ్యాపార సంస్థల వలె షట్టర్లలో, అపార్ట్‌మెంట్‌లలో నడుస్తున్నాయి. పరీక్షలలో ఉత్తీర్ణతా శాతం ప్రాధాన్యంగా విద్యార్థులకు విద్య ఇవ్వటం, విద్యార్థుల మానసిక శారీరక వికాసం కొరకు ప్రాధాన్యం ఇవ్వకపోవటం, ఈ విద్యా సంస్థల విధానంగా మారినది. అందుకనే ఈ కాలేజీలలో చదివే విద్యార్థుల ఆత్మహత్యలు రోజురోజుకు ఎక్కువ అవుచున్నవి. అలాగే ప్రైవేట్ బ్యాంకులు అధిక శాతం వడ్డీపై ప్రజలకు అప్పులు ఇవ్వటం, గుండాలు రౌడీలను పెట్టి రుణాలు వసూలు చేయటం ఈ బ్యాంకుల విధానం అయినది. ఈ లక్షణాలన్ని ఒక బలమయిన ఆర్థిక వ్యవస్థలో ఉంటాయా? ఆర్థికంగా అభివృద్ధి అయిన యూరప్ దేశాలలో గల ప్రైవేట్ సెక్టర్ లక్షణాలు కూడ ఈ విధంగానే ఉన్నాయా? ప్రపంచ బ్యాంకు కన్ను సన్నలలో పెరుగుతున్న, సామాజిక బాధ్యతరాహిత్యంగా పెరుగుతున్న ప్రైవేట్ రంగంలోని సదరు మౌలిక సంస్థల చేతులలో ఈ దేశపు బీదవారి భవిష్యత్తు పదిలంగా ఉందా, అన్నది మేధావులు, ఆర్థికవేత్తలు, బాధ్యతాయుత రాజకీయులు ఆలోచించవలసి ఉంది.

70 శాతం ప్రజల బతుకుదెరువుకు ఆధారంగా ఉన్న వ్యవసాయ రంగం గ్రామీణ రంగము కడు సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్నాయి. ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టిన తరువాత కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పూర్తిగా పట్టణీకరణకు, ప్రైవేట్ పారిశ్రామీకరణకు ప్రాధాన్యాన్ని ఇస్తున్నాయి. ముఖ్యంగా ఐ.టి. సెక్టర్‌పై ఎక్కువ ధ్యాస చేస్తున్నాయి. ఈ ఐ.టి. యుగంలో ప్రపంచంలో అభివృద్ధి చెందిన దేశాలతో పోటీ పడటానికి కొంతవరకు పట్టణీకరణ పారిశ్రామీకరణ అవకరమే కాని,

వ్యవసాయ ప్రాధాన్యమైన మన దేశంలో వ్యవసాయ రంగాన్ని గ్రామీణ వృత్తులను పరిశ్రమల వికాసాన్ని విస్మరించదగునా? ప్రపంచంలో అత్యధిక సంపన్నమైన అమెరికా దేశంలో ప్రభుత్వం వ్యవసాయ రంగానికి సబ్సిడీలు ఇవ్వటం లేదా? వ్యవసాయ ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు ఇప్పించటం లేదా? వ్యవసాయ పరిశోధనలకు ప్రాధాన్యత ఇవ్వటం లేదా? మరి మన దేశంలో ప్రభుత్వం వ్యవసాయ రంగంలో పెట్టుబడులను ఎందుకు తగ్గిచింది? ఎఫ్.సి.ఐ., కాటన్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లాంటి సంస్థలు వరి, గోధుమ తదితర ఆహార ధాన్యాలకు గిట్టుబాటు ధర ఇప్పించుటకు అలాగే రైతులు ప్రస్తుతం విస్తృతంగా పండిస్తున్న పత్తికి గిట్టుబాటు ధరలు ఇప్పించుటకు మార్కెట్‌లో ప్రవేశించి కొనుగోలు కేంద్రాలు ఎందుకు పెట్టటం లేదు? ఎందుకు రెండు పంటలు పండే భూములను కూడ బలవంతంగా ప్రభుత్వం సేకరించి రిలైన్స్, టాటా లాంటి పెద్ద పారిశ్రామిక వేత్తలకు అంటగడుతున్నది. రైతుల నుండి నేరుగా మార్కెట్ ధరలకు కొనే ఆర్థిక శక్తి వారికి ఉంది కదా. ఇంగ్లీష్‌లో సామెతలాగా పాల్‌ను దొచి పీటర్ కు ఇచ్చినట్లుంది. కాకుల కొట్టి గద్దలకు వేసినట్లుంది ప్రభుత్వ ఆర్థిక విధానం.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తాము తలపెట్టిన జలయజ్ఞానికి 50,000 కోట్లతో పూర్తి చేస్తామని చెప్పుతూ, 2006-07 సంవత్సరపు బడ్జెటులో అన్ని తరహాల నీటిపారుదల ప్రాజెక్టులకు కలిపి 10,000 కోట రుపాయలు కెటాయించారు. ఇవి కాక ఈ సంవత్సర బడ్జెటులో వ్యవసాయం, ఇతర అనుబంధ రంగాలకు 1788 కోట్లు కెటాయించారు. మొత్తం 63,000 కోట్ల బడ్జెటులో సుమారు 20 శాతం బడ్జెటు నిధులు నీటిపారుదల, వ్యవసాయ రంగానికి కేటాయించారు. అయినను ఇరిగేషన్ ప్రాజెక్టు పనులు ఒకవైపు సాంకేతిక అనుమతులు లేక రెండవ వైపు డిపార్ట్‌మెంట్ జాప్యము జరుగుట వలన, ఇంకొకవైపు ఖరీఫ్ సీజన్‌లో కరెంటు సరపరా 9 గంటలు ఇవ్వజాలమని ప్రభుత్వం రైతులకు ఆరు తడి పైర్ల వేసుకొమ్మని ఆదేశించింది. తత్ఫలితంగా మెట్ట ప్రాంతాలలోనే కాక ప్రాజెక్టు ఆయ కట్టులలో కూడ పత్తి ఇతర ఆరు తడి పంటలు వేశారు. కాని ఇవ్వాళ రైతులు తాము కష్టపడి పండించిన పత్తి వేలాది లక్షలాది క్వింటాళ్లను అమ్మకానికి మార్కెట్లకు తరలిస్తే వాటిని కొనే నాధుడు లేడు, ఒకవేళ కొన్నా గిట్టుబాటు ధర పెట్టడం లేదు. కాటన్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా కొనుగోళ్ల సెంటర్ల జాడలు లేవు. అదిలాబాద్, కరీంనగర్ లాంటి మార్కెట్లలో రైతులకు గిట్టుబాటు ధర (కనీసం క్వింటాలుకు రు. 2000) లభించక వారు నానాఇబ్బందుల పాలవుతున్నారు. గిట్టుబాటు ధర లభించక తాము పెట్టుబడులకు తెచ్చిన అప్పులను తీర్చలేరు. అప్పులు తీరకపోతే రైతుల ఆత్మహత్యల పాలవుతున్న సంగతి మనం నిత్యం చూస్తునే ఉన్నాం. వై.ఎస్. ప్రభుత్వం తమ బడ్జెట్ కలల బడ్జెట్ అని మురిసిపోయింది. కాని ఈనాడు వ్యవసాయ దార్ల ఆర్థిక స్థితి గతులలోకాని ఆత్మహత్యలు ఆగిపోవటంలో గాని ఎలాంటి పురోగతి కనబడటం లేదు. జయతీ ఘోష్ కమీషన్ సిఫార్సులను అమలు పరిచామని ప్రభుత్వం చెప్పుతుంది. కాని వ్యవసాయ దార్ల స్థితి గతులలో ఏమీ మార్పులేదు.

ప్రస్తుతం రైతులు ఎన్నడు లేనంత కరెంటు సంక్షోభమును ఎదుర్కొంటున్నారు. భూ గర్భజలం పుష్కలంగా ఉన్నను బోర్లతో నీరు తోడుకొని పంటలు పండించుకుందామంటే అవసరం అయిన కరెంటు సరఫరాలేదు. ఈ కరెంటు సంక్షోభానికి చంద్రబాబు పాలనే కారణం అని ప్రస్తుత ముఖ్యమంత్రి పదేపదే అంటుంటాడు. ఆయన చెప్పిన దానిలో కొంత సత్యం ఉండవచ్చును. ఎందుకంటే బాబు పూర్తిగా ప్రపంచ బ్యాంకు ఏజెంటుగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రిగా పనిచేసిన దాని కన్న ఎక్కువ చీఫ్ ఎక్యూగూటివ్‌గా వ్యాపార శైలిలో పనిచేసి, వ్యాపార రంగాన్ని ముఖ్యంగా ఐ.టి. రంగానికి, పట్టణీకరణకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి రైతుల సంక్షేమాన్ని, వ్యవసాయ రంగాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేశాడు. అందుకే ఆయన ప్రభుత్వాన్ని రైతులు కూలీలు అందరూ కలిసి 2004 ఎన్నికలలో కూలదోశారు. ఆయనకు తగు గుణపాఠం దొరికింది. కాని వై.ఎస్. ప్రభుత్వం గత రెండున్నర సంవత్సరాల నుండి ఈ కరెంటు సంక్షోభాన్ని తప్పించటానికి చేసిన కృషి ఏమిటో చెప్పాలి. సాగర్, శ్రీశైలం జలాశయాలలో తగు నీరున్నప్పటికీ కరెంటు ఉత్పత్తిని ఎందుకు ఆపినాడో వైఎస్ ప్రభుత్వం ఒక వైట్ పేపర్ ద్వారా ప్రజలకు, రైతు లోకానికి చెప్పవలసిన బాధ్యత లేదా? నేను రైతు బాంధవుడినని, రైతులకు ఉచిత కరెంటు సరఫరా చేయగలనని, ఎన్.టి. రామారావు శైలిలో ఎలాగయితే ఆయన మధ్య నిషేధాన్ని అమలు చేస్తానని ఎలక్షన్ మానిఫెస్టోలో పెట్టి మహిళల ఓట్లతో వచ్చాడో అలాగే వైఎస్ కూడ గద్దెనెక్కాడు. అధికారానికి తుదకు తెలుగుదేశం ప్రభుత్వ హయాంలోనే గ్రామాలలో పట్టణాలలో అటు గుడంబాను ఇటు చీప్ లిక్కర్ను ఏరులైపారించారు. గ్రామాలలో రైతులు, కూలిజనం, పట్టణాలలో పట్టణబీదలు ఈ పాలకుల పుణ్యమా అని తాగుడుకు బానిసలై అకాల మరణాలకే కాక మానసికంగా బలహీనపడి కొద్ది అప్పులబాధకు ఆర్థిక బాధలకు కూడ తట్టుకోలేక ఆత్మహత్యలకు గురి ఎలా అవుతున్నారో, అదే విధంగా వైఎస్ మ్యానిఫెస్టోలో పెట్టినట్లుగా ఇప్పుడు కరెంటు సప్లయిలేక పంటలు ఎండిపోయి నష్టపడి ఆత్మహత్యలకు లోనవుతున్నారు. వీరు ఇరువురు ప్రజలను మోసం చేసి అధికారమునకు వచ్చినట్లే గదా. ప్రజలను మోసం చేసిన వారిని ప్రజలు గర్తించి వారికి తగు గుణపాఠం చెప్పే చైతన్యం ప్రజలలో ఇప్పుడే కనబడుతున్నది. కరీంనగర్ ఓటర్లలో అలాంటి చైతన్యం కనపడింది. ఇదంతా ఇక్కడ ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే పాలకులు చేసిన మోసాల వల్ల ప్రజలు ముఖ్యంగా యువకులు అకాల మృత్యువాతన పడుతున్నారు. దానివల్ల దేశంలో అనవసరంగా మానవ వనరుల నష్టం జరుగుతున్నది. ఒకవైపు ఉన్నత విద్యనభ్యసించి సాంకేతికంగా నైపుణ్యం సంపాదించిన వారంతా ఎక్కువగా విదేశాలు వెడలిపోవుచున్నారు. ఇంకొకవైపు పల్లెలలో పట్టణాలలో యువ కర్షకులు కార్మికులు ప్రభుత్వం తప్పుడు విధానల వల్ల అకాల మరణాలకు లోనువుతున్నారు. ఈ ప్రభుత్వాలు ఎంతసేపు దేశాభివృద్ధిని జి.డి.పి. పెరుగుదలతో కొలచే వారే కాని, దేశపు మానవ వనరులు నష్టపడి ఎలా దేశం నష్టపడుచున్నదో గుర్తించటం లేదు. ఇండియాకు పెద్ద సంపద మానవ వనరులే. కనుక ప్రణాళిక కర్తలు, రాజకీయులు, ఈ మానవ వనరులు, ఎయిడ్స్ ద్వార, అకాల చావు ద్వార, ఆత్మహత్యల ద్వార నష్టం కాకుండా తగు ప్రణాళికలు వేయటం అవసరం. వాటిని పకడ్బందిగా అమలు చేయటం పాలకుల బాధ్యత.

*(మిగతా 49వ పేజీలో...)*

# మన విద్యారంగం ఓ చిల్లు కుండ

**- వి. హనుమంతరావు**

దేశంలో ఒకటో తరగతిలో చేరిన బాలబాలికల్లో పదోతరగతి వచ్చేసరికి 66 మంది చదువు మానేస్తున్నారు (డ్రాప్‌అవుట్స్). వీరిలో బాలురు 64 మంది మానేసుంతటే బాలికలు 69 మంది మానేస్తున్నారు. ఇవి కేంద్ర ప్రభుత్వ మానవాభివృద్ధి మంత్రిత్వ శాఖ లెక్కలు. అక్షరాస్యత పెరిగిందని కాలరెగరేసుకొని చెబుతున్న ప్రభుత్వమే ఈ గణాంకాల నిస్తుందంటే, ఇది చాలా ఆందోళన కలిగించే విషయం. ఇటు ప్రభుత్వ స్థాయిలో, అటు వివిధ సంస్థలు చేసిన అధ్యయనాల్లో బహిర్గతమైన వాస్తవం.

1960-61 నంచి చూచుకొంటే క్రమక్రమంగా ఇలా బడికి వెళ్లటం మానేసే పిల్లల శాతం తగ్గుతూ వస్తున్నా, ఇంకా ఇంత శాతం మంది మానేయటం కలవరపపరిచే విషయమే. ప్రభుత్వ గణాంకాల ప్రకారం విద్యార్థులు పై తరగతులకు వెళ్లేకొద్దీ బడి మానేసే వారి సంఖ్య పెరుగుతూ వస్తుంది. ఉదాహరణకు ఒకటి నుంచి అయిదవ తరగతి వరకు 39 శాతం మానేస్తుంటే, ఒకటి నుంచి ఎనిమిదో తరగతికి వరకూ ఈ శాతం 55కు, 10వ తరగతి వచ్చేసరికి 66కు పెరుగుతూ వచ్చింది. అంటే మూడో వంతు మంది మాత్రమే 10వ తరగతి దాటి చదువు కొనసాగిస్తున్నారు.

దేశంలో విద్యా పరిశోధనా సంస్థలు ఈ పరిణామాన్ని రాష్ట్రాలకు పరిమితమై, లేదా కొన్ని ఎంపిక చేసిన పాఠశాలలకు పరిమితమై మరింత లోతుగా అధ్యయనాలు చేశాయి, చేస్తున్నాయి. ఈ అధ్యయానాల్లో తెలియవచ్చిన కొన్ని విషయాలు చూడండి.

- చదువు చాలించిన వారిలో ఇంట్లో పనులు చేయడానికి వారిదే అత్యధిక శాతం. అందులోనూ బాలికలు ఎక్కువ అని జాతీయ శాంపిల్ సర్వే తెలియ చేసింది. పట్టణాల్లో 28 శాతం, గ్రామాల్లో 40.8 శాతం పిల్లలు పై కారణంగా చదువు మానేస్తున్నారు.
- భార్యాభర్తలిద్దరూ పనులకు పోయే కుటుంబాల్లో తల్లితండ్రుల అజమాయిషీ లేకుండా పిల్లలు జీవిస్తున్నారు. తల్లితండ్రులకు, బిడ్డలకు మధ్య సంబంధం యాంత్రికమవుతుంది.
- తల్లి తండ్రులు ప్రశ్నిస్తే, చదువుకోవటం మంచిదే కాని, మాకెలా కుదురుతోందని అంటారు.
- కేంద్రం 1999 లో ఒక సర్వే జరిపింది. పేద వర్గాల్లో 728 విద్యార్థుల్లో 611 మంది చదువు చాలించగా, మధ్య తరగతి వర్గంలో 468 కు గాను 284, ఉన్నత వర్గంలో 54 మందికి గాను 24 మంది చదువు నిలుపుదల చేశారు. కుటుంబ ఆదాయం పెరిగే కొద్దీ, చదువు మానేసే పిల్లల సంఖ్య తరుగుతూ వచ్చింది.
- చదువు మీద ఆసక్తి ఉన్న వారితో పోలిస్తే, ఆసక్తి లేని వారిలో సుమారు ఎనిమిది రెట్ల మంది చదువు మానేసే అవకాశం ఎక్కువగా కనిపించింది.
- ప్రాథమిక స్థాయి విద్యార్థి తర్వాత క్లాసుకు వెళ్లే సరికి చదువు మానేసే ఆలోచన 2.7 సార్లు పెరుగుతుంది.
- ప్రైమరీ స్కూళ్లు మాత్రమే ఉన్న గ్రామాల్లో విద్యార్థులు సెకండరీ విద్యకు దగ్గిర గ్రామానికి వెళ్లే అవకాశం తగ్గి చదువు మానేయటం జరుగుతోంది.
- ఆసక్తికరమైన విషయమేమంటే హిందూ విద్యార్థి కన్నా ముస్లిం విద్యార్థి చదువు మానేసే అవకాశం 1.9 రెట్లు ఎక్కువ ఉంది.
- తల్లి తండ్రులు విద్యావంతులైతే, చదువు మానేసే ప్రసక్తి 16 శాతం తగ్గుతుంది.
- మధ్యతరగతి కుటుంబం నుంచి వచ్చిన విద్యార్థి కన్నా, పేద తరగతి నుంచి వచ్చి చదువు మానేసే వారి సంఖ్య రెట్టింపు ఉంటుంది. అలాగే ఉన్నత కులాల వారితో పోలిస్తే వెనుకబడిన కులం విద్యార్థి చదువు మానేసే అవకాశం 3.2 రెట్లు ఎక్కువ ఉంది.
- తండ్రి కేవలం ఇంట్లో ఉంటే సరిపోదని, కొడుకుతో కొంతసేపు గడపటం,మంచిచెడ్డ చెప్పటం, ప్రేమతోచూడడం, విద్య ప్రాముఖ్యత గురించి చెప్పటం వల్ల పాఠశాలకు వెళ్లాలనే ఆసక్తి బలపడుతుంది.

**కారణాలేమిటి?**

1) మొట్టమొదటగా అందరూ చెప్పే కారణమేమంటే కుటుంబ పేదరికం వల్ల బాలబాలికలు కూడా పనిలోకి వెళ్లి నాలుగు డబ్బులు సంపాదిస్తే తప్ప అందరికీ రెండు పూటల మాట అటుంచి, ఒక పూట అయినా తినలేని పరిస్థితి. దేశంలో 26 శాతం ప్రజలు పేదరికపు రేఖ కింద నివసిస్తున్నారు. వీరందరికి ముందు బతకటం ముఖ్యం. బతకాలంటే బిడ్డలు కూడా పని చేయాల్సిందే.
2) రెండవ ముఖ్య కారణం కులం. మాలోడికి చదువెందుకు? అనేది గ్రామాల్లో తరచు వింటుంటాం? వాళ్లు చదువుకుంటే మన మాట వింటారా? అనేది గ్రామాల్లోని పెత్తందార్ల మాట. నేటికి వెనుకబడిన ప్రాంతాల్లోని కొన్ని గ్రామాల్లో పాఠశాలను ఏర్పాటు చెయ్యనివ్వరు. చెప్పుకింద తేలులా వాళ్లు అలా పడి ఉండాల్సిందే. గ్రామీణ వ్యవస్థలో ఫ్యూడల్ వ్యవస్థ ఇంకా ఉన్నదనడానికి ఇది నిదర్శనం.
3) చదువుకొని తల్లితండ్రులున్న కుటుంబం విద్య ప్రాధాన్యత, అవసరం గుర్తించకపోవటం, తల్లితండ్రులు ఏ పనిచేస్తే, పిల్లల్ని కూడా అదే పనిలో పెట్టడం (చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి వగైరా) 'మా తాతల నుంచి ఈ పనే చేస్తున్నాం, వాడూ అదే పని చేస్తాడూ' అనేది తల్లితండ్రుల ఆలోచన, ఆచరణ.
4) బాలికల పరిస్థితి మరీ అధ్వానం. తల్లితండ్రులు కూలిపనికి పోతే, ఇంట్లో పిల్లల్ని సాకడానికి కూతురు ఇంటి వద్దనే ఉండిపోవాల్సిన అవసరం. కాగా వారు పాఠశాలకు వెళ్లనే వెళ్లరు. వెళ్లినా త్వరలోనే మానేస్తారు.
5) 'చదువుకొన్న వాళ్లకే ఉద్యోగాలు లేవు, మావోడు చదువుకొని ఏం చేస్తాడు?' అనేది తల్లితండ్రుల స్పందన. ఇది అవాస్తవికమైన విషయమేమీ కాదు.

6) పాఠశాలకు వెళ్లడం అనేది, ఆ కుటుంబం నివసించే పరిసరాల మీద కూడా ఆధారపడి ఉంటుంది. ముఖ్యంగా మురికివాడల్లో నివసించే కుటుంబాల్లోని పిల్లలు ఆటల మీద శ్రద్ధ ఎక్కువగా ఉంటుంది. ఇంట్లో ఉంటే అది కావాలి, ఇది కావాలి అంటారు, బయటకు పోతేనే తల్లికి కాస్త మనశ్శాంతి ఉంటుంది అనే పరిస్థితులున్నాయి.
7) బడికి వెళ్లే పిల్లలు చదువు కొనసాగిస్తారా, మానేస్తారా అనేది పాఠశాల వాతావరణం మీద ఆధార పడి ఉంటుంది. చెట్టు కింద పాఠశాలలు, బడి భవనం ఉంటే అందులో సదుపాయల కొరత, పాఠం చెప్పాల్సిన పంతుళ్లు సరిగ్గా రాకపోవటం, వచ్చినా పిల్లలు చదువుకొని పైకి రావాలని అనే ఆలోచనకన్నా, తన జీతం కోసం మాత్రమే పని చేస్తున్ననానే ఆలోచన మీద పిల్లల అటెండెన్స్ ఆధార పడి ఉంటుంది.
8) కొన్ని కుటుంబాల్లో పిల్లలు బడికి పోతేనే బావుంటుందనే పరిస్థితి ఉంటుంది. ఇంట్లో పిల్లలు ఎక్కువగా ఉంటే, ఒకరిద్దరైనా బడికి పోతేనే తల్లికి తన పని తాను చేసుకొవడానికి అవసరమైన శాంతి లభిస్తుందనే భావన, అలాంటి కుటుంబాల్లో పెద్ద పిల్లలే పాఠశాలకు వెళ్లటం జరుగుతుంది.

**రాష్ట్రంలో**

1970–71 నుంచి 2005–06 మధ్య కాలంలో ఒకటి నుంచి ఎనిమిదవ తరగతి ఆఖరుకు చదువు మానేసిన బాలబాలికల సంఖ్య 51.30 శాతం అంటే ఒకటవ తరగతిలో నూరు మంది చేరితే, ఎనిమిదవ తరగతి వచ్చేసరికి సగానికి సగం మంది చదువుకు స్వస్తి చెపుతున్నారు. దేశం మొత్తంలో లాగే రాష్ట్రంలో కూడా క్లాసులు పెరిగే కొద్ది, మానేసే వారి శాతం కూడా పెరుగుతూ వచ్చింది. పట్టిక చూడండి

| 2005-2006 నాటికి డ్రాపవుట్లు | | |
|---|---|---|
| | 1 నుంచి 5వ తరగతి వరకు | 1 నుంచి 8వ తరగతి వరకు |
| 1970-71 | 70.63 | 81.59 |
| 1980-81 | 60.31 | 67.98 |
| 1990-91 | 54.74 | 65.07 |
| 2000-01 | 37.14 | 56.43 |
| 2001-02 | 34.54 | 53.78 |
| 2002-03 | 32.39 | 53.78 |
| 2005-06 | 24.73 | 51.30 |
| మూలం : రాష్ట్ర అర్థ గణాంక శాఖ | | |

డ్రాపవుట్ల శాతం తగ్గుతూ వచ్చినా, ఇంకా 51 శాతం మంది చదువు మానేస్తున్నారంటే రాష్ట్ర ప్రభుత్వం సిగ్గు పడాల్సిన విషయం. విద్యారంగం ఇంతనికృష్టంగా ఉంటే, నూటికి నూరు మంది బాలబాలికలను పాఠశాలల్లో చేర్పించడమే ప్రధాన కర్తవ్యంగా ప్రభుత్వం వ్యవహరిస్తుంది. చేరిన పిల్లలు సగానికి సగం మంది పాఠశాలలనుంచి నిష్క్రమిస్తుంటే ప్రభుత్వానికి పట్టదా? కుండలో నీళ్లు పోస్తుంటే కింద బొజ్జంలోంచి నీరు పోతుంటే, చెయ్యి అడ్డం పెట్టవద్దా? మధ్యాహ్న భోజన పథకం ఒక్కటే ఈ లీకేజిని ఆపగలుగుతుందా? పోనీ ఆ పథకాన్నయినా సరిగ్గా అమలు పరుస్తుందా? 2006 కాగ్ నివేదిక ప్రకారమే 2003 నాటికి అందరినీ పాఠశాలలో చేర్చాలనే కాల పరిమితిని విధించి, ఈ పరిమితిని 2005కు మార్చి, తాజాగా 2015కు మార్చింది. మొదటి రెండేళ్లు నిధులున్నా ఖర్చు చేయలేక పోయింది, మౌలిక సౌకర్యాల కొరత, పథకం ఎలా అమలువుతుందోనని మానీటర్ చేయకపోవటాన్ని కాగ్ నివేదిక ఎత్తి చూపింది. పాఠశాలల్లో ఉపాధ్యాయుల కొరత 20 శాతం మేరకు ఉంది. ఉపాధ్యాయులకు శిక్షణ అలాగే ఉంది. ఈ పథకాన్ని ఇంకా కొన్ని ప్రాంతాల్లో అమలులో పెట్టనేలేదు. పాఠశాలలను సరిగ్గా నడిపించక పోవటంతో గుణాత్మకత కొరవడింది. లక్ష్యాన్ని 2005 నాటికి చేరుకోలేదు సరికదా 2010 నాటికి కూడా లక్ష్యం సాధిస్తామనే ఆశ లేశ మాత్రమైనా లేదని కాగ్ అంటుంది. మార్చి 2005 నాటికి 1925 జనావాసాల్లో పాఠశాలలే లేవు, ఇంకా 6309 అప్పర్ ప్రైమరీ పాఠశాలల కొరత ఉంది. 54730 ఉపాధ్యాయుల కొరత కూడా ఉంది. 6316 పాఠశాలల్లో మరుగుదొడ్డి సౌకర్యం లేదు. 7531 కలర్ టీవీలు ఏర్పాటు చేశారు కాని కావాల్సిన మౌలిక సాకర్యాలు లేవు.

ఇదండీ మన విద్యారంగం పరిస్థితి, కాదు కాదు, దుస్థితి. ◆

**వచ్చే సంచికలో...**

★ **ఫోకస్ -**

# ప్రత్యేక తెలంగాణ, ప్రజాస్వామ్య తెలంగాణ అయ్యేనా?

**– అరుణ్**

**క**రీంనగర్ పార్లమెంటరీ ఉపఎన్నిక రాష్ట్రంలోనే కాక, దేశ రాజకీయాలలో (కొంతమేరకైనా) అలజడి సృష్టించిందని చెప్పవచ్చు. ఏ ఎండకా గొడుగు పట్టే పార్లమెంటరీ రాజకీయ పార్టీల అవకాశవాదం, ప్రతి ఉపఎన్నికలలో, ఆ తర్వాత కూడా నిస్సిగ్గుగా బయట పడినట్టుగా, కరీంనగర్ ఎన్నికల సమయంలో, ఆ తర్వాత కూడా వలువలూడ్చినట్టు, విలువలను వదలి బహిరంగమయింది. బూర్జువా పార్టీల విషయమలా వదిలేసినా 'కమ్యూనిస్టు' లేబుల్‌ను అతికించుకుని ప్రచారమవుతున్న పార్టీల ఉభయ కమ్యూనిస్టు పార్టీలు, చెరొక బూర్జువా పార్టీ చెంతన చేరాయి. తెలంగాణ అభివృద్ధికై ప్రత్యేక ప్యాకేజి ప్రకటిస్తానని రాజశేఖరుడు హామీ ఇచ్చాడని (బహుశా నారాయణ గారి చెవిలో ఆయనకు మాత్రమే వినబడేటట్టుగా) సి.పి.ఐ. కాంగ్రెస్‌కు మద్ధతు ప్రకటిస్తే, పంచాయితీ ఎన్నికల ముందు కాంగ్రెస్‌తో జతకట్టి, ఓట్ల లెక్కింపు తర్వాత తెలుగుదేశం పంచన చేరిన సి.పి.ఐ.(ఎం) (దీనికి 'మార్క్సిస్టు' అనే మరో లేబుల్ కూడా), కరీంనగర్‌లో సమైక్యతావాదాన్ని నెత్తినెక్కించుకున్నానని చెబుతున్న తెలుగుదేశం పార్టీ (కరీంనగర్ ఎన్నికల్లో సమైక్యతా వాదపు ఊసు కూడా ఆ పార్టీ ఎత్తలేదని బహిరంగ రహస్యం)కి మద్దతు ప్రకటించింది. దాదాపు రెండున్నర సంవత్సరాలు కాంగ్రెస్ పార్టీ పంచన చేరి, ఇక కొనసాగుతే, ప్రజల్లో తనకు నూకలు చెల్లుతాయనే భయంతో, ఆ ధృతరాష్ట్ర కౌగిలి నుండి బయటపడి, ప్రజల్లో ఉన్న (ప్రత్యేక రాష్ట్ర) బలమైన ఆకాంక్షను ఆయుధంగా ఉపయోగించుకున్నాడు కె.సి.ఆర్. అనబడే కె. చంద్రశేఖర రావు. పోతే బి.జె.పి. మాత్రం రెండింటికి చెడిన రేవడయ్యింది. 'ఒక ఓటు, రెండు రాష్ట్రాల'నే తమ కాకినాడ తీర్మానాన్ని కరీంనగర్ ప్రజలకు పదే పదే జ్ఞప్తికి చేయడంతో పాటు, ఓటర్లందరినీ (ఓటు బ్యాంకు రాజకీయాల్లో ప్రజలు 'ఓట్లు' మాత్రమే, రక్త మాంసలుండి అనేకి ఆకాంక్షలున్న సజీవ వ్యక్తులుకాదు) ఆకట్టుకొనేందుకు పార్లమెంటులో 'తెలంగాణ' పై బిల్లు ప్రవేశపెడుతూ వచ్చేసింది. ఎన్నికల్లో కేవలం 'మనీ', 'మద్యమే' గాక కుల, మత అభిమానాలు పనిచేస్తాయని, ఎంటెతోనే తాము గద్దెకెక్కి, దేశాన్ని దోచే పాలక వర్గ పార్టీలన్నీ, ఆ 'తూర్పుముక్క'ను వినియోగించాయి. ఇక ఒవైసీలు, కృష్ణమాదిగలు కాంగ్రెస్ పార్టీకి జై కొట్టారు. తెలుగు దేశం పార్టీ అయితే ఎన్నికల్లో పాల్గొనింది బి.సి. నినాదం పైనే. ఒక్క కె.సి.ఆర్. మాత్రం కులం, మతం, ఉపకులం, అన్ని సమ్మిళితమయ్యే ప్రాంతీయ అభిమానాన్ని వాడుకున్నాడు. అర్ధ భూస్వామ్య వ్యవస్థలో, కులం, మతం, ప్రాంతీయాభిమానాలు బలంగా ఉంటాయని, వాటి ముందు ప్రజలు తమ దైనందిన, దీర్ఘకాల సమస్యల్ని మరచిపోతారని ఈ ఎన్నికలు మరో మారు రుజువు చేసాయి. లేకపోతే, ఎన్నికల సమయంలో తప్ప మరే సమయంలో తమ సమస్యల్ని పట్టించుకోరని అర్థమయిన బీడి కార్మికులు ఎన్నికల బహిష్కరణ చేసుండేవారే. ఇక ధనం, మద్యం ఏరులై పారిందని 'ప్రింట్', 'ఎలక్ట్రానిక్' మీడియా నిత్యం వార్తలను అందించాయి. కళ్లెదుట చూపాయికూడా. అయినా, ప్రజాస్వామ్యం ఎన్నికల రూపంలో సజీవంగా ఉందని 'మేధావులు', 'రాజకీయ నాయకులు', 'ప్రసార సాధనాలు' కూడా చెబుతూనే ఉన్నాయి(రు). అంటే మనం చెవులతో విన్నదటుంచి, కళ్లతో చూస్తున్నది కూడా అబద్ధమనుకోవాలి. సర్వం మిథ్య, ప్రజాస్వామ్యం తప్ప.

కరీంనగర్‌లో కె.సి.ఆర్. గెలుపుపై రకరకాల వ్యాఖ్యాలను వినిపిస్తున్నాయి. అది మూడు కోట్ల తెలంగాణ ప్రజల "ప్రత్యేక రాష్ట్ర" ఆకాంక్ష అని కొందరు, కేవలం తాత్కాలికమైన భావోద్వేగం (సెంటిమెంట్) తప్ప, మొత్తం తెలంగాణ తొమ్మిది జిల్లాల ప్రజల ఆకాంక్షకు ప్రతిబింబం కాదని మరి కొందరు, రాజశేఖరుని విధానాలకు వ్యతిరేకత అని కొందరంటే, కాదు ప్రజలు ఈ ప్రభుత్వ విధానాల్ని సమర్ధంచినా, 'తెలంగాణ సెంటిమెంట్' మరింత బలంగా ఉండటం జరిగిందని కొందరు వ్యాఖ్యానించారు. ఇక టి.ఆర్.సి.సి. నేతలు తమ కాళ్లకింద నేల కదులుతుందనే భయంతో తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం గురించి తాము ముందు ప్రస్తావించామని, సోనియా గాంధీ కూడా ఆ ప్రతిపాదనకు సుముఖంగా ఉందంటున్నారు. గట్టిగా మాట్లడితే, రాజశేఖరుని ఆగ్రహానికి గురై రాబోయే మంత్రి పదవుల పందేరంలో తాము నష్టపోతామనే జంకు వారికుంది. కమ్యూనిస్టు పార్టీలు తాము భాషా ప్రయోక్త రాష్ట్రాలకే కట్టుబడి ఉన్నాం. కానీ, ప్రత్యేక తెలంగాణ ఇస్తే అడ్డుపడమని, 'మొరిగే కుక్క కరవదనే' సామెతను జ్ఞాపకం తెస్తూనే ఉన్నారు. అంతే మరి, కేంద్ర ప్రభుత్వ ప్రపంచ బ్యాంక్ ఆర్థిక విధానం అమలు విషయంలోనూ వాళ్లు మొరుగుతారే గాని, కనీసం కరుణానిధి మాదిరి కరుస్తామని బెదిరించరు కూడా.

ఇక పోతే, తెలంగాణ రాష్ట్రం వస్తుందా? ఈ భావోద్వేగాన్ని కె.సి.ఆర్. 2009 నాటి ఎన్నికల వరకు, అన్ని తెలంగాణ జిల్లాల్లో నిలపగలరో, కాంగ్రెస్ పార్టీకి తప్పని సరిగా ప్రత్యేక రాష్ట్రం ఇచ్చే పరిస్థితులు ఏర్పడితే, ఆ ఖ్యాతి 'కె.సి.ఆర్.' దక్కకుండా, తామే లబ్ధి పొందడానికి 2009 ఎన్నికల ముందు ప్రకటించే అవకాశముందని ఎక్కువ మంది పరిశీలకుల అభిప్రాయం.

అయితే, ఈ తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో (ఉద్యమం అనవచ్చునా?) ఆ ప్రాంతపు రచయితల, కళాకారుల, మేధావులు నిర్వహించిన పాత్ర ఏమిటీ? ప్రొ. జయశంకర్ మొదటి నుండి కె.సి.ఆర్ కు సలహాదారుగా, ఒక విధంగా చెప్పాలంటే తెలంగాణ తత్త్వవేత్తగా వ్యవహరిస్తూ వస్తున్నారు. కాని, కె.సి.ఆర్. రాజీనామ తర్వాత అంతవరకు అతని వ్యక్తిగత పోకడల్ని విమర్శిస్తూ వచ్చిన ఇతర మేధావులు, కళాకారులు, రచయితలు మూకుమ్మడిగా ఎన్నికల సమయంలో సభలు, సమావేశాలు నిర్వహిస్తూ తెలంగాణ భావోద్వేగాన్ని బలంగా వ్యాప్తి చేసారు కదా. అయితే, వారు 'ప్రత్యేక రాష్ట్రం' ఏర్పాటును ఎందుకు సమర్థిస్తున్నారు? కేవలం భౌగోళికంగా విడిపోవడానికేనా?

*(మిగతా 48వ పేజీలో...)*

# డిపోల మూసివేతతో, ఆర్టీసీ కథ కంచికి - కార్మికులు ఇంటికి

– కృష్ణతేజ

నష్టాల ఆర్టీసీని గట్టు ఎక్కించెందుకే డిపోల మూసివేత అంటున్న రాష్ట్ర ప్రభుత్వ వాదన 'తాటిచెట్టుఎక్కింది. దూడ మేతకోమే' అన్న చందంగా ఉంది. నష్టాల్లో ఉన్న డిపోలను మూసివేసి, బస్సులను, కార్మికులను ఇతర డిపోలకు సర్దడం ద్వారా ఆర్టీసీకి అదనంగా వచ్చే లాభం ఏంటో? రవాణా రంగ నిపుణులకు సైతం అంతుపట్టడం లేదు. రాష్ట్ర ముఖ్యమంత్రి పేర్కొన్నట్లు, యధాతథంగా ఇతర డిపోల నుండి బస్సులు నడిపించినా, లాభాలు రాకపోగా 'డెడ్ మైలేజి' విపరీతంగా పెరిగి సంస్థ మరింత నష్టాల్లో కూరుకు పోయే ప్రమాదం ఉంది.

ఆర్టీసీ నష్టాలకు ప్రైవేట్ వాహనాల అక్రమ రవాణాయే ప్రధాన కారణమని లోకం కోడై కూస్తుంటే, రోగం ఒకటైతే మందు వేరొకటి ఇచ్చినట్టు, ప్రభుత్వం 52 డిపోల మూసివేతకు రంగం సిద్ధంచేసి 16 డిపోలను మూసివేసింది. డిపోల పునర్వస్థీకరణ ద్వారా బస్సుల్లో ప్రయాణించే వారి శాతం పెరిగి ఆర్టీసీ లాభాల బాట పడుతుందా? ప్రభుత్వం అక్రమ రవాణాను అరికట్టకుండా ఆర్టీసీ ఆదాయం వృద్ధి అయ్యే అవకాశమేలేదు. 212 డిపోల్లో 137 డిపోలు ప్రైవేట్ వాహనాల అక్రమ రవాణా వల్ల నష్టాల్లో కూరుకుపోయినట్లు సంస్థ యాజమాన్యమే గతంలో ఆరోపించింది. ఈ అక్రమ రవాణా వల్ల సాలినా ఆర్టీసీ 500 కోట్లు రుపాయలు నష్టపోతున్నట్లు అధికారులు తేల్చారు. ప్రభుత్వమంటున్నట్లు డిపోల మూసివేతకు నష్టాలే నిజమైన సాకైతే ఇక ప్రజా రవాణా వ్యవస్థలో మిగిలేది చీటకి ప్రస్థానమే.

ఆర్టీసీ బస్సు ఒక కిలోమీటర్ దూరం ప్రయాణించడానికి అయ్యే ఖర్చు, ఆదాయాన్ని మించి ఉంది. దీన్ని అధికమించడానికి గత దశాబ్ధ కాలంగా యాజమాన్యం చేయని ప్రయత్నం లేదు. ఈ చిల్లు కుండలో నీళ్లు నింపే ప్రయత్నంలో ప్రతి సారి పరాజయం కార్మికులదే. అందుకు కార్మికులు శిక్షలు అనుభవించిన సందర్భాలూ ఉన్నాయి.

స్వాతంత్ర్యానంతరం ప్రజలకు నాణ్యమైన, మెరుగైన రవాణా సేవలందించేందుకు కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాల ఆధ్వర్యంలో ఏర్పడ్డ సామాజిక సంస్థ ఆర్టీసీ. రహదారుల జాతీయకరణ ద్వారా ప్రజల మౌలిక హక్కుల్లో రవాణా కూడా భాగమైంది. ఈ నేపథ్యమే రాష్ట్రాల్లో ఆర్టీసీ ఏర్పాట్లకు ఊపిరి పోసింది. కొన్నేళ్లు ఆర్టీసీలను ఆదరించి రక్షించిన కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలే తొంభై దశకం నుండి ఆర్టీసీల ఉసురు తీయడానికి సిద్ధమైనాయి. మన ఆర్టీసీ కూడా పేరుకు ప్రభుత్వ రంగ సంస్థగానే ఉన్నా 90 శాతం పనులు ఇప్పటికే ప్రైవేటీ కరించారన్నది నమ్మలేని నిజం.

వజ్రోత్సవాలను ఘనంగా జరుపుకుంటున్న ఆర్టీసీలో కాదేదీ ప్రైవేట్ కనర్హం. ఆర్టీసీలోని ప్రతి విభాగాన్ని నేడు ప్రైవేట్ భూతం ఆవరించింది. వాషింగ్, స్వీపింగ్, బస్సుల మరమ్మత్తులు, బస్సులో డీజిల్ నింపడం, బస్సు పాసుల జారీ, డ్రైవర్, కండక్టర్, మెకానిక్, రక్షణ సిబ్బంది నియమాకాలు, అద్దె బస్సులు, బుకింగ్ రిజర్వేషన్ కౌంటర్లు, సంస్థ అజమాయిషీ నుండి ఏనాడో ప్రైవేట్ సంస్థలకు బదిలీ అయ్యాయి. సంస్థ విస్తరణలో కీలక భూమిక పోషిస్తున్న బస్సు బాడీ యూనిట్లు, టైరు రీట్రేడింగ్, ప్రింటింగ్ ప్రెస్, ఇతర వర్కు షాపులు రేపో-మాపో మూసివేతకు సిద్ధంగా ఉన్నాయి. ఇక ఆర్టీసీలో ప్రైవేట్‌కు మిగిలిందేది? సంస్థ ఆస్తులు అమ్మడం శాశ్వత సిబ్బందిని ఇంటికి సాగనంపడమే తరువాయి.

మోటారు వాహన రంగంలో ప్రపంచ ప్రసిద్ధి గాంచిన పలు ఆర్టీసీ విభాగాల్ని పీల్చిపిప్పి చేసిన మన రాష్ట్ర ప్రభుత్వం కన్ను నేడు ఏకంగా కొన్ని దశాబ్దాలకు పైగా గ్రామీణ, పట్టణ ప్రాంత ప్రజలకు రవాణా సేవలందిస్తున్న డిపోలపై పడింది. భూదాహంతో పరితపిస్తున్న మన పాలకులు వివిధ పట్టణాలలో ఆర్టీసీకి చెందిన పసిడి భూములను అమ్మి సొమ్ము చేసుకునే ప్రక్రియను వ్యూహరచన చేశారు. కోటి జనుల 'ఆర్టీసీ'ని ప్రజల నుండి వేరు చేసే ప్రయత్నాలను ప్రభుత్వం ఈ నూతన సంవత్సర శుభ ఘడియల నుండి ప్రారంభించింది.

ప్రపంచ బ్యాంకు ఆదేశాల మేరకు సంస్థను నిర్వీర్యం చేసి కార్మికులను (అ)మర్యాదగా ఇంటికి సాగనంపడానికే డిపోల పునర్వవ్యస్థీకరణ ప్రయోగమన్నది జగమెరిగిన సత్యం. ప్రపంచ బ్యాంకు ముసాయిదా తీర్మానంలోని రుణ పత్రంలోని షరతులు ఉన్నది ఉన్నట్టు రాజశేఖర రెడ్డి ప్రభుత్వం ఒక్కొక్కటి అమలు చేయడం, ఇందుకు నిదర్శనం. ఆర్టీసీ రూట్లను ప్రైవేట్ ఆపరేటర్లకు కట్టబెట్టడం, డిపోలను మూసివేయడం, నిరర్థక ఆస్తుల్ని అమ్మడం, సిబ్బందిని తొలిగించడం, ఆర్టీసీని ఏడు ముక్కలుగా చేయడం ప్రభుత్వం ముందున్న తక్షణ కర్తవ్యం. 2007 మార్చి నాటికి ఆర్టీసీలో ఈ తరహా సంస్కరణలు వేగవంతంచేయడానికి ప్రభుత్వం దృధ సంకల్పంతో ఉంది. ఆర్టీసీలో ఇలాంటి ప్రైవేటీకరణ క్రతువు ఊపందుకోవడానికి సంస్థలోని కార్మిక సంఘాల స్వయం కృతాపరాదానికి తోడు, ప్రభుత్వంపై ప్రైవేట్ ఆపరేటర్ల వత్తిడి, ఆర్టీసీ యాజమాన్య నిష్క్రిమాపరత్వం కూడా కారణాలుగా చేప్పవచ్చు.

**చారిత్రిక విద్రోహం :** ఆర్టీసీకి చావు తప్పదా? అని ప్రశ్నిస్తే అవును అనే అభిప్రాయం సర్వత్రా వ్యక్తం అవుతుంది. కార్మికుల వేతన సవరణ సందర్భంగా ఆర్టీసీలోని గుర్తింపు కార్మిక సంఘం సంస్థ పరిరక్షణపై దృష్టి సారించనందునే నేడు డిపోల మూసివేతలకు మార్గం సుగమం అయ్యిందనేది కార్మికుల ఆరోపణ. ఆర్టీసీ పరిరక్షణ కార్మికులకు సంబంధం లేని అంశంగా తేల్చి, కేవలం వేతన సవరణకే అధికార కార్మిక సంఘాన్ని పరిమితం చేయడంలో ప్రభుత్వం విజయం సాధించింది. ఆర్టీసీలో అప్పటికే అమలులో ఉన్న జి.ఒ 90, డిపోల మూసివేత, సంస్థ విస్తరణ లాంటి సమస్యలు వేతన సవరణ సందర్భంగా నామ మాత్రంగానైనా చర్చించబడలేదు. ఆర్టీసీ అప్పులు, నష్టాలు, అక్రమ వాహనాల రవాణా, ప్రభుత్వ ఆర్థిక సహాయం, మోటారు వాహనాల

పన్ను తగ్గింపు లాంటివి సరేసరి. ఇదే వేతన సవరణ కోసం 2005 సంవత్సరంలో "ఐక్య కార్యాచరణ కమిటీ" నాయకత్వంలో ఐదు రోజులు సమ్మె జరిగినా చర్చలు ఒక కొలిక్కి రాలేదంటే ఆ నాటి సమ్మెకు సంస్థ పరిరక్షణ ఎజండాగా ఉండటమే కారణం. ఒక నిముషం సమ్మె జరగకుండా, ఒక స్వేద బిందువు చిందకుండా చారిత్రక ఒప్పందం జరిగిందని ఢాంబికాలు పలుకుతున్న ఆర్టీసీ నాయకులు, ఆర్టీసీ పరిరక్షణను గాలికి ఒదిలి చారిత్రక విద్రోహమే చేశారు. విచిత్రం ఏమంటే 2001 సంవత్సరంలో ఆర్టీసీ పరిరక్షణోద్యమంలో కార్మికులకు హిరోగా ఉన్న రాజశేఖర రెడ్డి నేడు ఆర్టీసీకి విలన్‌గా మారడం, రాష్ట్ర రవాణా వ్యవస్థలో ఆర్టీసీ గుత్తాధిపత్యాన్ని స్వయంగా ప్రశ్నించడం, కార్మికులు జీర్ణించుకోలేక పోతున్నారు. రాష్ట్ర ముఖ్యమంత్రికి స్వయానా బామ్మర్దే ఆర్టీసీ గుర్తింపు కార్మిక సంఘానికి గౌరవాధ్యక్షుడుగా ఉంటే మేలు జరగొచ్చొనే ప్రచారం ఆచరణలో నిరాశనే మిగిల్చింది. సమస్యల పరిష్కారానికి పోరాటాలు తప్ప, చుట్టరికాలు, పైరవీలు సాటిరావని రూఢి అయ్యింది. డిపోల మూసివేతకు నిరసనగా రాష్ట్రంలో వెల్లువెత్తిన నిరసనోద్యమాలకు వెన్నుదన్నుగా నిలవాల్సిన ఆర్టీసీ కార్మికవర్గం నిమ్మకునీరెత్తినట్టు వ్యవరించడం క్షమించరాని నేరం.

**ప్రమాదంలో సురక్షిత ప్రయాణం :** మన రాష్ట్ర ప్రజలకు చౌకగా, మెరుగైన, నాణ్యమైన రవాణా సేవలందించేందుకు ప్రభుత్వ రంగంలో ఏర్పడ్డ సామాజిక సంస్థ ఆర్టీసీ. రాష్ట్రప్రజల త్యాగాల పునాదులతో దినదిన ప్రవర్థమానంగా ఆకాశమంత ఎత్తు ఎదిగింది. రాష్ట్రంలోని 98 శాతం రూట్లకు ఆర్టీసీ తన సేవలను విస్తరించింది. వేల కోట్ల రుపాయల రాయతీలను ప్రజలకందించింది. ప్రపంచంలోనే అసామాన్యమైన రికార్డులతో పరుగులు తీస్తునే ఐదువేల కోట్ల రుపాయల పై చిలుకు స్థిర, చరాస్థులను స్వంతం చేసుకుంది అర్టీసీ. ఇత్తేసి పొత్తు కలిసిన రాష్ట్ర ప్రభుత్వం కేవలం 200 కోట్ల రుపాయల పెట్టుబడితో ఆర్టీసీ నుండి ఇంతకు పదింతలు మోటారు వాహనాల పన్నుల రూపంలో పిండుకుంటుంది. ఆర్టీసీ పట్ల రాష్ట్రప్రభుత్వం మొదటి నుండి సవతి తల్లి ప్రేమనే ప్రదర్శించింది. లేకుంటే ఆర్టీసీ నేడు మూడు వేల కోట్ల రుపాయల లాభాల్తో కళకళాలడుతుండేది. ఇది ప్రభుత్వం కూడా కాదనలేని సత్యం. మీగడంతా తినేసి వెన్నలేదనే పాలకులను ఏమనాలి?

ఆర్టీసీ వల్ల ఇంత లబ్ధి పొందినా తృప్తి చెందని పాలకులు ఆర్టీసీ ఆస్తులపైనా, రూట్ల పైనా కన్నేసారు. కొత్త కొత్త జి.ఒలతో ఆర్టీసీ తల్లి వేరు నరుకుతున్నారు. 104 రూట్లలో 1600 కి.మీ. పొడవునా ప్రైవేట్ ఆపరేటర్లకు రూటును దారాదత్తం చేసారు. ఓవర్ ల్యాపింగ్‌ను 8 నుండి 25 కి.మీ. పెంచి ఆర్టీసీ అస్థిత్వాన్ని ప్రశ్నార్థకం చేసింది ప్రభుత్వం. సాలీనా ప్రజల రవాణా అవసరాలు 12 శాతం పెరుగుతున్నా, బస్సుల కొనుగోళ్లు పై మాత్రం ఆంక్షలు విధించింది. సంస్కరణ, అమలు తొలిదశలోనే 34000 ఆర్టీసీ కార్మికులను ఇంటికి సాగనంపే మార్గాలను యాజమాన్యం అన్వేషిస్తుంది. కుంటి గొర్రెను చూస్తే కొందరికి పంటి దురదన్నట్టు ఆర్టీసీని లూటీ చేయడానికి ప్రైవేట్ ఆపరేటర్లు గుంటకాడి నక్కల్లా కాచుకున్నారు. పోషకాహార లేమితో మంచాన పడ్డ మనిషిని తిండిపెట్టి చికిత్స చేయాల్సిన డాక్టరే హత్య చేయడానికి ఆదేశాలిచ్చిన వైనమిది.

**ప్రజలే ఉద్యమ నిర్మాతలు :** ప్రభుత్వాలు నూతన ఆర్థిక విధానాలను విజయవంతంగా అమలు చేస్తున్న క్రమంలో నష్టాల్లో ఉన్న పరిశ్రమలను మూసివేయడం, లాభాల్లో ఉన్న వాటిని అమ్మడం నేడు జరుగుతున్న తంతు. ఏడు దశాబ్దాలుగా ప్రజలకు మెరుగైన రవాణా సేవలందిస్తున్న బస్సు డిపోలను నష్టాల సాకుతో మూసివేస్తున్న ప్రభుత్వం, వందలకోట్ల నష్టాలతో బతుకు ఈడ్చుతున్న ఆర్టీసీని మూసివేయదన్న గ్యారంటీ లేదు. రాష్ట్ర రవాణా రంగంలో ఆర్టీసీ కనుమరుగైతే ప్రజలకు కలిగే కష్టం, నష్టం అంతా ఇంతా కాదు. స్కూలు పిల్లల నుండి స్వాతంత్ర్య సమరయోధుల వరకు రవాణా దుష్ఫలితాలను అనుభవించాల్సిందే.

అతి కొద్దిమందికి మాత్రమే ఉపయోగపడే ఔటర్ రింగ్ రోడ్డు, ఫ్లై ఓవర్లకు వేలకోట్ల రుపాయలు వ్యయం చేస్తున్న రాష్ట్ర ప్రభుత్వం, ఐటి పార్కులకు, సెజ్‌లకు వందల కోట్ల రుపాయలు రాయతీలు అందచేస్తున్న పాలకులు, ప్రతిరోజు ఒక కోటి ఇరవై లక్షల ప్రజలకు ఉపయోగపడే ఆర్టీసీకి ఐఐఎం సూచించిన 750 కోట్ల రుపాయలు ఆర్థిక సహాయం అందించడానికి వెనుగాడుతుంది. ఆర్టీసీ పట్ల పాలకులకు ప్రేమ ఉన్నట్లా? పగ ఉన్నట్లా? ఆర్టీసీ నష్టాలకు కారణమైన అక్రమ రవాణాను అరికట్టడానికి మీనమేషాలు లెక్కిస్తున్న పాలకులు నష్టాల్లో ఉన్న డిపోలకు మాత్రం తులసి నీల్లు పోస్తున్నారు.

ఏది ఏమైనా ఆర్టీసీ కార్మికులు, ప్రజలు సంస్థ పరిరక్షణకు రాష్ట్రంలో ఒక సామాజిక ఉద్యమానికి పురుడు పోయకపోతే అతికొద్ది కాలానికే రాష్ట్రం ఒక అత్యుత్తమమైన సామాజిక సంస్థను, తెలుగుప్రజలు రాజ్యాంగం ప్రసాదించిన ఒక మౌలిక సదుపాయాన్ని కొల్పోయే ప్రమాదం ఉంది. ◆

# ఆచరణా, విధానమూ (సింగూరు, నందిగ్రామ్)

**- పి.వి. రమణ**

తెలకపల్లి రవి గారు అన్నట్లు (ఆంధ్రజ్యోతి 10.1.06) ఆచరణలో లోపాలుంటే సవరించుకోవచ్చు. కానీ ప్రత్యామ్నాయ విధానాలకు చిరునామాగా మారిన బెంగాల్ వామపక్ష ప్రభుత్వ అధ్వర్యంలో సింగూరు, నందిగ్రాంలలో జరిగిన సంఘటనలు 'పారిశ్రామిక వేత్తలకు వికాసమూ, పేద ప్రజలకు విఘాతమూ' అనే వలసపాలకుల నాటి నుంచి వస్తున్న పురాతనపద్ధతే కాని ప్రత్యామ్నాయం కావు అని రుజువు చేస్తున్నాయి.

కొన్ని ప్రాణాల్ని బలిగొన్న తర్వాతనే అభివృద్ధి పేరుతో విశాఖ స్టీల్ ప్లాంట్ నిర్మించబడింది. నిర్మించబడిన ప్రాంతంలోని వేలాది మంది నిర్వాసితుల కుటుంబాలు చితికిపోయి, ఉద్యోగాల కోసం నేటికీ ఎదురు చూపులు చూస్తున్నారు. అరెస్టులు, దాడులు తర్వాత ఒక మత్స్యకారుడు ప్రాణాల్ని బలి తీసుకున్న తర్వాతనే గంగవరం పోర్టు పనులు ప్రారంభమయ్యాయి. ప్రజల అభివృద్ధి కోసమే అని చెప్పి ప్రారంభమైన ప్రాజెక్టులు చివరకు ఎవరి అవసరాలు తీరుస్తున్నాయి అన్నది చూడాలి. ఎన్నో కొన్ని ఉద్యోగాలు రాలేదని కాదు, కాని అవి నిర్మించిబడిన ప్రాంతాలలో ప్రజల జీవితాల్ని సర్వనాశనం చేస్తున్న విషయం మన కళ్లముందున్న సంగతి మర్చిపోరాదు.

ఏ పెట్టుబడి దారీ విధానాలపై పోరాటం చేస్తామని చెపుతున్నారో, ఆ విధానాలే అవలంబిస్తూ అవి ప్రజలకు మేలు చేస్తాయని చెప్పడమే ఆశ్చర్యం. ఎట్టి పరిస్థితిలోనూ టాటాల ఫ్యాక్టరీ ఆగదు అని బెంగాల్ ముఖ్యమంత్రి తీసుకొన్న నిబద్ధ వైఖరి "నాకెంతో గర్వంగా ఉంది" అని ఇన్ఫోసిస్ నారాయణ మూర్తి అనటం యాధృచ్ఛికం కాదు.

సి.పి.ఎం. సెంట్రల్ కమిటీ సభ్యుడు నీలోత్పల్ బాసుతో మెయిన్ స్ట్రీం సంపాదకుడు సుమిత్ చక్రవర్తి సమావేశమయినపుడు "1.5 ఎకరాల భూమి కలిగిన భారతీదాస్ తన భూమిని ఇవ్వటానికి నిరాకరించినపుడు పోలీసులు ఆమె ఇంటిలో జొరబడి చితకబాదటం మానవహక్కుల ఉల్లంఘనేకదా" అని అడిగితే బాసు దానికి "పోలీసులు ఎక్కడైనా పోలీసులే, వాళ్లలాగే వ్యవహరిస్తారు" అని సమాదానం. అలాగే బృందాకరత్ "పోలీసులు నిరసనకారులపై ప్రయోగించిన హింస దురదృష్టకరం, కాని తమపై బాంబులతో దాడి చేసిన వారిపై పోలీసులు మరో విధంగా ఎక్కడా ప్రవర్తించలేరు" అని అన్నారు. భూముల స్వాధీనంలో జరిగిన క్రూర హింసాకాండపై ప్రశ్నిస్తే "అలా జరగలేదు, జరిగిఉంటే నష్టపరిహార చెక్కుల కోసం జనం 'క్యూ'లో ఎందుకు నిలబడతారు" అని సీతారాం ఏచూరి అంటారు. ప్రజల్ని అవమాన పరుస్తూ వామపక్ష ప్రభుత్వంలో కూడా పోలీసులు వేరేగా ఉండే అవకాశం లేదని రుజువు చేస్తున్నారు. బుద్ధదేవ్ భట్టాచార్య నందిగ్రాంలో కాల్పుల సంఘటన తర్వాత "మా వలన తప్పులు జరిగాయి" అని చెప్పారు. అంతకు ముందు భూముల స్వాధీనం కోసం ఎలాంటి నోటిఫికేషన్ ఇవ్వలేదని, ప్రతిపక్షాలు ప్రజల్ని తప్పుత్రోవ పట్టిస్తున్నాయని" చెప్పారు. కాని "హాల్దియా దెవలప్‌మెంట్ అథారిటీ" ప్రాంతీయ పంచాయితీ ఆఫీసులో జనవరి 3న, ఏయే భూముల్ని స్వాధీనం చేసుకోవాలో వివరిస్తూ ఇచ్చిన నోటీసు గురించి ప్రస్తావిస్తే ఆయన నుంచి మౌనమే సమాధానం. పైగా లేనిపోని అనుమానాలను సృష్టించిన ఆ నోటీసును చింపి పారేయమని డిస్ట్రిక్ట్ మెజిస్ట్రేట్‌కు ఆదేశాలిచ్చారు. అధికార పీఠం నుండి ఆదేశాలు రాకుండా అలా నోటీసు జారీ చేసే అవకాశం ఉందా?

నందిగ్రాం కాల్పుల తర్వాత సాక్షాత్తు ముఖ్యమంత్రే తప్పు జరిగింది అని చెప్పిన తర్వాతే ఆయనతోనే సమావేశమైన ఇండోనేషియా సలీం గ్రూప్ ప్రతినిధి ప్రసూన్‌ముఖర్జీని మీ భవిష్యత్ కార్యక్రమం ఏమిటని ప్రశ్నిస్తే "మేం ఇక్కడ ఉన్నాం, మేం అనుకున్న ప్రాజెక్టులన్నీ నిర్మించే తీరతాం" అని ధైర్యంగా చెప్పటం విశేషం.

సింగూరులో చట్ట ప్రకారం ఏర్పాటు చేయవల్సిన గ్రామసభలను ప్రభుత్వం ఏర్పాటు చేయలేదు. అక్టోబర్ 27న మహాశ్వేతా దేవి, మేధాపట్కర్, ఇతర సామాజిక కార్యకర్తలు ఏర్పాటు చేసిన "పబ్లిక్ హియరింగ్" లో ప్రభుత్వం తమ పంట భూముల్ని బలవంతంగా లాక్కొంటుందని, ఒప్పుకొనక పోతే పోలీసులతో దాడులు చేయిస్తున్నారని ప్రజలు స్వచ్ఛందంగా చెప్పారు. ప్రభుత్వం వైపునుండి వారి ఉద్దేశాల్ని కూడా తెలపాలని ముఖ్యమంత్రికి, పరిశ్రమల, వ్యవసాయ శాఖల మంత్రులకు, సంబంధిత శాఖాధిపతులకు ఆహ్వానం పంపి వారి కోసం సీట్లు కేటాయించినా వారెవరూ హాజరు కాలేదు.

టాటా కంపెనీకి ఇవ్వాల్సిన 997 ఎకరాల భూమికి 952 ఎకరాల హక్కుదార్ల నుండి ప్రభుత్వం సమ్మతి పొందిందని బృందాకరత్ చెప్తుండగా 431 మంది రైతులు చంద్రనగర్ ప్రాంతీయ కోర్టులో "తాము భూమిని అప్పచెప్పటానికి ఒప్పుకోలేదని" అఫడివిట్లు సమర్పించినట్లు కృషి జామిరక్ష కమిటీ చెప్తుంది. అలాగే టాటాలకీ అతి తక్కువ ధరలకి భూములను ఇస్తూ, ఆ సొమ్ము కూడా 20 సంవత్సరాల తర్వాత చెల్లించే అవకాశం ఎందుకిచ్చారో అన్న ప్రశ్నకు ఇంతవరకు సరైన సమాధానం లేదు.

144 సెక్షన్ విధించి ఆరు వేల మంది పోలీసులతో 997 ఎకరాల చుట్టు ఫెన్సింగ్ వేసి చుట్టూ నిరసన ఉద్యమంలో చురుగ్గా పాల్గొంటున్న పద్దెనిమిది సంవత్సరాల తాపసి మాలిక్ పూర్తిగా కాలిపోయి శవరూపంలో కన్పించింది. ఈ దుర్మార్గానికి బాధ్యత ఎవ్వరిది? ఆ అమ్మాయి తల్లితండ్రులు గస్తీ తిరిగిన కార్యకర్తల పైనే అనుమానం వ్యక్తం చేస్తున్నారు.

బెంగాల్ ప్రభుత్వం ఉపయోగించిన 1894 వలసపాలన నాటి భూస్వాధీన చట్టం ప్రకారమే విశాల ప్రజానీకం అవసరాల కోసమే భూముల్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి. కాని 12 మంది గిరిజనుల్ని పొట్టబెట్టుకొని వేలాది ఎకరాలు తమ స్వాధీనంలో ఉంచుకొని కూడా కళింగనగర్‌లో ఎలాంటి పనులు చేపట్టలేని టాటా లాంటి ప్రైవేట్

పెట్టుబడీదారుల కోసం పంట భూముల్ని స్వాధీనం చేసుకోవటంలో ప్రభుత్వ పాత్రను ప్రశ్నించడంలో తప్పేమిటి? కళింగనగర్ అనుభవం నుంచి ఏమి నేర్చుకొన్నట్టు?

పోరాటాల ద్వారా సాధించిన 'సమాచార హక్కు చట్టం' ప్రజల చేతిలో గొప్ప ఆయుధమని బల్లగుద్ది చెపుతున్న వామపక్ష ప్రభుత్వం సింగూరు భూముల విషయంలో ఆ చట్టం కింద వేసిన అనేక పిటిషన్లకు ఇంతవరకు జవాబు ఇవ్వలేదు. ఇచ్చినా ఒక ఎన్.జి.ఒ సంస్థ కోర్టులో వేసిన దానికి ఎలాంటి జవాబు ఇచ్చారో చూడండి.

ప్రశ్న : సింగూరు భూములు ఎలా ఉపయోగిస్తారో తెలపండి?

జవాబు : ఆ వివరాలు దొరకలేదు.

ప్రశ్న : భూములు కోల్పోయినవారిలో ఎంతమంది దారిద్ర్య రేఖ దిగువ కేటగిరిలో ఉన్నారో తెలపండి.

జవాబు : వెంటనే చెప్పలేం.

ప్రశ్న : భూములు కోల్పోవటం వలన ఎంతమంది ఉద్యోగ అవకాశాలు (ప్రత్యక్షంగా, పరోక్షంగా) కోల్పోతారు?

జవాబు : సరైన సంఖ్య చెప్పటం కష్టం.

ప్రశ్న : కొత్త ఉద్యోగాలు ఏర్పడే నాటికి గల అవకాశాలు, శిక్షణా సదుపాయాలు, అర్హతను పెంచే అవకాశాలు ఏమిటి?

జవాబు : చెప్పటం కష్టం.

ఇవీ జవాబులు. దీనిపై పరిశ్రమల మంత్రి నిరుపమ సేన్‌ను అడిగితే "అది వ్యాపార రహస్యం" అని సెలవిచ్చారు.

ఢిల్లీలో సి.పి.ఎం. ఆఫీసు ముందు సామాజిక కార్యకర్తలు జరిపిన నిరసన ప్రదర్శనలో అరుంధతీ రాయ్ "సింగూర్ సంఘటన విడిగా జరిగింది కాదు, గురుగావ్‌లో కార్మికులపై కాల్పులు, కళింగనగర్ గిరిజనులపై కాల్పులు, నర్మదా బచావో ఆందోళన నిర్వాసితులపై దాడులు మొదలగు వాటన్నిటితోను సంబంధం ఉంది. ఈ రోజు రాజకీయ వర్గాలలో 'అవి అధికారంలో ఉన్నా ప్రతిపక్షంలో ఉన్నా' పూర్తి ఐక్యత ఉంది. వారందరూ ఒకే భాషను మాట్లాడుతున్నారు. అనేక ప్రజాసమస్యలపై నిన్నటి వరకు గళం కలిపిన సి.పి.ఎం. వారు నేడు వేరే విధంగా మాట్లాడుతున్నారు. శాంతి యుతంగా జరిగే నిరసనలు హింసా రూపం తీసుకొనే ప్రమాదానికి వారే బాధ్యులని హెచ్చరించారు. సింగూర్‌కి తనను వెళ్లనీయకుండా అరెస్టు చేసినపుడు మేధాపట్కర్ "శాంతియుతంగా జరిగే పోరాటాన్ని హింసా మార్గంలోకి నెట్టకండి" అని హితవు చెప్పారు.

నందిగ్రాం హింసాకాండను ఖండిస్తూ మిడ్నిపూర్ సి.పి.ఐ. ఎం.పి. ప్రభోద్ పాండె "ప్రకాశ్ కరత్ ఎస్.ఇ.జెడ్‌ల కోసం వ్యవసాయ భూముల్ని స్వాధీనం చేసుకోరాదని చెప్పిన దాన్ని ఆచరించాలన్నారు" ఆర్ఎస్‌పి నాయకుడు అబానీ రాయ్ "ఎస్.ఇ.జెడ్‌ల పాలసీ వెనుక అమెరికా ప్రమేయం ఉందని, ప్రభుత్వ చర్యలు ప్రజల్నుంచి దూరం చేస్తాయని" అన్నారు. అఖిల భారత కిసాన్ సభా కార్యదర్శి కుమార్ అంజాన్ "అక్కడ జరిగిన హింస వామపక్ష ప్రభుత్వానికి ఒక నల్లటి మచ్చ, సారవంతమైన పంట భూముల్ని ప్రైవేట్ పరం చేయటం చాలా తప్పు" అని అన్నారు.

నిపుణుల అంచనాల ప్రకారం పశ్చిమ బెంగాల్‌లో ఇంకా పూర్తిగా ఆహార భద్రత ఏర్పడలేదు. అధికంగా వరి 11 శాతం, కూరగాయలు 40 శాతం పండిస్తున్నా, గోధుమలు 50 శాతం దాకా లోటు ఉంది. నూనె పంట విత్తనాలు 60 శాతం దాకా ఇతర రాష్ట్రాల నుండి దిగుమతి చేసుకోవాల్సిన పరిస్థితి ఉంది. ఆహార ధాన్యాల ఉత్పాదన 1980లో 5.8 శాతం, ప్రతి సంవత్సరం పెరుగుదల ఉండగా 1990-95 వచ్చేసరికి పెరుగుదల 2.13 శాతానికి పడిపోయిందని ఒక అంచనా.

జ్యోతిబసు "పారిశ్రామిక రంగాంలో అభివృద్ధి సాధించాల్సిందేనని దానికోసం సేకరించే భూముల విషయంలో వ్యవసాయ రంగాన్ని ఫణంగా పెట్టకూడదు" అన్నారు. పంటభూముల్ని ఎస్.ఇ.జెడ్.ల కోసం ఇచ్చేది లేదని ప్రకాష్‌కరత్ చెప్తుండగా, బెంగాల్ ముఖ్యమంత్రి బుద్ధదేవ్ వ్యవసాయ రంగంలో సాధించిన విజయాలతో ఆగిపోలేము, అలా జరిగితే చరిత్ర మమ్మల్ని క్షమించదు. ఉద్యోగ అవకాశాలు పెంచేందుకు పారిశ్రామికీకరణ వేగవంతం చేయ్యాలి, ఎన్నాళ్లని కేవలం వ్యవసాయ రంగ విజయాలను, భూసంస్కరణలను పట్టుకొని నిలబడగలం" అంటున్నారు. పారిశ్రామికీకరణ ఉద్యాగ అవకాశాలు పెంచడం నిజమయితే, టాటాలు కార్ల ఫ్యాక్టరీ నిర్మిస్తున్న జిల్లాలోనే ఉన్న హిందుస్థాన్ మోటార్స్ కార్ల ఫ్యాక్టరీ సమస్యల్లో కూరుకుపోవడం, గతం ఉన్న ఉద్యోగుల్లో సగానికి తగ్గిపోవడం గురించి ఏమంటారో?

ఎస్.ఇ.జెడ్‌ల వలన లక్షలాది ఉద్యోగ అవకాశాలు వస్తాయని, కేంద్ర ప్రభుత్వం, పారిశ్రామీకరణల వలన ఉద్యోగ అవకాశాలు పెరుగుతాయని బెంగాల్ ప్రభుత్వం చెపుతున్నాయి. కాని పారిశ్రామికరణ అభివృద్ధి వలన ఉద్యోగ అవకాశాలు, వస్తాయన్నది రుజువు కాలేదని, ప్రభుత్వ, ప్రైవేట్ రంగాల్లో పారిశ్రామీకరణ వలన 1981లో 60 లక్షల ఉద్యోగ అవకాశాలు, 1994లో 64 లక్షలు, 1997లో 69 లక్షలు వరకు పెరిగి 2003 నాటికి 6 లక్షలకు పడిపోయింది. నూతన ఆర్థిక విధానాలు అవలంబించిన చైనా భారత్‌లలో అభివృద్ధి రేటు పెరిగినా దానికి తగినంత ఉద్యోగ అవకాశాలు పెరగలేదని, కార్మకుల ఉత్పాదన శక్తి పెరిగి వచ్చిన లాభాల్లో, అధిక శాతం బడా పెట్టుబడీదారులకు అద్దె, వడ్డీ, లాభాల రూపంలో పొయి కార్మికులకు మిగిలేది తక్కువగానే ఉందని, వారి నిజ వేతనాలు పడిపోయాయని ప్రపంచంలో అతి తక్కువ 15 శాతం మాత్రమే పొందగలుగుతున్నారని" జయతీ ఘోష్ ఘోషిస్తున్న తరుణంలో కూడా పారిశ్రామికీకరణే ఏకైక మార్గం అనే విధానం ఎవరికి మేలు చేస్తుందే వేరే చెప్పాలా?

ప్రసిద్ధ చరిత్రకారుడు సుమిత్ సర్కార్ "ఎస్.ఇ.జెడ్‌ల పేరుతో ఆధునిక చరిత్రలో అతి పెద్ద భూ ఆక్రమణకు దారితీయబోతుంది. చరిత్ర మొత్తంలో ఎప్పుడూ భారత దేశంలో ఈ విధంగా లక్షలాది హెక్టార్లు వ్యవసాయ భూమిని ప్రైవేట్ పరిశ్రమల కోసం బదిలీ చేయటం జరగలేదు, భారతేదశంలోనే కాదు, మరే వర్ధమాన దేశంలోనూ ఇలా జరిగి ఉండదు" అని హెచ్చరిస్తున్నారు. ఇండోనేషియా సలీంగ్రూప్‌కు 40 వేల ఎకరాల భూమిని ప్రభుత్వం అప్పచెప్పబోతుందనే విషయాన్ని తీవ్రంగా పరిగణిస్తున్న రైతులకు మద్దతు ఇవ్వటం వల్లనే తృణముల్ కాంగ్రెస్ దక్షిణ 24 పరిగణాల జిల్లాలో భాంగార్ లోకసభ సీటు గెల్చుకోగలిగిందని, దాన్నే చూచి వామపక్ష ప్రభుత్వం ఎలాంటి గుణపాఠం నేర్చుకొన్నట్లు లేదని" ఎకనామిక పొలిటికల్ వీక్లీ సంపాదకీయం చేస్తున్న హెచ్చరికలు వినపడతాయా?

*(మిగతా 42వ పేజీలో...)*

# స్త్రీల అస్థిత్వాలకు కొత్త సవాళ్లు

- వి. ప్రతిమ

భారతదేశానికున్న ఒకానొక గొప్ప సాహితీకారుడు శరత్‌చంద్రుడు ఎనభయ్యేళ్ల క్రితం 'భారతి' నవలలో ఒక పాత్రచేత చెప్పించిన విషయం విన్నట్టయితే చెప్పలేనంత ఆశ్చర్యమేస్తుంది...

'ఈ పయోముఖ విషకుంభం మూట చేత పుచ్చుకుని యూరప్ వర్తకం కోసమని సముద్రం దాటి వచ్చినప్పుడే జపాన్ దాని నిజస్వరూపం కనిపెట్టింది. అందుచేతనే అది ఈనాడు సౌభాగ్యవంతంగా ఉంది. యూరప్ సమాన ఫాయా గల మిత్రము అయింది. దీన్ని చైనాగానీ, భారతదేశంగానీ కనిపెట్టలేకపోయాయి. ఆ రోజుల్లో స్పెయిన్ సామ్రాజ్యం బాగా విస్తరించి ఉంది. జపాన్ అడిగింది స్పెయిన్ దేశపు నావికున్ని 'ఇంత గొప్ప సామ్రాజ్యాన్ని మీరు ఎలా సంపాదించ గలిగారు' అని. అతడు జవాదు చెప్పాడు.

"చాలా తేలిగ్గా సంపాదించాము. ఏ దేశాన్ని గుటకాయస్వాహా అనదలిచామో అక్కడికి మొదట అమ్మకానికంటూ సరుకులు తీసుకుని పోతాము. చేతులు జోడించుకుని, కాళ్లయినా పట్టుకుని ఆ దేశపు రాజుని బతిమాలి వర్తకం కోసం కొంత భూమిని అడిగి పుచ్చుకుంటాం. ఆ తరువాత మిషనరులను పిలిపించుకుంటాం. వారు ఎక్కువమందిని క్రిస్టియన్లుగా మార్చలేరుగానీ ఆ దేశపు మతాన్ని, ఆచారాన్ని హద్దుమీరి నిందిస్తారు. ప్రజల్లో చీలికలు ఏర్పడుతాయి. ఒకరినొకరు హత్యలు చేసుకుంటుంటారు. ఇంకేం ఆ సమయాన తుపాకులు, తూటాలు పట్టుకుని సైనికులు వచ్చేస్తారు. మా సభ్యదేశపు మారణయంత్రాలు ఆ సభ్యదేశపు ఏనుగులు, గుర్రాల కంటే ఎంత శ్రేష్టమైనవో తెలియజెప్తాం' అని.

ఆ మాటలు విని జపాన్ "అయితే ప్రభూ, తమరు వెంటనే మూటలు ముల్లెలు కట్టుకుని బయలుదేరి వెళ్లిపోండి. మీ వర్తకంతో మాకేమీ అవసరం లేదు'' అని పలికి సెలవిచ్చి పంపేసింది. సూర్యచంద్రులు వెలుగుతూ ఉన్నంతకాలం క్రిస్టియనులను తమ దేశంలో అడుగు పెట్టనీకుండా శాసనం చేసింది.

అన్నేళ్ల క్రితం శరత్‌చంద్ర లోతయిన సామ్రాజ్యవాద అవగాహనకి విస్తుపోతాం మనం.

చిన్న చిన్న దేశాల మీద తమ సరుకులతో దాడి చేసి మార్కెట్ చేసుకోవడమే సామ్రాజ్యవాద సంస్కృతి అయితే, మన జీవితాలను, వ్యక్తిత్వాలను, మానవ సంబంధాలను, భాషను ప్రాంతీయతనూ, సంస్కృతినీ కూడ ప్రభావితం చేసి మొత్తంగా మనల్ని ముంచెత్తడమే ప్రపంచీకరణ ధ్యేయం.

సామ్రాజ్యవాద అత్యున్నత తీవ్రదశ, మహామయ ప్రపంచీకరణ. ప్రపంచంలోని అన్ని దేశాలూ, అన్ని జాతులూ ఒక్కటేనన్న సమభావన విశ్వకళ్యాణ ప్రపంచీకరణ ధ్యేయమయితే. ప్రపంచమంతా ఒక్కరకంగా ఉంటే ఒకే నమూనాలో వస్తువుల్ని ఉత్పత్తి చేయడం తేలికవుతుంది కాబట్టి మొత్తం ప్రపంచమంతా ఒకే రకమయిన సరుకు వాడే గుత్తాధిపత్యాన్ని హస్తగతం చేసుకోవడమే ఇప్పటి ప్రపంచీకరణ. ఇలా ప్రపంమంతా ఒకే సంస్కృతిని నింపే క్రమంలో భారతదేశంలోని సహజ విలువలన్నింటినీ విధ్వంసం చేసి పారేసింది. మన ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక వ్యవస్థల్ని చిన్నాభిన్నం చేసేసింది.

ప్రపంచంలోని అన్ని ఇతరాల కంటే కూడ ముఖ్యమైన, ప్రధానమైన స్థానం డబ్బు ఆక్రమించుకుంది. డబ్బు...డబ్బు...డబ్బు తప్ప మరేది ఈ ప్రపంచంలో లేదన్నంత ప్రభావంలో పడిపోయాడు మనిషి.

నిజానికి మనిషన్న పదమే లేదీరోజు. వినియోగదారుడు మాత్రమే ఉన్నాడు. ఈ మొత్తం ప్రపంచీకరణ, నిజీకరణ, కొత్త ఆర్థిక విధానాల పరిణామం అనివార్యంగా అంతిమంగా స్త్రీల మీదికి చేరుతోంది.

స్త్రీ వ్యక్తిత్వానికీ, అస్థిత్వానికీ ఈ వ్యాపార సంస్కృతి ఒక అగ్ని పరీక్షయి కూచుంది. ఈ ప్రపంచీకరణ నేపథ్యంలో స్త్రీల విషయంలో ఒక కొత్త తరహా అణచివేత, విలువల పతనం ప్రారంభమైంది.

ఆ క్రమంలో ఇవ్వాళ స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యల గురించి చెప్పుకోవలసి వస్తే ఒకటా, రెండా... లెక్కకందనన్ని...

**1**

స్త్రీలు తమ వ్యక్తిత్వాల ద్వారా కాకుండా అవయవాల ద్వారా కేవలం ఫిజిక్, స్ట్రక్చర్ ద్వారా మాత్రమే గుర్తింపబడమనే పరిస్థితి ఈ రోజున సమాజంలో ఉండడం నిజంగా శోచనీయం.

విపరీతంగా ఉత్పత్తవుతోన్న సరుకుల్ని మార్కెట్ చేసుకునేందుకు మరో దగ్గరి దారి 'అందాల పోటీలు'. ఏ దేశం మీదికి తను దాడికి వెళ్లదల్చుకుందో ఆ దేశం స్త్రీలని అందాల పోటీల్లో గెలిపించి వారి నెత్తిన అందాల కిరిటాన్నుంచి, వెంటనే వివిధ రకాల వస్తువులకి మోడల్స్‌గా బుక్ చేసుకోవడం. అంటే స్థానికంగా ఉండే అమాయకులయిన స్త్రీలని ఈ అందాల రాణులు ఆకర్షించి, ఆ మొత్తం సౌందర్యసాధనాలని కొనిపించేలా చేసి ఉచ్చులోకి లాగడం సామ్రాజ్యవాద సంస్కృతి.

అంటే మన శరీరాల్లో, మన మొహాల్లో కాకుండా అందం సరుకుగా మారి మార్కెట్లో ఉందిపుడు. డబ్బుంటే చాలు మార్కెట్‌కి వెళ్లి అందాన్ని కొనుక్కోవచ్చు.

స్త్రీలకి అందం పట్ల ఆసక్తి, అలంకరణ వస్తువుల పట్ల విపరీతమైన మోజు పెంచేందుకు, లేదా ఇదంతా చాలా సహజమయిన విషయమేనన్నట్లుగా వీధికొక బ్యూటీపార్లరూ, సిటీలలో అయితే కాస్మెటిక్ సర్జరీ హాస్పిటళ్లూ, అలంకరణ సామగ్రితో నిండిపోయిన ఫ్యాన్సీ షాపులూ (మాల్స్) చాలా చాలా మామూలయిపోయాయి.

ఇవన్నీ యధావిధిగా మార్కెటయిపోయేందుకు వీలుగా బహుళజాతి కంపెనీలు అందాల పోటీలను స్పాన్సర్ చేస్తుంటాయి. ప్రపంచసుందరి దగ్గర్నుండీ 'మన ఊరి సుందరి' 'వీధి సుందరి' దాకా పోటీలు పెట్టి స్త్రీలను సరుకులుగా మార్చేస్తున్నాయి.

ఇటీవల ఒక సాహితీవేత్త ఒక వేదిక మీద సినిమాపాటల గురించి ప్రస్తావిస్తూ, నటసార్వభౌమ నందమూరి తారాకరామారావు పందొమ్మిది వందలా ఎనభయి వరకూ ఇట్టాంటి చిన్నదీ నాకంట పడలేదు అని పాడితే, 2002లో అతడి మనవడయిన రామారావు "రెండు వేలా రెండు వరకూ చూడలేదే ఇంత సరుకూ" అంటూ పాడ్డాన్ని గురించి చెప్తు, స్త్రీలు అస్థిత్వమున్న వ్యక్తులుగా కాక సరుకులుగా మారిపోయిన వైనాన్ని తీవ్రంగా గర్హించారు.

మార్కెట్ తెచ్చిన మార్పుల్లో పడి స్త్రీలు కూడ డబ్బుతో అందం, ఆ అందంతో డబ్బూ కొనుక్కోవచ్చునన్న ఆశల్లో, భ్రమల్లో మునిగి తేలుతున్నారు. ఇలా అందాల పోటీల్లో నెగ్గిన సుందరులంతా దీని వెనుకనున్న కుట్రని గ్రహింపజాలక చీపురుపుల్ల నుండి షెవర్లెట్ కార్లదాకా కొనుగోలు చేయమని నిస్సిగ్గుగా మనల్ని ఊరిస్తుంటారు.

'అందాలను ఆరబోస్తు అతివలు

బనీన్లకు, డ్రాయర్లకు, రేజర్లకు, షేవింగ్ క్రీములకు

అవసరం లేకున్నా చేయాలి అర్ధనగ్న ప్రదర్శనలు' అంటుంది పాతూరి అన్నపూర్ణ ఒక చోట కవితలో.

అందాన్ని ఒక పరిశ్రమను చేసి, స్త్రీల శరీరాలను పెట్టుబడిగా పెట్టి వందల కోట్ల రూపాయలు లాభాన్ని గడిస్తూ, దీని ద్వారా పర్యాటక రంగాన్ని పెంపొందించుకోవచ్చునని ప్రచారం చేస్తూ, ఆ పర్యాటక కేంద్రాలు విస్తృతంగా పెరిగి పెరిగి చివరకి భారీ వ్యభిచార కూపాలుగా తయారవుతున్నాయి. ఈ నేపథ్యంలో కుప్పిలి పద్మ 'సాలభంజిక' అన్న గొప్ప కథరాశారు. విదేశీ పర్యాటకులకు మన ప్రాంతాలు చూపించే నేపథ్యంలో అమ్మాయిలు వ్యభిచార కూపంలోకి ఎలా జారిపోతున్నారో చాలా లోతుగా చెప్తుందీ కథ.

ఇలా మానవ విలువల స్థానంలో మార్కెట్ విలువలు ప్రవేశపెట్టబడి, ఎన్నో వేల ఏళ్లుగా మనం ఏర్పరుచుకున్న విలువలు, సంతరించుకున్న నాగరికత కేవలం ఈ మార్కెట్ కోసం ధ్వంసం కావించబడ్డాయి.

ఈ అన్ని సందర్భాలనూ కూడ మన స్త్రీ రచయితలు సాహిత్యంలో ప్రతిబింబిస్తూ వస్తున్నారు, నిరసన తెలియజేస్తున్నారు.

"అర్థరహితమైన అందాల క్రీడలను ఉన్నత కుటుంబీకులు, విద్యాధికులు, అధికారులు, సభ్యంగా, సంస్కారంగా నిర్వహించినంత మాత్రాన అవి స్త్రీ జాతికి గౌరవప్రదమైనవీ, గర్వించదగినవీ అవుతాయా? తమనితాము ప్రదర్శించుకుంటూ, భ్రాంతుల్లో పడి తమను తామే అవమానించుకుంటున్నామనే స్పృహలేని అమాయకుల్ని మోస పచ్చుతున్నారు నిర్వాహకులు. 'పురుషుల్ని అలరించడం కోసం పుట్టిన అందమైన బొసిన స్త్రీ' అని నిరూపించేవే ఈ అందాల పోటీలు. స్త్రీ సమస్యలు పక్కదారి పట్టించే ఇటువంటి వారి అనుచిత చేష్టల్ని తీవ్రంగా గర్హిస్తున్నాను అంటుంది అనిశెట్టి రజిత ఒక వేదిక మీద.

అలాగే స్త్రీలు భర్త ప్రేమకోసం, ఆకర్షణకోసం వయసుతో పాటు క్రమంగా భర్తలకు దూరమైపోతున్నామన్న దిగులుతో చాల శ్రద్ధగా తమ శరీరాలను క్రమబద్ధం చేసుకోవాలని ప్రయత్నించడాన్ని చాలా దీనంగా 'M/s. మయూర' అన్న కథలో చిత్రిస్తారు కుప్పిలి పద్మ.

ఇన్ని నిరసనల మధ్య, ఇంత వ్యతిరేక పోరాటంలో నుండి కూడ స్త్రీ సౌందర్య వ్యాపారం విపరీతంగా పెరిగిపోయి, ఉద్యమించి ముందుకొచ్చిన స్త్రీలను అవమానాల పాలు చేసి పోరాటాన్ని నీరుకార్చేయడం విషాదం.

మన ఫిజిక్‌ని, సౌందర్య సాధనాల ద్వారా అందాన్ని పెంచుకునే క్రమంలో దాని వెనుక ఎంత కుట్ర ఉన్నదో అర్థం చేసుకోవలసిన అవసరం స్త్రీలుగా మనందరి మీదా ఉన్నది.

ఇదంతా ఇలా ఉంటే ఈ మొత్తం వ్యాపార కార్యకలాపాలకి అనువుగా ప్రతి ఇంట్లోకి ఒక టీ.వీ. ప్రవేశపెట్టబడ్తుంది. అది తనంతట తానుగా సంస్కృతీ విధ్వంసంలో తనవంతుపని తాను చేసుకుపోతుంది.

రోజువారీ అసహజమైన సీరియల్స్ మధ్యతరగతి స్త్రీల నరాలలో మత్తు ఇంజక్షన్లలా పనిచేస్తున్నాయి. స్త్రీలను వ్యక్తిత్వమే లేనివారుగా, విలాస వస్తువులుగా, పరమ దుర్మార్గులుగా చిత్రిస్తున్నాయి ఈ సీరియల్స్.

ఒక పురుషుడికి ఇద్దరు, ముగ్గురు భార్యలు అన్నది ఎంత సర్వసాధారణమై పోయిందంటే, రాను రాను ఇదే మన సంస్కృతేమో అని మనం నమ్మేంతగా. ఖరీదయిపోయిన ఇతర వినోదాల కోసం పరిగెత్తలేని మధ్య తరగతి ఈ సీరియల్స్‌ని క్రమం తప్పకుండా చూస్తూ, ఈ విలువల విధ్వంసాన్ని, అలక్ష్యాన్ని, అక్కరలేనితనాన్ని చాల తేలిగ్గా ఒంట పట్టించుకుటోంది.

ఇటీవల ఐశ్వర్యారాయ్ ఏదో ఫంక్షన్‌కి వస్తూ భుజాల దాకా ఉన్న గౌను (కేవలం రొమ్ములని మాత్రమే కప్పుతూ) వేసుకుని మెడలో నాగుపాము నమూనాలో ఉన్న దండ వేసుకుంది. అది చాల గొప్పగా ఆమె ఫంక్షన్‌కి వచ్చిన సందర్భాన్ని టీ.వీ. తెరమీద ఎలివేట్ చేసి చూపించినపుడు ఒక ఆరేళ్ల పాప 'నాక్కూడ ఆ నాగుపాము దండ చెయ్యించమ్మా' అని అడుగుతూంటే ఆ పామే వెన్నులో నుండి జరజరా పాకినట్టయింది.

ఈ విలువల విధ్వంసంలో పిల్లలు, టీనేజర్స్, యువతులు, గృహిణులు వృద్ధులు అన్న తేడా లేకుండా స్త్రీల పరిస్థితి రోజురోజుకీ దిగజారిపోతోంది. స్త్రీలలోని సున్నితత్వం, సుకుమారత్వం దెబ్బతిని పోయి రాటుదేలుతున్నారు.

ఎగువ మధ్యతరగతి, మధ్యతరగతి స్త్రీలనే కాక, దిగువ మధ్య తరగతి స్త్రీలను కూడ ఒక పూట కడుపు కట్టుకుని అయినా సరే ఈ వస్తువ్యామోహానికి, సౌందర్య సాధనాలకు బానిసలను చేయాలని, అందాల పరిశ్రమకు వినియోగదారులుగా మలచుకోవాలన్నదే సామ్రాజ్యవాదుల ఆలోచన, స్త్రీని ఒంటరిని చేసి ఆమెలో ఉన్న సున్నితత్వాన్నీ, సామాజికతనూ దెబ్బతీసి వ్యాపారం చేసుకోవడమే వీరి ధ్యేయం.

## 2

నా ఎనిమిదేళ్ల వయసులో బళ్లో ఒకమ్మాయి కాలుజారి పడిందని చుట్టూఉన్న మగపిల్లలు "పెళ్లయింది... పెళ్లయింది" అని చప్పట్లు చరుస్తూ నవ్వుతూంటే చాల ఆశ్చర్యపోయాను. పడితే పెళ్లవడమేంటి? అని పెళ్లంటే కొత్తచీరలు, నగలు, బంధుమిత్రులూ, పందిళ్లూ, సందళ్లూ ఒక ఆనందకరమైన సన్నివేశం కదా, మరి వీళ్లేంటి పడితే పెళ్లయిందని ఎగతాళి చేస్తున్నారు అని విస్మయం కలిగింది.

"పాఠం ఒప్పచెప్పకపోతే పెళ్లిచేస్తానని

పంతులు గారన్నప్పుడే భయమేసింది..."

పెళ్లి జరిగితే తరువాతే కాకుండా, సావిత్రి కవిత చదివినపుడు కూడ పదే పదే చిన్ననాటి ఆ సంఘటన మననమవుతూ ఉండేది.

'పెళ్లి' అన్నది ఇరువురు స్త్రీ పురుషుల నడుమ స్నేహం, ప్రేమ, పరస్పరావగాహన వంటి సంబంధాల మీద కాక పురుషుడి ఆధిక్యత, స్త్రీ యొక్క అధీన సంబంధాల పునాది మీద నిలబడ్డం నిజంగా శోచనీయం. ఈ పద్ధతి అనేక సంవత్సరాలుగా అంగీకృతమై పోయి ఉంది మన సమాజంలో.

"గృహహింస జరగడానికి రెండు కారణాలు కన్పిస్తున్నాయి. వరకట్నం, మద్యపానం ఒక కారణం కాగా, ప్రపంచీకరణ ఫలితంగా పెరుగుతున్న నిరుద్యోగం–పేదరికం రెండో కారణం. కారణమేదైనా సరే బాధపడేది మాత్రం మహిళే..." అంటుంది ఐద్వా తమిళనాడు రాష్ట్ర అధ్యక్షురాలు వాసుకి ఒకచోట.

పురుషాధిపత్యాన్ని ఎదుర్కొవడమే అత్యంత కష్టమైపోయిన సంసారాల్లో అదనంగా ఇప్పుడు ప్రపంచీకరణ పెత్తనం చేస్తోంది.

పరిశ్రమల యంత్రీకరణ మూలంగా విపరీతమైన వస్తూత్పత్తి జరుగుతూండడం, అనేక రకాల వస్తువుల మార్కెట్లో మనల్ని ఊరిస్తుండడంతో ప్రతీ వస్తువూ మనింట్లో ఉంటే బావుండునన్న ఆలోచన, వీటన్నింటినీ మరింత ప్రేరేపిస్తూ మత్తుమందు కలిపిన ఒక రంగు రంగుల ప్రపంచాన్ని చెక్కపెట్టె ఒకటి మనింట్లో తిష్టవేసి మన కళ్లముందు ఆవిష్కరిస్తోంది. ప్రతి వస్తువునీ మనింట్లోకి తీసుకురాక తప్పని ఒక అనివార్య పరిస్థితిలోకి మనని నెడ్తోంది. ఇదంతా కూడ స్త్రీల మీద మరింత ఒత్తిడిని పెంచుతోంది.

ఈ సకల సౌకర్యాలని కల్గిస్తోన్న అనేక రకాల వస్తువులు కించిత్ శ్రమలేకుండా, డబ్బు వెచ్చించకుండా తన ఇంటికి వచ్చే ఒక మార్గంగా పెళ్లిని ఎంచుకుంటున్నాడివాళ పురుషుడు.

కట్నంతో పాటుగా డబుల్‌కాట్లు, డన్‌లప్‌బెడ్లూ, కూలర్లూ, ఫ్రిడ్జ్, సోఫాసెట్లూ, బీరువా, ఒకటో, రెండో టీ.వీలు, వెండి పూజాసామానూ అదీ ఇదీ అని లేకుండా సకల వస్తువులూ అత్తారింటికి మోసుకు రావల్సిన బాధ్యత స్త్రీల మీద ఉంది. ఇందులో ఏ ఒక్కటి తక్కువయినా అత్తింటి మనుషులతో ఛీత్కరించబడుతుంది. సూటిపోటి మాటల నెదుర్కుటుంది, చాలాసార్లు పుట్టింటికి తరమబడ్తుంది. కొన్ని సార్లు చంపబడుతుంది, అనేక సార్లు ఆత్మహత్యల పాలవుతోంది.

విషాదమంతా ఎక్కడుందంటే ఇలా భార్యని హత్య చేసినా, ఆత్మహత్య చేసుకుని భార్య చనిపోయినా సరే, అతడు దుర్మార్గుడని స్పష్టంగా తెలిసి కూడ రెండోసారీ, మూడో సారీ కూడ పిల్లనివ్వడానికి సిద్ధపడే తల్లిదండ్రులివాళ మన సమాజంలో ఉండడం.

పూర్వకాలంలో, అంటే స్త్రీలు ఉత్పాదక శ్రమ చేసి డబ్బు సంపాదించలేని కాలంలో కట్నకానుకలనేవి తల్లిదండ్రులు కొంత స్త్రీధనంగా ఇవ్వడం అన్నదాంతో ప్రారంభమై ఉండొచ్చు. ఇవ్వాళ పురుషునితో సమానంగా అన్ని రంగాలలోనూ స్త్రీలు రాణిస్తున్నప్పటికీ కప్పం కట్టినట్లుగా కట్నమిచ్చి పెళ్లిళ్లు చేసుకోవలసిన దుస్థితి ఏమిటి? స్త్రీల వివాహ జీవితానికి కట్నం ఎలా అవరోధమవుతోంది అన్న విషయం ప్రభుత్వం లోతుగా ఆలోచించాల్సి ఉంది. వరకట్న వ్యతిరేక, గృహహింస వ్యతిరేక చట్టాల్ని పూర్తి బాధ్యతతో అమలు పరచాల్సి ఉంది.

ఇవ్వాళ పెళ్లి అంటే డబ్బు తప్ప మరొకటి కన్పించడం లేదు. ఆకాశమంత పందిరీ, భూదేవంత అరుగూ, స్వర్గలోక వాసులందరికీ విందులూ వినోదాలూ, కట్నకానుకలు సరే ఉండనే ఉన్నాయి. ధనవంతుల విషయంలో కోటి రూపాయల కట్నమూ, ఆర్భాటపు పెళ్లిళ్లూ ఒక వేడుకయితే అయి ఉండొచ్చు కానీ మధ్యతరగతి, దిగువ మధ్య తరగతి జీవితాల్లో పెళ్లి ఒక భయంకర స్వప్నంగా, దివాలా తీసిన వ్యాపారంగా మారిపోయింది, స్త్రీల జీవితానికి శాపమైపోయింది.

ఇవ్వాళ పెళ్లి అంటే ఇరువురు స్త్రీ పురుషుల నడుమ స్నేహం, ప్రేమ, పరస్పర అవగాహన కాదు, కేవలం డబ్బు పునాది మీద లెక్కల ఒంటికాలితో నిలబెట్టడానికి రెండు కుటుంబాలు చేస్తోన్న ఒక ప్రయత్నం మాత్రమే.

ఈ పరిస్థితిని గమనించి ప్రభుత్వం ఈ మితిమీరిన ఆర్భాటపు పెళ్లిళ్లను ఒక స్థాయికి తగ్గించి, బ్యాన్ చేయాల్సిన అవసరముంది. ప్రతి పెళ్లి రిజిస్టర్ కావల్సిన అవసరముంది.

సాహిత్యంలో కూడ స్త్రీ రచయితలు ఈ పరిస్థితులను ప్రతిబింబిస్తూ నిరసన తెలుపుతున్నారు. కట్నాలిచ్చి పెళ్లిళ్లు చేసుకోవడాన్ని గర్హిస్తున్నారు.

పి. సత్యవతి రాసిన 'గణితం' అన్న కథలో అయాచితంగా వచ్చే వస్తువుల కోసం పురుషుడు పెళ్లిని ఎలా వాహికగా చేసుకుంటున్నాడో ఎంతగా లెక్కలు కడుతున్నాడో వివరంగా చర్చకు పెడుతుందామె.

## 3

తమ పిల్లలు బాగా చదువుకునే ఉన్నత స్థానాల్లో ఉంటే చూడాలని ప్రతీ తల్లికీ ఉంటుంది. అందులో తప్పేం లేదు. అయితే ఆ చదువులు డాక్టర్లూ ఇంజనీర్లూ మాత్రమే అవ్వాలని కోరుకోవడంలోనే ఉంది ఇబ్బందంతా.

పిల్లలు కడుపున పడ్డప్పట్నుంచీ మొదలవుతుంది స్కూళ్ల వేట. అమెరికా సంబంధాలు చేయడమనే ఆలోచనతో సాగుతున్నాయి చదువులు.

ఆ క్రమంలో ఈ రోజున చదువులు తప్పనిసరిగా కొనుక్కోవల్సిన పరిస్థితి ఏర్పడింది. ఆ చదువుల కోసం పెట్టుబడుల సమీకరణలో పడి స్త్రీ, పురుషులిరువురూ యాంత్రికతను సంతరించుకుంటున్నారు. ఆ మహామాయలో పడి సున్నితమైన ప్రేమానుబంధాలకు, దాంపత్య సంబంధాలకీ కూడ దూరమైపోతున్నారు.

మరో వైపు స్త్రీలు కొందరు అనివార్యంగా ఉద్యోగాల్లోకి నెట్టబడుతూంటే గృహిణులయి ఇంట్లో ఉంటే మరో విధమైన హింస.

తనకి ఇష్టమున్నా, లేకపోయినా నిద్రవచ్చినా రాకున్నా కొడుకు ఇంటికొచ్చేప్పటికి ఆమె నిద్రనుంచి లేచి ఫ్రెష్‌గా ఉండాలి. వాడికి కావల్సిన బలాన్నిచ్చే తినుబండారాలను రెడిగా ఉంచి, తినగానే వాడినో గంటసేపు నిద్ర పోనిచ్చి ఈలోగా ఈమె వంటపని పూర్తి చేసుకోవాలి. ఇక అప్పట్నుంచీ రాత్రి పదకొండింటి వరకూ వాడికి కాపలా కూర్చోవాలి. మళ్లీ తెల్లవారుఝామున్నే తల్లికొడుకులిద్దరినీ నిద్రలేపి ఆయన పడుకుంటాడు. మళ్లీ మొదలు, కొడుక్కి పాలు కలిపిచ్చి నిద్రరాకుండా కాపలా కాస్తుంది.

వాడికి టిఫిన్ నోటికందిస్తూ, మధ్యమధ్యలో బిట్స్ అడుగు తూంటుంది. వాళ్లింటికి చుట్టాలెవరూ రావడానికి లేదు, ఆమె ఎక్కడికి వెళ్లడానికి వీల్లేదు.

"రేపు వాడికి సీటు రాకపోతే నా పెళ్లయిపోతుందండీ" అంటూ కళ్ల నీళ్లు పెట్టుకుందో లాంగ్‌టర్మ్ మొనగాడి తల్లి. ఇదీ ఇవ్వాల్టి తల్లుల దుస్థితి.

పొద్దు కుయ్యో మొర్రో అంటుంటే పిల్లల ఇష్టాఇష్టాలతో ఏమాత్రం సంబంధం లేకుండా తల్లిదండ్రులు తమకి నచ్చిన కోర్సుల్లో చేర్పించడం ఒక ఒత్తిడి, అటు మార్కెట్ పోటీని తట్టుకోవడం కోసం కాలేజీ యాజమాన్యపు ఒత్తిడి, విద్యార్థినులు ఎంత మాత్రం తట్టుకోలేక ఆత్మహత్యలు, ఆ తరువాత తల్లుల జీవితాంతపు విషాదాలూ, ఇదీ ఈ రోజు పరిస్థిది. ఒక కార్పొరేట్ కాలేజి గర్ల్స్ హాస్టల్లో ట్యాంకులో అలా కూర్చుని కళ్లు తెరుసుకునే ప్రాణాలొదిలిన స్నేహితురాల్ని చూసి మతి భ్రమించిన ఆమె రూమ్‌మేట్ పరీక్షలు రాయకుండానే వెళ్లిపోయింది.

ఎం.ఎ. ఫస్ట్‌క్లాసులో పాసయిన మరో అమ్మాయికి పెళ్లి సంబంధాలు కుదరడం కష్టమైపోతోంది. 'సాఫ్ట్‌వేరయితే బావుంటుందడీ' అంటూ వెనక్కి వెళ్తున్నారు పెళ్లికొడుకులు. కట్నాలు, కానుకలను మించి జీవితమంతా సంపాదించి పెట్టగలిగే ఒక డబ్బుయంత్రాన్ని కోరుకుంటున్నారు అబ్బాయిలు.

ఇదిలా ఉంటే మీడియా మూలంగా స్కూళ్లలో కూడ పదేళ్ల వయసునుండే బోయ్‌ఫ్రెండ్స్, గర్ల్‌ఫ్రెండ్స్ సంస్కృతి పెరిగిపోతోంది. సినిమాల్లో పదోక్లాసు ప్రేమలెక్కువయిపోయి చిన్న వయసులోనే జీవితాలని విధ్వంసం చేసుకునే దిశగా యువతని నడిపిస్తోంది.

ఇక నగరాల్లో అర్థరాత్రి దాకా డిస్కోల్లో మునిగి తేలుతూ జీవితపుదారుల్ని పక్కకి మళ్లించుకుంటోంది యువత. రేపటి దినం సమాజాన్ని ముందుకు తీసుకెళ్లాల్సిన యువతరం విలువైన సమయాన్నీ, డబ్బునీ, శక్తినీ కూడ డిస్కోక్లబ్బులకే, లేదా ప్రేమ పాఠాల వల్లించడానికే అంకితం చేయడాన్ని తలుచుకుంటే మరో పదేళ్ల తరువాత ఈ సమాజం ఏమయిపోతుందా? అన్న భయం, మనల్ని పట్టిపీడించక మానదు. మళ్లీ ఇక్కడ  కూడ ఆ ఫలితాలన్నింటిని అనుభవించేది మాత్రం అమ్మాయిలే.

**4**

గతంలోలా స్త్రీలిప్పుడు ఇంట్లో ఉండే పరిస్థితి కాదు. ఆత్మగౌరవం కోసమో, లేదా రోజురోజుకీ ప్రియమైనపోతోన్న జీవన విధానాన్ని భరించడం కోసమో అనివార్యంగా స్త్రీలు ఉద్యోగాలు చేయాల్సిన స్థితి, అనివార్యంగా అని ఎందుకనాల్సి వస్తోందంటే స్త్రీలు తమంతటతామగా స్వాలంబన కోసం ఉద్యోగాల్లో చేరడమన్నది ఒక క్రమమైతే, వస్తు సమీకరణ కోసమో, ఆస్తులు జమ చేసుకోవడం కోసమో, పిల్లల చదువుల పెట్టుబడుల కోసమో స్త్రీలు తప్పనిసరిగా ఉద్యోగాల్లోకి నెట్టబడుతోన్న క్రమం కూడ ఒకటుంది. దీనివల్ల, సౌఖ్యాన్ననుభవిస్తున్నది పురుషుడు, అదనపు భారాన్ని మోస్తున్నది స్త్రీ అని మనందరికీ తెలుసు.

పనిమినిషై, వంటమనిషై, పాకీమనిషై, చాకలయి, దర్జీయై, పిల్లలకీ టీచరయై, గృహిణి రోజులో ఎన్నెన్ని అవతారాలెత్తుతుందో లోతుగా తెలియజెప్తుంది శీలా సుభద్రాదేవి ఇంటి చాకిరీ అన్న కవితలో.

చీకట్లు విడిపోకముందే ఇంటిల్లి పాదికి సకల సౌకర్యాలూ అమర్చిపెట్టి మారాం చేస్తోన్న పిల్లల్ని బుజ్జగించి స్కూళ్లకి పంపి ఆఫీసుకి బయల్దేరుతోన్న మొగుడుగారికి అన్నీ అందించి, తినో, తినకో పరిగెడితే అప్పుడే వెళ్లిపోతుంది సిటీ బస్సు. క్షణకాలపు ఆలస్యానికి ఆఫీసరు చేత మాటలుపడి, రోజంతా నానా ఇబ్బందలూ పడి ఆఫీసు చాకిరీ చేసి నీర్సంగా ఇంటికోచ్చేవేళకి వరండాలో ముడికొడుతూ పిల్లలూ, ఇంట్లో కంపుకొడుతూ అంట్లూ ఎదురుచూస్తుంటాయి. పిల్లల స్నానాలూ, చదువులూ, వంటా, వార్పూ, అందరికీ తిన బెట్టడాలూ వంటగది సర్దాటకం ఒళ్లుతూలిపోతూ, కళ్లు కూరుకుని పోతూండగా ఆమె శయనేషురంభని కూడా అని గుర్తు చేస్తాడు అప్పటిదాకా విశ్రాంతి తీసుకున్న భర్త, ఇలాంటి స్త్రీని చూస్తే గుండె పగిలిపోకుండా ఉంటుందా ఎవరికయినా?

ఇదిలా ఉండే బదిలీల ప్రహసనమే మరో ఎత్తు. కొన్ని కార్పొరేట్ కంపెనీల్లు పనిచేసే భర్తలు, భార్యల్ని చేస్తోన్న ఉద్యోగాన్ని మాన్పించయినా సరే తమతో పాటుగా తీసుకు వెళ్లాల్సిన పరిస్థితిని యాజమాన్యం డిక్టేట్ చేస్తుంది. వారి కుటుంబానికి సకల సౌకర్యాలనీ కల్పించి ఆ వ్యక్తిలోని సర్వశక్తుల్నీ వినియోగించుకోవడానికి ప్రయత్నిస్తుంది. అందుకోసం కుటుంబాన్ని తప్పకుండా తీసుకురావాలనీ, అవసరమైతే భార్యకి కూడ ఉద్యోగాన్ని కల్పిస్తామనే ఎరవేస్తుంది. అప్పుడప్పుడూ భార్యలకి కొన్ని బహుమతులనిచ్చి మెప్పిస్తుంది. ఇక్కడ స్త్రీల ఇష్టాఇష్టాలకీ, అభిప్రాయాలకీ ఎటువంటి ప్రాధాన్యత ఉండదు.

ఈ విషయాల్ని చాలా లోతుగా చర్చకు పెడుతూ కార్పొరేట్ కంపెనీలు కల్పించే సౌకర్యాల వెనుకనున్న కుట్రని, స్త్రీల ఇష్టాలనూ, అభిప్రాయాలనూ లెక్కచేయకపోవటాన్ని నిరసిస్తూ, వాటి మూలంగా భార్యాభర్తల మధ్య సృష్టించబడుతోన్న అగాధాలను, చర్చకు పెడుతూ కుప్పిలి పద్మ 'కుబుసం' అన్న కథ రాసింది. ప్రపంచీకరణ నేపథ్యంలో స్త్రీలు ఎంత ఒంటరి వాళ్లయి పోతున్నారో కూడ ఈ కథ మనకీ చెప్తుంది.

అసలు స్త్రీలనిలా ఒంటరి వాళ్లను చేసి ఆమెలోంచి సర్వశక్తుల్నీ నిర్వీర్యం చేయడం కూడ స్వేచ్ఛా విపణి ధ్యేయం.

ఇదంతా ఒక ఎత్తయితే ఇంట్లో, ఆఫీసుల్లో, వీథుల్లో, సిటీబస్సుల్లో ఎక్కడయినా సరే స్త్రీలు లైంగిక వేదింపులకు గురికావడం మరో ఎత్తు.

అది స్కూలు కానియండి, ఆఫీసుకానియండి, చిన్నఊరు కానియండి, పెద్దఊరు కానియండి ఇదే పద్ధతి. చాలామంది స్త్రీలు దీనిని మౌనంగా, సహజంగా భరించుకుంటుపోతున్నారు. బయటపడితే తమనే నిందిస్తారని భయపడతారు, అవమానమనుకుంటారు.

ఆఫీసుల్లో అయితే ఇంక్రిమెంట్లూ, ప్రమోషన్లూ పోతాయని భయపడి బిగబట్టుకుని పై అధికారుల హింసని భరిస్తుంటారు. సెలవులివ్వడం దగ్గర్నుంచి ప్రమోషన్ల దాకా అన్ని విషయాల్లోనూ అడ్డుకుంటారు ఆఫీసర్లు. వారి కంటే పై ఆఫీసర్లకి ఫిర్యాదు చేసినా ఒక్కొక్కసారి ఎటువంటి స్పందనా ఉండదు. ఇటువంటి మానసిక హింసే కాకుండా శారీరక ధర్మాలు కూడ స్త్రీలని ఒక్కొక్కసారి వేధిస్తుంటాయి. ఇన్ని సమస్యల మధ్య, ఇన్ని వేదింపుల నడుమ స్త్రీలు ఇంటా బయటా నానా చాకిరి చేసి కించిత గుర్తింపు లేకపోగా ఆరోగ్యాన్ని కూడ కోల్పోతున్నారు.

*(మిగతా వచ్చే సంచికలో)*

# ప్రభుత్వ పథకాలు - ఒక పరిశీలన

- ఎన్. శ్రీదేవి

1. సమీకృత గ్రామీణాభివృద్ధి పథకం (ఐఆర్‌డిపి)
2. జాతీయ గ్రామీణ ఉపాధి పథకం (ఎన్ఆర్ఇపి)
3. భూమిలేని గ్రామీణులకు ఉపాధి గ్యారంటి పథకం (ఎల్ఇజిపి)
4. గ్రామీణ ఉపాధి వేగిరం చేసే పథకం (సిఎస్ఆర్ఇ)
5. జవహర్ రోజ్‌గారి యోజన (జిఆర్‌వై)
6. ఉపాధి హామీ పథకం (ఇఎఎస్)
7. పది లక్షల బావుల పథకం (ఎమ్‌డబ్ల్యూఎస్)
8. స్వయం ఉపాధి గ్రామీణ యువత ఉపాధికి శిక్షణ పథకం (ట్రైసెమ్)
9. డ్వాక్రా
10. స్వర్ణజయంతి గ్రామస్వరాజ్ యోజన (ఎస్‌జిఎస్‌వై)
11. స్వయం సహాయ బృందాలు (ఎస్‌ఎచ్‌జిఎస్)
12. గంగా కళ్యాణ్ యోజన (జికెవై)
13. పనికి ఆహార పథకం (ఎఫ్ఎఫ్‌డబ్ల్యూ)

పేదరిక నిర్మూలనకు, ఉపాధి కల్పనకు కేంద్ర ప్రభుత్వం 1971లో ప్రారంభించి అమలు పరచిన పథకాల పట్టిక ఇది. తాజాగా నూరు దినాల ఉపాధి గ్యారంటీ పథకం (ఎన్ఆర్ఇజిపి) అమలు ప్రారంభమైంది. ఉపాధి కల్పనా పథకాలు అనుకొన్న ఫలితాలివ్వక పోవటం లేదా ఇతర కారణాల వల్ల ఒక పథకాన్ని ఉపసంహరించి, మరో పథక ప్రారంభించడమో, లేదా రెండు మూడు పథకాలను ఒకే పథకం కిందకు తీసుకొని రావటమో జరిగింది. తాజాగా నూరు దినాల ఉపాధి గ్యారంటీ పథకం ప్రవేశపెట్టారంటేనే ఇంతవరకూ అదే లక్ష్యంతో అమలు పరచిన పథకాలు విఫలమయ్యాయని భావించవచ్చు.

**కేటాయింపు-ఖర్చు**

పిండికొద్దీ రొట్టె అన్నారు. పథకాలు ఇచ్చిన ఫలితాలు, ఆయా పథకాల కోసం చేసిన ఖర్చు మీద ఆధారపడి ఉంటాయి. కేంద్రం చేసిన మొత్తం కేటాయింపులో ఈ పథకాల కోసం చేసిన ఖర్చు శాతం ఎంత, అలాగే జిడిపిలో ఎంత శాతం అని రెండు విధాలుగా విశ్లేషిస్తారు. మొత్తం కేంద్ర ప్రభుత్వం ఖర్చులో గ్రామీణాభివృద్ధి కోసం చేసిన ఖర్చు 1990-91లో సుమారు మూడు శాతం నుండి 1995-96 నాటికి అయిదు శాతం వరకు పెరిగినా, ఆ తర్వాత ఆ దశాబ్దాంతం నాటికి నాలుగు శాతానికి తక్కువగా తగ్గి, మళ్లా పెరిగినా 1995-96 నాటి అయిదు శాతాన్ని అందుకోలేదు. అలాగే జిడిపిలో ఈ ఖర్చు శాతం ఏనాడు ఒక్క శాతాన్ని కూడా చేరుకోలేక పోయింది. అంటే నూరు రుపాయల స్థూల జాతీయాదాయంలో 75 పైసల ఖర్చు కూడా చేయలేక పోవటం. (గ్రామీణ జనాభా 70 కోట్లు) అత్యంత దురదృష్టకరం.

**ఉపాధి కల్పన**

గ్రామీణాభివృద్ధి కోసం ఖర్చు ఇలా ఉంటే, ఉపాధి కల్పన పథకాలకు చేసిన ఖర్చు చూడబోతే ఇంకా కానాకష్టంగా ఉంది. సుమారుగా పైన ఉదహరించిన కాలాల్లో ఖర్చు జిడిపిలో 0.35 నుండి 0.46 శాతానికి పెరిగి, ఆ తర్వాతి కాలంలో 2003-03 నాటికి 0.39 శాతానికి పడిపోయింది. 2000-01లో అయితే 0.13 శాతానికి దిగిపోయింది. రుపాయిలో 13 పైసలు ఖర్చు పెడితే ఉపాధి ఎలా పెరుగుతుంది? అలాగే ఉపాధి పథకాల కోసం కేంద్ర ప్రభుత్వం మొత్తం ఖర్చులో 1990-91లో 1.90 శాతం నుండి 2004-05 నాటికి 1.27 శాతానికి పడిపోయింది.

**స్వయం ఉపాధి పథకాలు**

ఆవు చేలో మేస్తుంటే, దూడ గట్టుమేస్తుందా? స్వయం ఉపాధి పథకాలదీ అదే కథ. జిడిపిలో ఈ పథకాల కోసం ఖర్చు 1990-91 లో 0.07 శాతం నుండి 2003-04 నాటికి 0.03 శాతానికి దబ్బున పడిపోయింది. 2000-01, 2001-02 సంవత్సరాల్లో అయితే ఈ శాతం 0.02 మాత్రమే. కేంద్ర ప్రభుత్వ మొత్తం ఖర్చులో స్వయం ఉపాధి పథకాల కోసం ఖర్చు కూడా పై సంవత్సరాల మధ్య కాలంలో 0.36 శాతం నుండి 0.15 శాతానికి దిగజారింది.

**ఖర్చు సరే, లబ్ధిదారులెంతమంది?**

ఖర్చుతగ్గి పోతుంటే, లబ్ధిదారుల సంఖ్య పెరగదు కదా. అదే జరిగింది. ఐఆర్‌డిపి/ఎస్‌జిఎస్‌వై పథకాల కింది లబ్ధి పొందిన స్వరోజ్‌గార్ కుటంబాల సంఖ్య ఎనిమిదవ ప్రణాళికలో 108.36 కోట్ల నుంచి తొమ్మిదవ ప్రణాళికలో 56.92 కోట్లకు, జెఆర్‌వై/జెజిఎస్‌వై పథకాల కింద అదే కాలంలో 40561.06 లక్షల నుంచి 13949.34 లక్షలకు తగ్గిపోయింది. ఇఎఎస్ పథకం కింద మాత్రం ఉపాధి లభించిన పని దినాల సంఖ్య 10719.60 లక్షల నుంచి 14633.50 కు పెరిగింది. అయితే రెండో పంచవర్ష ప్రణాళికల కాలంలోను ఏ పథకానికి కూడా కేటాయించిన సొమ్ము ఖర్చు కాలేదు. రు. 4561.70 కోట్లు కేటాయింపు మురిగిపోయింది. ఈ లెక్కన ఉపాధి కల్పన లక్ష్యం నెరవేరటం కోసం మరిన్ని సంవత్సరాలు ఎదురు చూడాల్సి వస్తుంది.

మొత్తం మీద చూస్తే, తక్కువ కేటాయింపులు, ఈ కేటాయింపులు కూడా కొన్ని సందర్భాల్లో ఇతర పథకాలకు బదలాయించటం, జిల్లా స్థాయిలో డిఆర్‌డిఎ పథకాలు అమలు పరచే నైపుణ్యం లోపించటం జరిగిందనేది స్పష్టం. ఈ లోపాలను సరిదిద్దటానికి పదవ ప్రణాళికలో ప్రయత్నం జరిగింది. ఆ ప్రణాళిక నివేదిక వచ్చేవరకు ఆ ప్రయత్నం ఎంత మేరకు ఫలించిందో వేచి చూడాలి.

(శ్రీదేవి వ్యాస సంక్షిప్తీకరణ వి. హనుమంతరావు)

**ఎనిమిది, తొమ్మిదవ ప్రణాళికల్లో పేదరికం తగ్గింపు పథకాల పై కేటాయింపు, ఖర్చు**

రు. (కోట్లు)

| | | ఐఆర్‌డిపి/ఎస్‌జిఎస్‌వై | | | జెఆర్‌వై/జెజిఎస్‌వై | | | ఇఎఎస్ | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్ర. సం. | సంవత్సరం | కేంద్రం, రాష్ట్రాల మొత్తం కేటాయింపు | మొత్తం ఖర్చు | స్వరోజ్‌గారీ కుటుంబాల (లక్షల్లో) | కేంద్రం, రాష్ట్రాల మొత్తం కేటాయింపు | మొత్తం ఖర్చు | ఉపాధి కల్పన లక్షల పని దినాలు | కేంద్రం, రాష్ట్రాల మొత్తం కేటాయింపు | మొత్తం ఖర్చు | ఉపాధి కల్పన లక్షల పని దినాలు |
| **1** | **2** | **3** | **4** | **5** | **6** | **7** | **8** | **9** | **10** | **11** |
| 8వ ప్రణాళిక | | | | | | | | | | |
| 1 | 1992–93 | 662.22 | 693.88 | 20.69 | 3169.05 | 2709.59 | 7821.02 | 0.00 | – | – |
| 2 | 1993–94 | 1093.43 | 956.65 | 25.39 | 4059.42 | 3878.71 | 10258.40 | 0.00 | 183.75 | 494.74 |
| 3 | 1994–95 | 1098.22 | 1088.31 | 22.15 | 4376.92 | 4268.33 | 9517.07 | 0.00 | 1235.45 | 2729.56 |
| 4 | 1995–96 | 1097.21 | 1077.16 | 20.89 | 4848.70 | 4466.91 | 8958.25 | 0.00 | 1720.61 | 3465.27 |
| 5 | 1996–97 | 1097.21 | 1131.66 | 19.24 | 2236.79 | 2163.98 | 4006.32 | 0.00 | 2160.41 | 4030.02 |
| | మొత్తం | **5048.29** | **4867.68** | **108.36** | **18690.88** | **17487.52** | **40561.06** | **0.00** | **5300.22** | **10719.60** |
| 9వ ప్రణాళిక | | | | | | | | | | |
| 1 | 1997–98 | 1133.51 | 1109.54 | 17.07 | 2499.21 | 2439.38 | 3955.89 | 2460.48 | 2904.97 | 4717.74 |
| 2 | 1998–99 | 1456.28 | 1162.28 | 16.77 | 2597.03 | 2525.48 | 3766.41 | 2485.15 | 2882.18 | 4279.36 |
| 3 | 1999–2000 | 1472.34 | 959.86 | 9.34 | 2205.58 | 2032.45 | 2683.08 | 2431.46 | 2182.61 | 2786.17 |
| 4 | 2000–01 | 1332.50 | 116.27 | 10.30 | 2192.96 | 1929.23 | 2683.17 | 2082.27 | 1861.11 | 2183.92 |
| 5 | 2001–02 | 774.50 | 555.15 | 6.25 | 2493.01 | 699.07 | 860.79 | 1730.92 | 530.92 | 666.27 |
| | మొత్తం | **6169.13** | **4716.17** | **56.92** | **11687.93** | **9625.61** | **13949.34** | **11190.28** | **10361.79** | **14633.50** |

మూలం :

# సచార్ కమిటీ నివేదిక - నిగ్గు తేల్చిన నిజాలు

- సయ్యద్ ఖుర్షీద్

"ఏ దేశంలోనైనా మైనార్టీల విశ్వాసాలు, నమ్మకాల పట్ల రాజ్యం ప్రదర్శించే వైఖరులే, ఆ రాజ్యం యొక్క స్వభావాన్ని వెల్లడిస్తాయి. ఒక రాజ్యం యొక్క స్వభావాన్ని తెలుసుకోవడానికి, ఆ రాజ్యం మైనార్టీల పట్ల ప్రదర్శించే వైఖరి ఒక యాసిడ్ పరీక్ష లాంటిది".

ఈ దేశంలో స్వాతంత్ర్యానంతరం సాధించిన ప్రగతి ఫలాలు ముస్లింలకు అందని ద్రాక్ష లానే మారిపోయాయి. దానికి తోడు ముస్లింల పట్ల అనేక అపోహలు, అపార్థాలు చోటు చేసుకున్నాయి. అలాంటప్పుడు కనీసం ముస్లింల స్థితిగతులను సమగ్రంగా అధ్యయనం చేయాలని, వాటి ఫలితాలపై దృష్టిపెట్టాలని మన పాలకులు ఎవ్వరూ ఆలోచించక పోవడం గొప్ప విషాదం. ప్రస్తుత ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ ఈ అంశం పై దృష్టిపెట్టడంతో ముస్లింల స్థితిగతులపై కఠోర వాస్తవాలు వెలుగులోకి వచ్చాయి. సాంఘిక, ఆర్థిక, విద్యారంగాలలో ముస్లింల స్థితిగతులను సమగ్రంగా అధ్యయనం చేయడానికి 2005 మార్చి 9న ఢిల్లీ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి రాజిందర్ సచార్ నేతృత్వంలో ఏడుగురు సభ్యులతో ఒక ఉన్నత స్థాయి కమిటీని ఏర్పాటు చేయడం జరిగింది. ఈ కమిటీ తన నివేదికను 2006 నవంబర్ 17న ప్రభుత్వానికి సమర్పించింది.

వాస్తవానికి ఇలాంటి కమిటీలు ముస్లిం సమాజానికి, దేశానికి కొత్తకాదు. 19వ శతాబ్దపు తొలిభాగంలోనే అప్పటి బ్రిటిష్ పాలకులు మాన్‌స్టర్ ఎల్‌ఫిన్‌స్టన్ నేతృత్వంలో ముస్లింల పరిస్థితుల పరిశీలనకు ఒక కమిటీ నియమించారు. ఈ కమిటీ సూచనల ఫలితంగా 1935లో ప్రభుత్వం ఒక చట్టం చేయడం జరిగింది. దళితుల నుండి ముస్లిం మతంలోకి మారినవారికి, హిందూ దళితులకు ఇచ్చినట్లే రిజర్వేషన్లు కల్పిస్తూ చట్టం తెచ్చారు. 1956లో మనం రాసుకున్న రాజ్యాంగం ముస్లింలకు అప్పటివరకు ఉన్న ఈ హక్కును హరించింది. ఇందిరాగాంధీ హయాంలో డా. గోపాల్‌సింగ్ నాయకత్వంలో పది మంది సభ్యులతో మరో కమిటీ నియమించారు. 1983 జూన్ 14న ఈ కమిటీ సమర్పించిన నివేదికను పాలకులు అటకెక్కించారు.

గత కమిటీలకు భిన్నంగా సచార్ కమిటీ సకాలంలో తన విధులను నిర్వహించింది. నివేదికను సమర్పించింది. దేశంలోని ముస్లింల ఉనికి, భద్రత, సమానత్వం అనే మూడు అంశాల ఆధారంగా సచార్ కమిటీ తన అధ్యయనాన్ని కొనసాగించింది. ముస్లింల జనాభా, అభివృద్ధి, విద్య, ఉద్యోగం, పేదరికం, జీవన ప్రమాణాలు, తలసరి వినియోగం, ఆర్థిక అవకాశాలు, సదుపాయాలు తదితర అంశాలను పరిగణలోకి తీసుకున్నది. ముస్లిం జనాభా అధికంగా ఉన్న 13 రాష్ట్రాలను సందర్శించింది. సభలూ-సమావేశాలు నిర్వహించింది. అన్ని ప్రభుత్వ శాఖల నుండి, సంస్థల నుండి నివేదికలను, ఆధారాలను, గణాంకాలను సేకరించింది. ముస్లింల స్థితిగతులపై నిరోహమాటంగా, నిస్సంకోచంగా, నిర్భయంగా వాస్తవాలను వెల్లడించింది. కేవలం సమస్యలను ఎత్తి చూపడంతో సరిపెట్టకుండా, వాటికి పరిష్కారాలను సూచించింది. తాను వ్యక్తం చేసిన ప్రతీవాదాన్ని బలపర్చే గణాంకాలను, ఆధారాలను స్పష్టంగా పొందుపర్చింది. ఈ నివేదిక వెల్లడించిన కఠోర నిజాల పట్ల ముస్లిం వ్యతిరేకశక్తులు సైతం నోరు మెదపక పోవడం, ఈ కమిటీ నిష్పక్షపాతానికి నిదర్శనం. గణాంకాలు, ఆధారాల ఆధారంగా పరిశీలన ద్వారా రూపొందించిన మంచి ప్రయత్నం సచార్ కమిటీ నివేదిక అంటే అతిశయోక్తి కాదు.

ప్రపంచ దేశాలలో ఇండోనేషియా తర్వాత అత్యంత ముస్లిం జనాభాకల దేశం ఇండియా. ఈ జనాభా (13.8 శాతం) ను, మానవాభివృద్ధి సూచికలతో పోల్చి పరిశీలించి చూస్తే వారు తీవ్రంగా వెనుకబడి ఉన్నారు. ఎంతో మంది భావిస్తున్నట్లుగా, ముస్లిం వ్యతిరేక శక్తులు ప్రచారం చేస్తున్నట్లు (హమ్ పాంచ్ - హమారే పచ్చీస్) ఈ దేశంలో ముస్లింల జనాభా పెరగడం లేదని సచార్ కమిటీ స్పష్టం చేసింది. వారి జీవన విధానం మత నిర్దేశం ఎక్కువగా ఉన్నప్పటికీ, సంతాన నియంత్రణ విషయంలో దాని ప్రభావం అంతగా లేదని కమిటీ నివేదిక వెల్లడించింది. మరిన్ని అధునాతన వైద్యఆరోగ్య సమదుపాయాలు వారికి అందుబాటులోకి వస్తే, వారి జనాభా పెరుగుదల మరింత అదుపులోకి వస్తుందని స్పష్టం చేసింది. జనాభా విషయంలో ముస్లింలలో ఇప్పటి పరిస్థితి కొనసాగితే, భవిష్యత్తులో ముస్లింల జనాభా మరింత తగ్గుతుందని ఈ నివేదిక వెల్లడించింది. ముస్లింల జనాభా విపరీతంగా పెరుగుతుందని, సమీప భవిష్యత్తులో ముస్లిమేతరులను మించిపోతుందని, పదేపదే అసత్య ప్రచారాలు చేస్తున్న హిందుత్వ వాదులకు ఇది చెంపపెట్టులాంటిది. ఇప్పటికైనా వారు ఇలాంటి అసత్య ప్రచారాలను మానుకోవడం మంచిది.

విద్యారంగంలో ముస్లింలు ఎస్.సి., ఎస్.టి.ల కన్న ఒకింత మెరుగుగానే ఉన్నప్పటికీ, మిగితా సామాజిక వర్గాలకంటే తీవ్రంగా వెనుకబడి ఉన్నారు. 1993-2000 మధ్యకాలంలో అన్ని వర్గాలు విద్యా విషయంలో ప్రగతి దాయకంగానే ఉన్నా (ముస్లింలతో సహా) ఈ వెనుకబాటుతనంలో మార్పులేకపోడం గమనార్హం. గత నాలుగు సంవత్సరాల గణాంకాలను పరిశీలిస్తే, ప్రాథమిక విద్యను ముస్లిం విద్యార్థుల్లో 44 శాతం, ఎస్.సి. విద్యార్థులు 39 శాతం, ఎస్.టి.లు 32 శాతం, మిగిలినవారు 62 శాతం పూర్తిచేస్తున్నట్లుగా స్పష్టమవుతున్నది. మాధ్యమిక, ఉన్నత విద్యలోనూ ఇదే ధోరణి, ముస్లింలలో 6-14 వయసు గల బాలబాలికలో 25 శాతం మంది అసలు పాఠశాలల మొఖమే చూడడం లేదు. ముస్లింలలో 75 శాతం మంది బాలబాలికలు పాఠశాలలో చేరితే, హైస్కూల్ స్థాయిక 11.6 శాతం, డిగ్రీ స్థాయికి 3.6 శాతం మంది మాత్రమే చేరగలుగుతున్నారు. ఈ వెనుకబాటుతనం ఏ ఒక్క రాష్ట్రానికో పరిమితమయింది కాదు. ఒక్క జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రాన్ని మినహాయిస్తే, అన్ని రాష్ట్రాలలోనూ ఇదే పరిస్థితి.

ముస్లింల విద్యార్జనలో మదర్సాలది ఒక ప్రత్యేకత. ముస్లింల వ్యతిరేక శక్తుల దృష్టిలో ఇవి తీవ్రవాదులకు ఆశ్రయాలు. బాంబులు, తుపాకుల ఉత్పత్తి కేంద్రాలు. కాని ఈ మదర్సాలలో చదువుతున్న ముస్లిం విద్యార్థులు, మొత్తం ముస్లిం విద్యార్థులలో 3 శాతం మాత్రమే. మెరుగైన విద్యను అందించే పాఠశాలలను ముస్లిం జనసముదాయానికి అందుబాటులో ప్రభుత్వం నెలకొల్పితే, ఈ మదర్సాలకు స్వస్తి చెప్పడానికి సైతం ముస్లింలు సిద్ధంగా ఉన్నారని సచార్ కమిటీ స్పష్టం చేసింది. అయినప్పటికీ, ఈ మదర్సాలలో బోధించే పాఠ్యాంశాలను ఎప్పటికప్పుడు సమీక్షిస్తూ ఉండాలని, వాటిని సంస్కరించాలని, ఇందుకోసం ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయాలని సచార్ కమిటీ సూచించింది. మదర్సాలను హయ్యర్, సెకండరీ, ఇంటర్‌బోర్డులతో అనుసంధానం చేయాలని, ఈ మదర్సాలలో ప్రధానం చేసే డిగ్రీలకు గుర్తింపునివ్వాలని, ఈ పట్టభద్రులకు ప్రభుత్వ ఉద్యోగాలన్నింటిలోను అవకాశాలు కల్పించాలని సచార్ కమిటీ సూచించింది. విశ్వవిద్యాలయాల్లో జ్యోతిష్యశాస్త్రాన్ని ప్రవేశపెట్టిన పాలకులు, ఈ విషయంలో కమిటీ చేసిన సూచనలను పరిగణలోకి తీసుకోవల్సిన అవసరం ఉంది.

సచార్ కమిటీ నివేదిక ప్రకారం ముస్లింల జీవన ప్రమాణాలు ఎస్సీ, ఎస్టీలకంటే కొంచెం ఎక్కువగాను, బీసీలకంటే చాలా వెనుకబడి ఉన్నాయి. ముస్లింల జనాభాకు, ఉద్యోగాలలో వారికి లభిస్తున్న ప్రాధాన్యానికి పొంతనే లేదు. దేశంలో 89.5 లక్షల మంది ప్రభుత్వ ఉద్యోగులు ఉంటే, అందులో ముస్లింలు 4.9 శాతం మాత్రమే. ముస్లింలలో అధిక సంఖ్యాకులు అసంఘటిత రంగాలలోనే ఉపాధిని వెతుక్కుంటున్నారు. పట్టణ జనాభాలో దేశం మొత్తంమీద 28 శాతం మంది దారిద్ర్యరేఖకు దిగువ స్థాయిలో జీవనం గడుపుతుంటే, ముస్లింలలో ఇలాంటి జీవనాన్ని 44 శాతం మంది గడుపుతున్నారు. దేశంలోని ఏ రాష్ట్రంలోను ముస్లింలు తమ జనాభాకు తగిన దామాషాలో ప్రభుత్వ ఉద్యోగాలను పొందడం లేదు. కాని జైళ్లలో మాత్రం ముస్లింలు తమ జనాభా నిష్పత్తికి మించి ఉన్నారు. ముఖ్యంగా మహారాష్ట్ర, గుజరాత్, కేరళ రాష్ట్రాలలోని జైళ్లల్లో ముస్లింలు అధిక సంఖ్యలో ఉన్నారు. ఈ విషయాన్ని మొదట్లో వెల్లడించిన సచార్ కమిటీ తుదినివేదికలో మాత్రం ఎందుకనో ఈ విషయాన్ని తొలగించింది. అదే విధంగా త్రివిధ దళాలలో ముస్లింల స్థితిగతులపై గణాంకాలను సేకరించిన కమిటీ, రక్షణ మంత్రిత్వ శాఖ వినతిమేరకు నివేదికలో పొందుపర్చలేదు. (ఈ గణాంకాల సేకరణ సమయంలో బి.జె.పి., దాని అనుబంధ సంఘాలు తీవ్ర అభ్యంతరాలను వ్యక్తం చేసిన సంగతి గమనార్హం).

ముస్లిం మేధావులు చాలా కాలంగా చెప్తున్న సామాజిక అంతరాలు, హిందూ సమాజంలో మాదిరిగానే, ముస్లింలలోనూ ఉన్నాయని ఈ నివేదిక తేల్చి చెప్పింది. వాటిని మూడు స్థాయిలుగా వర్గీకరించింది. 1) అష్రాఫీలు, 2) అజ్లాఫీలు, 3) అర్జాల్స్. అష్రాఫ్‌లది హిందూ అగ్రవర్ణాలతో సమాన స్థాయి అని; అజ్లాఫ్‌లది, హిందూ వర్ణాల్లోని వెనుకబడిన తరగతుల స్థాయి అని; అర్జాల్స్‌ది, హిందూ మతంలోని ఎస్సీ, ఎస్టీల స్థాయి అని వర్గీకరించింది. వీరికి రిజర్వేషన్లు కల్పించాలని సూచించింది.

ముస్లింలంతా విద్యా ఉద్యోగ రంగాలలో ఎస్సీ, ఎస్టీల కంటె కొంత మెరుగుగాను, బిసీల కంటే బాగా వెనుకబడి ఉన్నారని కమిటీ నివేదిక స్పష్టం చేసింది. రిజర్వేషన్ల విషయానికి వచ్చేసరికి, ఎస్సీ, ఎస్టీల స్థాయి జీవనం గడుపుతున్న అర్జాల్స్‌కు మాత్రమే రిజర్వేషన్లు ఇవ్వాలని సూచించడం ఒకింత విస్మయానికి గురిచేస్తున్నది. బిసీల స్థాయి జీవనం గుడుపుతున్న ముస్లింలు ఉన్నారని చెపుతూనే రిజర్వేషన్ల విషయంలో వారిని విస్మరించడం ఆశ్చర్యకరం. ముస్లింల సమస్యల పరిష్కారానికి రిజర్వేషన్ ఒక్కటే మార్గం కాదని, ఈ నివేదిక రూపకల్పనలో క్రియాశీలక భూమికను నిర్వహించిన కమిటీ కార్యదర్శి, ఆర్థికవేత్త అబూసాలే షరీఫ్ స్వయంగా పేర్కొనడం చిత్రంగా ఉంది. అయితే ఇక్కడో విషయం గమనించాలి. ఏ వర్గ ప్రజల సమస్యలన్నింటినీ రిజర్వేషన్లు పరిష్కరించలేవన్నది యధార్థం. రిజర్వేషన్లు అనేవి ఆయా వర్గాల ఎదుగుదలకు ఊతంలా పనిచేస్తాయి. రాజ్యాంగం కల్పించిన రిజర్వేషన్ల సదుపాయం వల్ల దళిత బహుజనులు ఎంతో కొంత మేరకు ప్రయోజనం పొందిన ఉదాహరణలు మనముందున్నాయి. అలాంటప్పుడు ముస్లింలలో బిసీల స్థాయి జీవనం గడుపుతున్న ముస్లింలకు రిజర్వేషన్లను నిరాకరించడం, మరేదో సూత్రీకరించడం ఏమేరకు సమంజసం? ఏది ఏమైనా ఈ విషయంలో తగిన నిర్ణయం తీసుకోవల్సింది ఇక ప్రభుత్వమే.

ముస్లింలు అన్ని రంగాలతో పాటు రాజకీయాలలోను వెనుకబడి ఉన్నారని సచార్ కమిటీ వెల్లడించింది. దేశంలోని 543 లోక్‌సభా స్థానాలలో కేవలం 33 మాత్రమే ముస్లిం సభ్యులున్నారని తెలిపింది. ముస్లింలను కిందిస్థాయి నుండి నామినేటెడ్ పదవుల్లో నియమించాలని సూచించింది. ఈ విషయంలో మన రాష్ట్రంలో ఎదురైన అనుభవాలను దృష్టిలో ఉంచుకుంటే, ఈ సూచనలో ఉన్న సత్తా ఏమిటో ఇట్టే వెల్లడవుతుంది. మనరాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలోని ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘాలన్నింటిలోను ఒక్కొక్క మైనార్టీ సభ్యుడ్ని నామినేట్ చేస్తూ ఆదేశాలను జారీ చేసింది. అలా నామినేట్ చేయబడిన సభ్యులలో చాలా మందికి తాము ఆయా సంఘాలలో నామినేటెడ్ సభ్యులమనే విషయమే తెలియదు. ఒకవేళ తెలిసినా వారిని ఆయా పాలకవర్గాల సమావేశాలకు పిలిచేవారే లేరు. పిలిచినా వారికి ఓటు హక్కులేదు. ఇలాంటి "నామ్ కే వాస్తే నామినేటెడ్" పదవులతో ముస్లింలకు ఒనగూడే ప్రయోజనమేముంటుంది?

ముస్లింల జనాభా-ఓటింగ్ శాతం ఎక్కువగా ఉన్న నియోజక వర్గాలను ఎస్సీలకు కేటాయించరాదని ఈ కమిటీ సూచించింది. ఉత్తరప్రదేశ్, బీహార్ పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలో, ఎస్సీలకంటే ఎక్కువ శాతం ఓటింగ్, (దాదాపు 50 శాతంగా ఉన్న ముస్లిం ఓటర్లు) ఉన్న నియోజకవర్గాల ఎస్సీలకు కేటాయించిన తీరును ప్రశ్నించింది. వాటిని నియోజక వర్గాల పునర్విభజన కమీషన్ పరిశీలించాలని సూచించింది.

ఇవే కాక, మైనార్టీల వంటి నిరాదరణకు గురైన వర్గాల సాధకబాధకాలను చూడడానికి సమాన అవకాశాల కమీషన్ (ఈక్వల్ ఆపర్చ్యునిటీ కమీషన్) ను ఏర్పర్చాలని, ఉద్యోగ, విద్యావకాశాలు, గృహవసతి, బ్యాంకు రుణాల్లో ముస్లింల వివక్షకు లోనైన సందర్భాలలో వారి ఫిర్యాదులను విచారించడాని ప్రత్యేకమైన న్యాయ యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలని సచార్ కమిటీ సూచించింది. 500 కోట్ల

# సచార్ కమిటీ నివేదిక : ముస్లిం ఏబిసిడి

*– ఎ.ఎం. ఖాన్ యజ్దానీ (డానీ)*

**చ**ట్టాల కోసం సమాజమా? సమాజం కోసం చట్టాలా? అనే ప్రశ్న తెలత్తితే అందరూ సమాజం కోసమే చట్టాలు ఉండాలంటారు. కానీ, భారత ముస్లింల సంక్షేమం ప్రస్తావన వచ్చినపుడల్లా ఈ నియమం తలకిందులౌతున్నది. రాజ్యాంగ పరిధిలో ముస్లింల సంక్షేమాన్ని సాధించడం ఎట్లా అనేది ఇప్పుడు మన ముందున్న సమస్య.

దేశంలో ఇతర ఏ సామాజిక సమూహాలతో పోల్చినా, ముస్లింలు సామాజిక విద్యా, ఆర్థిక రంగాల్లో వెనుకబడి ఉన్నారని అందరూ అంగీకరిస్తారు. ప్రత్యేకంగా భారత ముస్లింల స్థితిగతుల్ని అధ్యయనం చేయడానికి నియమించిన నాటి గోపాల్‌సింగ్ కమిటీ నుండి నేటి వరకు మినహాయింపు లేకుండా, అన్ని కమిటీలు మళ్ళీ మళ్ళ కనుగొంటున్నది ఈ సత్యాన్నే. అంతేకాదు, ఇతర వెనుకబడిన వర్గాల (ఓబీసీ) జాబితాను సిద్ధం చేయడానికి వివిధ సందర్భాలలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నియమించిన కాకా కలేల్కర్ కమిటీ, బి.పి. మండల్ కమిటీ, పుటుస్వామి కమిటీ మొదలైనవన్నీ నిర్ధారించింది కూడా ఈ సత్యాన్నే.

రోగాన్ని నిర్ధారించిన తరువాత వైద్యాన్ని ఆరంభించడమే గాక, రోగ నివారణకూ చర్యలు తీసుకోవాలి. అదేం దురదృష్టమో గానీ, ముస్లింలకు విద్యా, ఉపాధి రంగాలలో రిజర్వేషన్లు అనే ప్రస్తావన రాగానే, మహాపాతకం ఏదో జరిగిపోయినట్టు కొన్ని సంస్థలు గగ్గోలు పెడుతుంటాయి. సచార్ కమిటీ నియామకం జరిగిన తరువాత భారత

---

రుపాయలతో 'జాతీయవక్ఫ్' అభివృద్ధి సంస్థను ఏర్పాటు చేయాలని, వక్ఫ్ వ్యవహారాలను చూసేందుకు ప్రత్యేక క్యాడర్‌ను నియమించాలని కమిటీ వెల్లడించింది. ప్రాధాన్యతా క్రమంలో నామమాత్రపు రుసుముతో ముస్లిం విద్యార్థులకు హాస్టల్ వసతి సదుపాయాలను, కల్పించాలని, ముస్లిం జనాభా అధికంగా ఉన్న ప్రాంతాలలో మాతృభాషలో విద్యా బోధనకు వీలైనన్ని ఉర్దూ పాఠశాలలను నెలకొల్పాలని సూచించింది. ఉద్యోగ నియామకాలకు ఏర్పరిచే ఇంటర్వ్యూ బోర్డులు, ప్యానల్స్‌లలో ఎస్సీలకు ఎలాంటి స్థానం కల్పిస్తున్నారో, అలాగే ముస్లింలకు చోటు కల్పించాలని సూచించింది. 15 సూత్రాల కార్యక్రమంలో ఉద్యోగ నియామకాల భర్తీకై ఏర్పాటు చేసే కమిటీల్లో ఒక మైనార్టీ సభ్యుడ్ని నియమించాలనే నిబంధన ఉన్నప్పటికినీ, ఆచరణలో అమలుకు నోచుకోవడం లేదని స్పష్టం చేసింది. చాలా బ్యాంకులు ముస్లిం నివాస ప్రాంతాలను 'వ్యతిరేక భౌగోళిక జోన్లు''గా పరిగణించి, వారికి రుణ సదుపాయాలను కల్పించడం లేదని ఇందుకు భిన్నంగా వారికి రుణ సదుపాయాన్ని, ఇతర వసతుల కల్పనకు బ్యాంకులు ఆర్థిక సంస్థలు ముందుకు రావాలని సూచించింది.

ఎన్నో వ్యయప్రయాసలకు ఒర్చి రూపొందించిన 400 పేజీల పై చిలుకు ఈ నివేదిక ఇలాంటివే మరెన్నో సూచనలు చేసింది. వాస్తవ పరిస్థితులను వెల్లడించింది. ఇక మిగిలింది సచార్ కమిటీ చేసిన సూచనలు అమలులోకి రావడమే. గతంలో డా. గోపాల్‌సింగ్ కమిటీ నివేదికను భద్రంగా అటకెక్కించిన ఘనత మన పాలకవర్గాలకుంది. అదే పరిస్థితి ఈ సచార్ కమిటీ నివేదికకు దాపురిస్తే, అంతా వృథా ప్రయాసే అవుతుంది. అమలుకు నోచుకోని నివేదికలు, సూచనలు, బీరువాల్లో మూలగడం తప్ప, బాధితులకు ప్రయోజనాలను చేకూర్చవని పాలకులు గుర్తించాలి.

"పూర్వపు కమిటీలు సమర్పించిన అనేక నివేదికలను అమలులోకి తేకపోవడం వల్ల ముస్లింలు నిరాశకు గురి అవుతూ, దారిమళ్ళుతున్నారని, దరఖాస్తులు సమర్పించి... సమర్పించి అలసిపోయిన ముస్లింలు ఫలితాలను కోరుతున్నారని, వీరి గురించి పాలకులు ఆలోచించాల్సిన అవసరం ఉంది" అని సచార్ కమిటీ స్పష్టం చేసింది. ముస్లింల పట్ల ప్రదర్శించే వివక్ష, అసమానతలు, వారిలో తమ అస్థిత్వం పట్ల అనుమానాలను రేకెత్తిస్తున్నాయని, ఈ పరిస్థితుల్లో మార్పుకు ప్రభుత్వాలు కృషిచేయాలని డా. గోపాల్‌సింగ్ కమిటీ చెప్పిన విషయాలనే, సచార్ కమిటీ సైతం మరోమారు స్పష్టం చేయడంతో పాలకులు ముస్లింల పట్ల ఎంత నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారో మరోమారు వెల్లడయింది.

సచార్ కమిటీ తన నివేదికను సమర్పించిన తర్వాత, ఫిబ్రవరి నుండి కమిటీ చేసిన సూచనలను అమలు చేస్తామనే హామీనిచ్చిన ప్రభుత్వం, ఈ అంశాల పరిశీలనకు ఒక ఉపసంఘాన్ని నియమించింది. ఈ ఉపసంఘం, ముస్లింల విద్యాభివృద్ధి కోసం 5,460 కోట్ల రుపాయలను కేటాయించాలని ప్రణాళిక సంఘాన్ని కోరింది.

అయితే ముస్లింలు తమ సంక్షేమం కోసం, తమ వెనుకబాటుతనం పోగొట్టుకోవడం కోసం, ప్రభుత్వం నియమించే కమిటీలు, అవి ఇచ్చే నివేదికలు సూచనలపై ఆధారపడితే సరిపోదు. పాలకులు ఎవ్వరైనా సరే, ఓటింగ్ రాజకీయాలకు పాల్పడి క్రియలకు పూనుకుంటుంటాయి. ముస్లింల విషయంలో పాలకులది గతం నుండి ఇదే ధోరణి. అందువల్ల ముస్లింలు తమ సమస్యల కోసం, హక్కుల కోసం తామే సంఘటితంగా ఉద్యమించాలి. కానీ, దురదృష్టవశాత్తు ముస్లింలలో అదే లోపించింది. కనీసం మిగితా వర్గాల వారికన్నా తాము వెనుకబడి ఉన్నామన్న స్పృహ సైతం ముస్లింలలో కన్పించడం లేదు. ఇప్పుడున్నట్లు ఉంటే చాలు, ఇంకేం అక్కర్లేదు అనే ధోరణి వారిలో బలంగా నాటుకొనిపోయింది. ఈ బలహీనతలను గుర్తించిన రాజకీయపక్షాలు ముస్లింలతో చెలగాటం ఆడుతున్నాయి. మసీదులు మదర్సాలు, షాదీఖానాలు, ఖబరస్థానాలంటూ వారి అసలు సమస్యల జోలికి పోకుండా వారిని ఎప్పుడూ లఎమోషనల్ బ్లాక్‌మెయిలింగ్‌కు గురి చేస్తున్నాయి. ఇప్పటికైనా ముస్లింలు ఈ మాయలో నుండి బయటపడాలి. అందుకు ప్రతి ఒక్కరూ తమ వంతు ప్రయత్నాలు కొనసాగించాలి. ◆

రాజకీయాల్లో చోటుచేసుకుంటున్న పరిణామాలే దీనికి కొత్త ఉదాహరణ.

సామాజిక, ఆర్థిక, విద్యా రంగాలలో ముస్లింల స్థితిగతులపై సాధికారిక నివేదికను రూపొందించడానికి ప్రధాని మన్మోహన్ సింగ్ 2005 మార్చి 5న ఏడుగురు సభ్యులతో కూడిన ఒక ఉన్నత స్థాయి సంఘాన్ని నియమించారు. ఢిల్లీ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి రాజిందర్ సచార్ ఈ కమిటీకి అధ్యక్షులు.

సచార్ కమిటీ నియామకం జరిగిన మరుక్షణం నుండే సంఘ్ పరివారం దానిపై యుద్ధాన్ని ప్రకటించింది. ముస్లింలపట్ల, ప్రభుత్వాలు, సానుకూలతను ప్రదర్శించినప్పుడల్లా ప్రధాని పీఠం తనకు దగ్గరైపోతుందని గట్టిగా నమ్మే ఎల్.కె. అద్వానీ, సచార్ కమిటీకి వ్యతిరేకంగా భారత్ సురక్షా యాత్రనే ఆరంభించారు. మత ప్రాతిపదికన రిజర్వేషన్లు కల్పించడం, భారత రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకమని దేశమంతా ప్రచారం చేశారు. కాంగ్రెస్ ఆలోచనా ధోరణి దేశ సమగ్రతకు ముప్పు తెస్తుందన్నారు. మరోసారి దేశాన్ని విభజించే విధానాలకు కాంగ్రెస్ పాల్పడుతోందన్నారు. అధికారాన్ని నిలబెట్టుకోవడానికి, ముస్లింలకు పూర్తిగా లొంగిపోయిన కాంగ్రెస్ నేతలు ముస్లిం సంతుష్టీకరణ విధానాలని అవలంభిస్తున్నారన్నారు. సర్దార్ పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ మొదలుకుని అంబేద్కర్ వరకు, భారత రాజ్యాంగం మొదలుకుని ఉన్న న్యాయస్థానాల వరకు ముస్లింల రిజర్వేషన్లకు వ్యతిరేకమని విడమర్చి మరీ చెప్పారు. (అద్వానీ నాగపూర్ ప్రసంగం, 21 ఏప్రిల్, 2006).

అంబేద్కర్, భారత రాజ్యాంగం వంటి వివాదాలకు ముస్లింలకు తక్షణం స్పందించకపోయినా ఇప్పటికిప్పుడు వచ్చే నష్టమేమీలేదు. గానీ, దేశ సమగ్రతవంటి సున్నితమైన అంశాలపై సంఘ్ పరివారం వివాదాన్ని రెచ్చగొట్టినప్పుడు మాత్రం ముస్లింలు తక్షణమే స్పందించాల్సి ఉంటుంది.

సమాజ విచ్ఛిత్తి, దేశవిచ్ఛిత్తి వంటి భయాందోళనల్ని ప్రచారం చేయడం సంఘ్ పరివారానికి, కొత్త ఎత్తుగడేమీ కాదు, ఈ ప్రచారాన్ని, ముస్లింలకు వ్యతిరేకంగా మాత్రమే సంఘ్ పరివారం ప్రయోగిస్తున్నదనుకున్నా పొరపాటే. స్వాతంత్రం వచ్చిన కొత్తలో, అణగారిన కులాలకు వ్యతిరేకంగా, పెత్తందారీ కులాలు, ఇలాంటి భయాందోళనల్నే పెద్ద ఎత్తున ప్రచారం పెట్టలియి. ఇలాంటి దుష్ప్రచారాల్ని పెరియార్ ఆత్మగౌరవ ఉద్యమం సమర్ధంగా తిప్పికొట్టింది. అణగారిన కులాలకు ప్రత్యే రక్షణ లేనపుడు, ద్రావిడ ప్రాంతం, ఇండియన్ యూనియన్ లో ఎందుకు కలిసి ఉండాలని ఘాటుగానే ప్రశ్నించింది. కుల-వర్ణ వ్యవస్థను బలపరుస్తున్నాయంటూ, 1957 నవంబర్ 26వ, భారత రాజ్యాంగ అధికరణాలను తగలబెట్టింది. కేంద్ర ప్రభుత్వం, పెత్తందారీ కులాలను ప్రోత్సహిస్తున్నదంటు, 1960 జూన్‌లో, వేలాదిమంది ద్రవిడ కజగం కార్యకర్తలు, నడిరోడ్లమీద ఇండియన్ యూనియన్ మ్యాపుల్ని తగలబెట్టారు. (www.tamilnation.org)

అణగారిన వర్గాలకు ప్రత్యేక రక్షణ కల్పిస్తే, సామాజిక శాంతి నెలకుంటుంది. పాలక వర్గాలకూ, పాలిత వర్గాలకూ మధ్య ఘర్షణ తగ్గుతుంది. సహజ వనరుల్లో, సామాజిక వ్యవస్థలో, ముస్లింలకు న్యాయమైన ప్రాతినిధ్యం కల్పిస్తే ప్రభుత్వం పట్ల, ప్రజాస్వామిక వ్యవస్థ పట్ల, భారతరాజ్యాంగం పట్ల మరీ ముఖ్యంగా సాటి హిందూవులపట్ల, ముస్లింలకు నమ్మకం-విశ్వాసం పెరుగుతుందేగానీ, తగ్గదు. సామాజిక న్యాయాన్ని ఆచరిస్తే భిన్న సామాజిక సమూహాల మధ్య విశ్వాసం పెరిగి, దేశ సమగ్రత మరింతగా బలపడుతుంది. నిజానికి, సమాజంలో వెనుకబడిన సమూహాల్ని పట్టించుకోనపుడే దేశ సమగ్రతకు ముప్పు వచ్చే అవకాశం ఉంటుంది. సామాజిక వాస్తవాలను తలకిందులుగా చిత్రించి, సెంటిమెంటల్ బ్లాక్-మెయిలింగ్ చేయడం, సంఘ్ పరివారానికి కాషాయంతో పెట్టిన విద్య.

షెడ్యూలు తెగలు, షెడ్యూలు కులాలు, ఇతర వెనుకబడిన తరగతులకు మాత్రమే రిజర్వేషన్లు పొందే అవకాశాన్ని భారత రాజ్యాంగం కల్పిస్తోంది.

అందుచేత, సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన ఏదైనా ఒక సామాజిక సమూహానికి సంక్షేమాన్ని తలపెట్టదలిస్తే, ముందుగా ఆ సమూహాన్ని ఈ మూడింటిలో ఏదో ఒక వర్గంగా ప్రకటించాల్సి ఉంటుంది. అంతవరకూ బాగానే ఉందిగానీ, యస్సీ, యస్టీ, ఓబీసీ అనే సామాజిక వర్గీకరణ, గతితప్పి, ధార్మిక వర్గీకరణగా రూఢి అయిపోవడంతో కొత్త వివాదాలు తలెత్తుతున్నాయి. ఓబీసిలో "సి" అనేది 'కులం' కాదనీ, సామాజిక 'తరగతి' అని గుర్తించడానికి ఇప్పుడు చాలామంతి నిరాకరిస్తున్నారు. హిందూ మతానికి ప్రత్యేక లక్షణమైన కూలాన్ని, ఇప్పుడు ఉపఖండంలోని ఇతర మతాలకూ అనివార్యంగా వర్తింపచేయాల్సి వస్తున్నది.

సామాజిక వెనుకబాటుతనాన్ని ఆర్థిక వెనుకబాటుతనంతో ముడిపెట్టరాదనే వాదన కూడా బలందీ వినిపిస్తున్నది. రిజర్వేషన్ వెసులుబాటి అనేది కులాలకు మాత్రమే పరిమితమైన ప్రత్యేక హక్కు అని పలు రాజకీయ పార్టీలు, అనేక సాంఘిక సంస్థలు భావిస్తున్నాయి. కొందరు ఇంకొంత ముందుకు వెళ్లి, హిందూ కులాలకు మాత్రమే పరిమితమైన ప్రత్యేక హక్కు అని కూడా వాదిస్తున్నాయి. న్యాయస్థానాలు కూడా దీనికి మినహాయింపు కాదు. ముస్లింలకు ఐదు శాతం రిజర్వేషన్ ఇస్తూ వై.ఎస్. రాజశేఖర రెడ్డి ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వు న్యాయస్థానాల్లో ఎదుర్కొంటున్న ఇబ్బందులే దీనికి తాజా ఉదాహరణ. సామాజిక న్యాయాన్ని అందించడంలో రాజ్యాంగమే ఓడిపోయిందో, అధికార రాజకీయాలే రాజ్యాంగాన్ని ఓడించాయో తేల్చుకోవాల్సిన సమయం ఇది.

అధికార రాజకీయాలను, ముస్లిం ఆలోచనాపరులు, రెండు స్రవంతులుగా వర్గీకరిస్తారు. మొదటిది; ముస్లింలను ఊరించే రాజకీయం, రెండేది; ముస్లిం వ్యతిరేక రాజకీయం. నిజాయితీగా ముస్లింల సంక్షేమాన్ని కోరే పార్టీ స్వతంత్ర భారత దేశంలో ఇంతవరకు పుట్టలేదు. కనుచూపుమేరలో కనిపించడమూ లేదు. అయితే, కొత్త ప్రభుత్వాలు ఏర్పడ్డపుడు, కొత్త కమీషన్లను వేసినప్పుడూ ముస్లిం సమాజంలో సహజంగానే ఒక ఆశ చిగురించడమూ, దాన్ని వెన్నంటే ఒక అనుమానం ఆవరించడమూ కొత్తేమీ కాదు. సచార్ కమిటీ కూడా అలాంటి ఆశల్నీ, అనుమానాల్నీ రేకెత్తించింది.

సచార్ కమిటీ సిఫార్సులు ఏమిటీ? దానిపై యూపిఎ ప్రభుత్వ స్పందన ఎలా ఉంటుంది? ముస్లింలకు రిజర్వేషన్లను ప్రకటిస్తారా? ప్రకటిస్తే ఎంత శాతం? రిజర్వేషన్లు యాభై శాతం దాటేస్తే న్యాయపరమైన ఇబ్బందులు రావా? తొమ్మిదవ షెడ్యూలును ప్రయోగిస్తారా? సుప్రీం

కోర్టు ఊరుకుంటుందా? పబ్లిక్ రంగం రోజురోజుకూ బలహీనపడిపోయి, ప్రైవేట్ రంగం వటవృక్షంలా బలపడిపోతున్నప్పుడు ముస్లింలకు రిజర్వేషన్ ఇచ్చినా ప్రయోజనమేమిటి? ప్రైవేట్ రంగంలోనూ ముస్లింలను ప్రోత్సహిస్తారా? ఆర్థిక సంస్థల్లో ముస్లింల పరపతిని పెంచుతారా? మొదలైన అంశాలపై దేశవ్యాప్తంగా ఆసక్తికరమైన చర్చ సాగుతోంది.

ప్రభుత్వం తీసుకోబోయే నిర్ణయాలతో ముస్లింలకు ఒనగూడే భౌతిక ప్రయోజనాల సంగతి ఎలా ఉన్నా, సచార్ కమిటీ నివేదిక ముస్లింలకు నైతికంగా గొప్ప మేలు చేసిందనే చెప్పాలి. 'ముస్లిం సంతుష్టీకరణ' అనే మిథ్యను సచార్ కమిటీ నివేదిక పటాపంచలు చేసింది. కాంగ్రెస్, వామపక్షాల కూటమి దేశాన్ని కొల్లగొట్టి ముస్లింలకు కట్టబెడుతున్నాయని సంఘ్ పరివారం చేస్తున్న ప్రచారంలో వీసమెత్తు వాస్తవం కూడా లేదని సచార్ కమిటీ స్పష్టం చేసింది. హిందూ ఓబిసిల కన్నా భారత ముస్లింలు సామాజికంగా, ఆర్థికంగా మరింతగా వెనుకబడి ఉన్నారని ఈ కమిటీ మరోసారి నిర్ధారించింది. స్థూలంగా హిందూ యస్సీ, యస్టీలకన్నా ముస్లింల ఆర్థిక పరిస్థితి కొంచెం మెరుగ్గా ఉన్నప్పటికీ అనేక రంగాల్లో ముస్లింల ప్రాతినిథ్యం రోజురోజుకూ అంతరించి పోతున్నదని హెచ్చరించింది. దేశాన్ని తమ జనాభాతో నింపేయడానికి ముస్లింలు పిల్లల్ని కనడం తప్ప మరో పని పెట్టుకోరని సంఘ్ పరివారం చేస్తున్న ప్రచారం కూడా శుద్ధ అబద్ధమని తేల్చింది. దేశంలో ముస్లిం జనాభా పెరుగుదల రేటు గణనీయగా తగ్గుముఖం పట్టిందని నేషనల్ శ్యాంపిల్ సర్వే ఆర్గనైజేషన్ గణాంకాల సాక్ష్యంగా వివరించింది. మరో విధంగా చెప్పాలంటే, ఇప్పటి వరకూ ముస్లిం సమాజం తన స్థితిగతుల గురించి విలపిస్తున్నదాన్నే, సచార్ కమిటీ నిర్ధారించింది. జస్టిస్ రాజిందర్ సచార్ హై-లెవల్ కమిటీ వల్ల ముస్లిం సమాజానికి దక్కిన తక్షణ ప్రయోజనం ఇదొక్కటే.

సచార్ కమిటీ టెర్మ్స్ ఆఫ్ రిఫరెన్స్‌లో కీలకమైన మరో అంశం భారత ముస్లిం సమాజంలోని ఓబిసిలకు సంబంధించింది. ముస్లిం ఓబిసిల స్థితిగతులపై ఒక సంపూర్ణ నివేదికను సమర్పించడానికి కమిటీ ప్రయత్నించింది.

ధార్మిక అర్థంలో 'ముస్లిం కులాలు' అనేది ఒక దుశ్శమాసం. మనుషుల్ని అసమానులుగా తానే సృష్టించానని స్వయంగా దేవుడే చెప్పాడనే మతాలున్నాయి. దేవుని ముందు మనుషులందరూ సమానులనే మతాలు ఉన్నాయి. దేవుని ముందేకాదు, సమాజంలో ప్రతి వ్యక్తి మరొకనికి సమానుడేనని ఇస్లాం అంటుంది. సమాజంలోని సభ్యుల వ్యక్తిగత ధార్మిక స్థాయిని నిర్ధారించడానికి ఇస్లాంలో ఒకే ఒక కొలమానం ఉంది. అది ధార్మి ఆచరణ.

ఇస్లాం ఒక బహిరంగ మతం. దానికి సరిహద్దులూ, గోడలూ వగైరాలు లేవు. ఎవరైనా, ఎప్పుడైనా, ఇస్లాంను స్వీకరించి, ముస్లిం సమాజంలోనికి ప్రవేశించవచ్చు. ఎవరైనా, ఎప్పుడైనా, ఇస్లాంను త్యజించి ముస్లిం సమాజం నుండి బయటికి వచ్చేయవచ్చు. సంఘ్ సభ్యుల విషయంలో ముస్లిం సమాజానిది తెరిచిన తలుపుల విధానం. మనుషులు వస్తుంటారు, పోతుంటారు అనే ధర&ం ముస్లిం సమాజానికి సరిగ్గా సరిపోతుంది. ముస్లిం సమాజంలో పుట్టుక అనేది ప్రామాణికం కానేకాదు, దానికి ఆచరణే ప్రామాణికం. పాకిస్తాన్ జాతిపిత మహమ్మద్ ఆలీ జిన్నా, జాతీయకవి అల్లామా ఇక్బాల్ తో సహా, చరిత్రలో ప్రముఖ ముస్లింలుగా నిలిచిపోయిన పలువురి పూర్వీకులు తమ సమీప గతంలోనే ఇస్లాంను స్వీకరించినవారు అనంటే చాలా మందికి నమ్మశక్యంగా ఉండకపోవచ్చు, కానీ, ఇది వాస్తవం.

ముస్లిం సమాజంలో మతపరంగా గాక, మతేతర కారణాలవల్ల, ఆచరణల ఆధారంగా భిన్న సమూహాలు అనేకం ఏర్పడ్డాయి. అయితే వీటిని వర్ణాలుగానో, కులాలుగానో భావించడం అవగాహనలోపమే. వర్ణానికీ, కులానికీ మతపరమైన ప్రతిపత్తి ఉంటుంది. ముస్లిం సమాజంలోని వర్గీకరణకు మత ప్రతిపత్తి లేదు. అది అచ్చంగా లౌకిక పరమైనది.

బహిరంగ మతాలకు సంబంధించి ఇంటాబయటా కూడా అనేక తరగతులుంటాయి. ముస్లిం సమాజంలో, ముస్లిం ధర్మాలను పాటిస్తున్నవారూ, పాటించకుండ బయటికి పోతున్నవారూ ఉన్నట్టే, ముస్లిం సమాజాన్ని ద్వేషిస్తున్న వాళ్లూ ఉంటారు. ఈ నాలుగు తరగతుల్లో, మళ్లీ అనేక ఉప తరగతులుంటాయి అన్నింటికన్నా, విటిల్లో మూడవ తరగతి స్థానాన్ని నిర్ణయించడం కష్టసాధ్యమైన పనే. ఈ తరగతి వాలు ముస్లిం సమాజంవైపు ఉందా? ముస్లిమేతర సమాజం వైపు ఉందా? అనే అంశంపైనే ముస్లిం సమాజంలో, అంతస్తులు ఏర్పడుతుంటాయి. వాళ్లు ముస్లిమేతరుల వైపు ఉంటే, అది వారి ఇష్టం, దానికి ముస్లిం సమాజం చెయ్యగలిగింది కూడా ఏమీ ఉండదు. వాళ్లు, ఒకవేళ ముస్లింల వైపు ఉంటే, వాళ్లను ముస్లిం సమాజం అక్కువ చేర్చుకుంటుంది, ఇస్లామీకరణ అంటే ఇదే.

బహిరంగ మతంలో వచ్చేపోయే అలల నిరంతర ప్రక్రియ సాగుతుంటుంది. ఆమేరకు తాత్కాలిక సామాజిక అంతస్తులు ఏర్పడి, అంతరిస్తుంటాయి. చారిత్రక కారణాల వల్లనో, రాజకీయ కారణాల వల్లనో, ప్రాంతీయ కారణాలవల్లనో, ఏదైనా ఒక దశలో, ఇలాంటి ప్రక్రియ స్థంభించిపోతే, అప్పటి అంతస్తులు కులాలుగా స్థిరపడడాన్ని ఇప్పుడు మనం భారత ముస్లిం సమాజంలో చూస్తున్నాం.

పాక్షికంగానో, సంపూర్ణంగానో ఇస్లాంను ఆచరిస్తున్న 133 సామాజిక సమూహాలని 1901 నాటి సెన్సెస్ గుర్తించింది. వీటిల్లో 82 సమూహాలను వృత్తి ఆధారిత కులాలుగా బి.సి. మండల్ కమిషన్ గుర్తించి, ఓబిసిలుగా ప్రకటినిచింది. ఎన్.ఎస్.ఎస్.ఓ సరికొత్త నివేదిక ప్రకారం భారత దేశం మొత్తం ఓబిలిల్లో ముస్లిం ఓబిసిలు 15.7 శాతం ఉన్నారని అంచనావేసింది.

భారత ముస్లిం సమాజాన్ని, సచార్ కమిటీ, అష్రాఫ్ (యూ.సి), అజ్లాఫ్ (ఓబిసి), అర్జాల్ (ఎస్.సి) అనే మూడు అంతస్తులుగా వర్గీకరించింది. భారత ముస్లింలు మొత్తంగా ఇతర మతాల ఓబిసిల కన్నా అన్ని రంగాలలో వెనుకబడి ఉంటే, భారత ముస్లింలలో ముస్లిం ఓబిసిలు మరింత వెనుకబడి ఉన్నారని కమిటీ వివరించింది. ముస్లింలలోని మూడు వర్గాలూ దయనీయ స్థితిలో ఉన్నాయి కాబట్టి, మూడు వర్గాలకూ మూడురకాల ప్రత్యేక సంక్షేమ కార్యక్రమాల్ని చేపట్టాల్సిన అవసరాన్ని సచార్ కమిటీ నొక్కి చెప్పింది.

వర్గీకరణ పూర్తయిపోయింది కాబట్టి, ముస్లింలకు చట్టపరిధిలో రిజర్వేషన్లు ఎలా సాధించాలనేది ఇప్పుడు మన ముందున్న సమస్య. ◆

# ‘ఓగ్నితో - నీటమునిగిన చేనేత మగ్గం’

– పులుగుజ్జు సురేష్

ఆంధ్రప్రదేశ్‌కి చాలా పెద్ద వరద చరిత్ర ఉంది. గత శతాబ్ద (1892 – 1997) కాలంలో 71 వరదలు / తుఫానులు సంభవించాయి. ఈ రాష్ట్రంలో 2.75 లక్షల చ.కి.మీ. భూభాగం ఉంది. 7.5 కోట్ల జనాబా ఉంది. ఆంధ్రభూభాగంలో 44 శాతం తీరప్రాంతం ఉంది. రాష్ట్రంలో నెల్లూరు నుండి శ్రీకాకుళం వరకు గల కోస్తాఆంధ్ర జిల్లాలు ఉన్నాయి.

భారతదేశంలో 7,516.6 చ.కి.మీ. తీరప్రాంతంలో మన రాష్ట్రంలో 1,030 చ.కి.మీ. తీరం ఉంది. 1980 జనాభా లెక్కల ప్రకారం తొమ్మిది కోస్తా జిల్లాలో 9.29 లక్షల చ.కి.మీ. భూభాగం ఉంది. సముద్రతీరానికి అత్యంత సమీపంలో 2,482 గ్రామాలు ఉన్నాయి. ఈ గ్రామాలలో 54.33 లక్షల జనాభా (1980 జనాభా లెక్కల ప్రకారం)

తుఫానుల లేదా వరదలు సంభవించినపుడు ప్రాణనష్టం, పంటలకు పెద్దఎత్తున నష్టం జరుగుతుంది. పశువులు, జంతు సంపదకు నష్టం బాగా జరుగుతుంది. ప్రజా జీవనం స్థంభిస్తుంది. వరద తీవ్రతను బట్టి ఇల్లు కూలడం, లేదా నేలమట్టమవడం, రోడ్లు, కాలువలు తెగుతాయి. వంతెనలు కూలిపోతాయి. సేవారంగం కూడా దెబ్బతింటుంది. టెలిఫోన్‌లు, విద్యుత్తు అంతరాయం జరుగుతుంది. పల్లెలు జన జీవనం చీకటిమయమవుతుంది.

ఆంధ్రరాష్ట్రంలో 1977, 1990, 1996, 1997, 2004, 2005, 2006 సంవత్సరాలలో వచ్చిన వరదలు పెద్దవి. ఉదాహరణకు 1977 సంవత్సరంలో వచ్చిన ‘ఉప్పెన’ ప్రపంచ దేశాలను రాష్ట్రంవైపు చూసేలా చేసింది. ఈ తుఫాను తాకిడికి 70.10 లక్షల మంది గురయ్యారు. 8000 వేల మరణాలు జరిగాయి. 76.5 లక్షల ఎకరాలలో పంటనష్టం జరిగింది. 10.10 లక్షల ఇల్లు దెబ్బతిన్నాయి. 1,716 కోట్ల రుపాయల మేరనష్టం జరిగినట్లు అంచనాలు ఉన్నాయి.

తుఫానులు రాష్ట్రానికి తరచూ వస్తూ ఉంటాయి. ఈ తుఫానులు ప్రతి ఏడాది వస్తూనే ఉంటాయి. సహజవనరుల నాశనం జరిగేకొద్దీ ప్రకృతి వైపరీత్యాలు వీరంగమాడుతాయని పర్యావరణ వేత్తలు నొక్కి వక్కాణిస్తున్నారు. అయితే ‘బహుళజాతి’ కంపెనీలు పెరిగేకొద్ది సహజ వనరుల నాశనం పెద్ద ఎత్తున ఉంటుంది. రాబోయే రోజుల్లో, తుఫానులు, వరదలు, భూకంపాలు పెరుగుతాయనడంలో ఆశ్చర్యం లేదు.

వరదల ప్రభావం ఎవరి మీద పడుతుంది? తుఫాను తాకిడికి గురవుతున్నదెవరు? ఏ వర్గాలు నష్టపోతున్నాయి? వంటి అంశాలను పరిశీలించాలి. తుఫాను లేదా వరదలు వచ్చినపుడు నష్టపోతున్న వర్గం ఒకవైపు ఉంటే, లాభపడే వర్గాలు మరొకవైపు ఉన్నాయి. 1977 ఉప్పెనకు శవాలను గుట్టలుపోసి తగులబెట్టిన సందర్భాలు ఉన్నాయి. ఈ బీభత్స వలన ప్రబలిన అంటురోగాల పరిస్థితి చెప్పనవసరం లేదు. ప్రకృతివైపరీత్యాలు చెప్పిరావు. వీటి బారినుండి తప్పించుకోవడానికి, ముందు జాగ్రత్త చర్యలు తీసుకున్నట్లయితే ప్రాణ, ఆస్తి నష్టాలు జరగకుండా కొంతవరకు నివారించవచ్చు. (డిసాస్టర్ ప్రిపేర్డ్‌నెస్) దీనికిగాను ప్రభుత్వ నిధితోపాటు, ప్రపంచబ్యాంకు నిధులు కూడా సమకూరుతున్నాయి. వేలాదికోట్ల రుపాయలు ఖర్చవుతుంది. ఈ డబ్బు దేనికొరకు ఖర్చు చేయబడుతుంది. సహజంగా ప్రజల జీవన ప్రమాణాల పురుద్ధరణకు ఖర్చు చేయబడుతుందని అనుకుంటాం. కానీ ఇదెంత వాస్తవమో చూస్తే విడ్డురంగా ఉంటుంది.

ఈ మధ్య వరుస తుఫానులతో రాష్ట్ర ప్రజానీకం భయాందోళనలతో ఉంది. వారి జీవితంలో నైరాశ్యం అలముకొంది. వరుసగా సంభవిస్తున్న వరదలకు తేరుకోలేకపోతున్నారు. అక్టోబరు చివరివారంలో, నవంబర్ మొదటివారంలో వచ్చిన ‘ఓగ్ని’ తుఫాను లోతట్టు ప్రాంతాలైన ప్రకాశం, నెల్లూరు, ఉభయ గోదావరి జిల్లాలతోపాటు శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలో కూడా అంచనాలకు కనపడని నష్టం జరిగింది.

‘ఓగ్ని’ వరదలను పరిశీలిస్తే ప్రకాశం, కృష్ణా, గుంటూరు జిల్లాలలో అనేక గ్రామాలు నీటమునిగాయి. పదిహేను రోజులకు పైగా నీటిలో ఉన్న గ్రామాలు వందల సంఖ్యలో ఉన్నాయి. నీట మునుగుతున్న గ్రామాలలో ప్రధానంగా దళితవాడలు, వెనుకబడిన కులాల నివాసాలు, చెరువుగట్లు, కాలువ కింద గ్రామాలు రాజకీయ నాయకుల పలుకుబడి కోసం ఏర్పాటు చేసే గ్రామాలు ముఖ్యమైనవి. ప్రకృతికి కోపం వస్తే ఆ శాపం అనుభవించాల్సింది పేదలే. ఎందుకంటే వీరి నివాసాలు పల్లపు ప్రాంతాలలో ఉన్నాయి. ఇంటి గుమ్మానికి మూరెడు ఎత్తులో సిమెంట్ రోడ్ల నిర్మాణం జరిగింది. సిమెంట్ రోడ్లు తెచ్చినముప్పు అంతా ఇంతా కాదు రోడ్డుమీద పడిన నీళ్లన్నీ ఇళ్లల్లో ఉన్నాయి. కాంట్రాక్టర్లు లాభాలకోసం వేసిన సిమెంట్ రోడ్ల కిరువైపుల మురుగుకాలువలు ఏర్పాటు చేయలేదు. గ్రామంలోని అంతర్గత రోడ్లు ఇంటి గుమ్మానికి కింది ఉండాలి. కానీ గుమ్మానికి మూరెడు ఎత్తు ఉండడం వలన ఏ చిన్నపాటి వర్షం కురిసినా గ్రామాలు నీటిలో మునుగుతున్నాయి.

వరదనష్టానికి పరిహారం చూస్తే ప్రజలను పరిహాసమాడినట్టే ఉంటుంది. ఉదారహణకి “ఓగ్ని” వరదల వలన చేనేత రంగానికి జరిగన నష్టం ‘చిప్’ అంచనా ప్రకారం 70.86 కోట్లు కాగా ప్రభుత్వం వారి అంచనా కేవలం 13 కోట్ల రుపాయలు మాత్రమే. వీరి గణాంకాలు నవ్వు పుట్టిస్తాయి. జరిగిన నష్టం ఎంతో చెప్పడంతో తప్పేముంటుంది. అంచనాలు వేయడంలో శాస్త్రీయత మచ్చుకైనా కనబడటం లేదు. చేనేత రంగానికిచ్చిన, వరదలనష్ట పరిహారం మగ్గంకు వేయి రుపాయలు, నూలుకు వేయి రుపాయలు ఇదికూడా మగ్గం ప్రాతిపదికన కాకుండా కుటుంబాల వారిగా ప్రతిపాదించారు. ఇదేమి న్యాయం ఇవ్వాలటి లెక్కల ప్రకారం మగ్గం ఖరీదు కనీసం రు. 5,000 నుండి రు. 25,000 వరకు అవుతుంది. నూలు (ఒక పడుగు పేక, 6 చీరలకు) ఖరీదు

కనీసం రు. 1500 నుండి 10 వేల రుపాయల వరకు అవుతుంది. ఇతర ఖర్చులు, ఇవన్నీ లెక్కిస్తే కనీసం 10 వేల రుపాయలైన కావాలి. ప్రభుత్వం ప్రకటించిన పరిహారం ఏవిధంగాను సరికాదు.

అక్టోబర్ 4వ వారం నుండి ఎడతెరిపి లేకుండా కురుస్తున్న వర్షాలు కోస్తా ఆంధ్ర జిల్లాలను నీట ముంచింది. పంటపొలాలు, సముద్రం, ఏకమయ్యాయి. గత వందేళ్లలో ఇటువంటి పరిస్థితి చూడలేదని దెబ్బయేళ్లునిండిన ఎర్ర కోటమల్లయ్య ఆప్కో డైరక్టర్ కృష్ణ జిల్లావారు అన్నారు. ఆయన తన చిన్ననాటి జ్ఞాపకాలను గుర్తు చేసుకుంటూ ఈ విధంగా అన్నారు. గతంలో అనేక ఉప్పెనలు చూసాం కానీ ఇటువంటిదెప్పుడు లేదు. ఈ ఉప్పెనలలో చెప్పుకోదగింది 1977 ఉప్పెన, ఆ తరువాత 1995, 1997 సంవత్సరాలలో వచ్చిన తుఫానులు చెప్పుకోదగినవి. వీటి తరువాత 2004లో వచ్చిన సునామీ, గత ఆరునెలల క్రితం సేనపల్లిలంక దగ్గర గట్లు తెగిన గోదావరి వరద బీభత్సం ప్రధానమైనవి.

పైన తెలిపిన ఉప్పెనలు, వరదలు గాలి వానలతో కొంత విధ్వంసాన్ని సృష్టించిన మాట వాస్తవమే. ఈ బీభత్సానికి కరెంటు తీగలు తెగిపోవడం, రోడ్లు, చిన్న చిన్న చెరువుగట్లకు గండిపడడం, కొందరి జంతు, ప్రాణ నష్టం జరిగింది. అయితే ఇదంతా కేవలం రెండు, మూడు రోజులు లేదా ఒక వారం రోజుల్లో ముగిసేది. ఈ పరిస్థితుల్లో జరిగిన నష్టం బాహ్యంగా కనపడేది.

ఓగ్ని వలన చేనేతకు జరిగిన నష్టం

| | |
|---|---|
| మొత్తం నష్టపోయిన మగ్గాలు | 55,000 |
| మొత్తం పని దినాలు | 53,95,000 |
| మొత్తం నష్టం | 70.83 కోట్లు |
| మొత్తం ఉత్పత్తి | 39,60,000 మీ. |
| ఉత్పత్తి విలువ | 39.72 కోట్లు |
| స్థంభించిన మార్కెట్ విలువ | 61.28 కోట్లు |

మొన్నటి సునామీ, నిన్నటి గోదావరి, వరదల నుండి తేరుకోక ముందే ఇవ్వాల 'ఓగ్ని' తుఫాను కోస్తా ఆంధ్రను నీట ముంచింది. సముద్రాన్ని ఏకం చేసింది.

వరదలు వచ్చినప్పుడు సాధారణంగా రైతులు, పంట పొలాలు మునగడం బాహ్యంగా మనకు కనిపిస్తుంది. రైతులతో పాటు కనబడకుండా జరుగుతున్న నిశ్శబ్ద నష్టం చేతి వృత్తులకు జరుగుతున్నది. ఒక పేద కుటుంబానికి విడిచిన బట్టలు పోతే వాటిని సంపాదించడానికి కొన్ని నెలలు పడుతుంది. వేయి రుపాయలు నష్టమంటే లక్ష రుపాయలతో సమానం.

మూలుగే నక్కపై తాటికాయపడ్డట్టు సంక్షోభంలో ఉన్న చేనేత రంగానికి 'ఓగ్ని' తుఫాను పెద్ద నష్టాన్ని తెచ్చిపెట్టింది. కుటుంబమంతా నెలరోజులు కష్టపడితే ఆదాయం రెండు వేలకు మించదు, పెరుగుతున్న నిత్యావసర ధరలు, తగ్గుతున్న కూలీలు (మజూరీలు) పిడికెడు మెతుకులకు కూడా దొరకని పరిస్థితులుంటే, ఈ తుఫానుతో కార్మిక కుటుంబాలలో పిల్లలు, వృద్ధులు, ఇంటిల్లిపాది రోజుల తరబడి పస్తులుంటున్న పరిస్థితి దాపురించింది.

ఓగ్ని సృష్టించిన బీభత్సానికి ప్రకాశం గుంటూరు, కృష్ణ జిల్లాలు పూర్తిగా నీటమునిగాయి. నెల్లూరు, ఉభయ గోదావరి జిల్లాలు పాక్షికంగా దెబ్బతిన్నాయి. ఓగ్ని వరదతో పోల్చితే 'సునామి' కేవలం 10 శాతం కూడా ఉండదని బాధిత గ్రామాల ప్రజలు చెబుతున్నారు. వేలాదికోట్ల రుపాయల నష్టం ఇంతకుముందెన్నడూ జరగలేదని అనుభవజ్ఞుల అభిప్రాయం.

**గుంటమగ్గాలు**

ఇంటి నిర్మాణం చాలా చిన్నదిగా ఉండడంవలన గుంట మగ్గాలు ఏర్పడ్డాయి. నేతనేసే మనిషికి నడుములోతుగంట ఉంటంది. ఈ గుంటలో పావుచెక్కలు అమర్చబడి ఉంటాయి. గుంటపైన భాగాన పడుగు, మగ్గం ఉంటుంది. ఐదడుగుల కంటే ఎత్తులో దాబీ, జాకార్డులు అమర్చుతారు. నేతనేసే నేతకారులు సగం గుంటలో ఉంటారు. మగ్గం కిటికీకి సమాంతరంగా చాలా దగ్గరగా చెయ్యిచాపితే అందేటంత దగ్గరలో ఉంటుంది. ఎందుకంటే గాలి, వెలుతురు బాగా ఉండాలి. వెలుతురు ఉంటేనే నేతనేయడానికి పోగులు (దారం) కనబడుతుంది. వెలుతురు సహాయంతో తెగిన పోగులను అతికించడానికి సాధ్యమవుతుంది. ఇంటి నిర్మాణం, మగ్గం ఏర్పాటు శాస్త్రీయం జరుగుతుంది. వరదలు వచ్చినప్పుడు గాలితో వచ్చే వర్షం కిటికీ ద్వారా మగ్గం పైనున్న పడుగుపై పడుతుంది. రెండు మూడు రోజులు అదే విధంగా ఉన్నట్లయితే నూలు (పడుగు, దారం) తడవకుండా ఉండడానికి బట్ట కప్పడం జరుగుతుంది. దీనివలన నూలు (పడుగు) ను మగ్గంపై ఉంటినా, లేదా తీసి పక్కకు పెట్టినా తడివుండడం వలన ఫంగస్ వచ్చి, పడుగు మొత్తం బూజు పడుతుంది. పోగులు ముడిపడతాయి. గంజిపెట్టడం వలన రంగులు వెలసిపోతాయి. ఎలుకలు, పందికొక్కులు ఇంటిలో చేరి నూలును కొరకడం జరుగుతుంది. దీనివలన పడుగు పూర్తిగా పనికిరాకుండా పోతుంది. మగ్గానికి పన్నెలు సువ్వలు ఇనుపవి ఉపయోగించడం జరుగుతుంది. కావున వర్షపు నీళ్లుపడి, తడిచి తుప్పుపట్టి పనికి రాకుండా పోతుంది. పన్నెను దారాలతో అతుక్కొని ఉండే అచ్చుకూడా నిరుపయోగమవుతుంది. మగ్గం పరికరాలు, మగ్గం అమర్చడానికి ఉపయోగించే గుంజలు మొదలగు కట్టెతో చేసినవి భూములోకి పాతడం జరుగుతుంది. ఎక్కువ రోజులు బురద మట్టితో ఉండడం వలన సీకుబట్టండ, పుచ్చిపోవడం జరుగుతుంది. గుంట మనిషికి నడుముల లోతులో ఉంటుంది. భారీగా కురుస్తున్న వర్షాలకు భూమిలో కొట్టకుండానే పంపుల నుండి నీరు బయటకు రావడం జరుగుతుంది. అంటే భూమిలో నీరు ఊరుతుందని మనకందరికీ తెలిసిన సత్యం. మగ్గం గుంటల్లోకి కూడా నీరు ఊరుతుంది. గుంటలో నీరు ఎత్తిపోస్తే సరిపోతుంది కదా అనే ఆలోచన కూడా వస్తుంది. నీరు తోడుతున్నంతసేపు నీటి ఊట రెట్టింపవుతుంది. దీని వలన మగ్గం గుంటలో వారాల తరబడి నీరు తగ్గదు. అంతే కాకుండా మగ్గం గుంట గోడలు మట్టితో ఉంటాయి. కావున గోడలన్నీ ఊడిపడతాయి. ఈ మగ్గం గుంట ఇంట్లో చిన్న బావిలా తయారవుతుంది. ఈ విధంగా వరద ప్రభావం మగ్గం గుంటపై చాలా ఎక్కువగా ఉంటుంది. ఓగ్ని వరద గత పదిరోజులుగా ఉన్నది. కావున పదిరోజుల నుండి మగ్గం గుంటలో నీరు తగ్గలేదు. కొన్ని కాలనీలు నీటిలోనే ఉన్నాయి. చుట్టుపక్కల నీరు తగ్గితే తప్ప మగ్గం గుంటలో నీరు తగ్గదు.

**అన్నంలేదు నీళ్లులేవు (మహిళలకు)**

సుమారుగా 80 చేనేత గ్రామాలు నీటిలో మునిగి ఉన్నాయి. ఈ గ్రమాల్లోని మహిళలకు మూత్రము, మల విసర్జన సమస్య చాలా తీవ్రంగా ఎదుర్కోవల్సి వచ్చింది. గ్రామం నిండా నీరు ఉండడం, ఇంటి నిండా మనుషులు ఉన్నారు. దీని వలన మహిళలు నీళ్లు తాగడం, అన్నం తినడం మానుకున్నారు.

పుట్టల్లో ఉన్న పాములు, నీటిపాములు, చెరువులు, కాలువలు నదుల్లో ఉన్న పాములు స్వేచ్ఛగా సంచరించాయి. ఈ పాములు ఇళ్లలోకి కూడా చొరబడి మరుగున్న చోట మనుషులతో పాటు పాములు కూడా ఉన్నాయి. వీటి వలన చేనేత కార్మికులు చాలా మంది భయభ్రాంతులకు గురయ్యారు. ఎందుకంటే పాములు, తేళ్లు వంటివి చెట్లు, పుట్టలు, పొలాలు, అడవులలో ఉంటాయి. నివాస ప్రాంతాలలో చాలా అరుదుగా సంచరిస్తాయి. అయితే రైతులకు గాని, ఇతర వ్యవసాయాధారిత, గిరిజన సమూహాలు, అడవులలో నివసించే వారికి, పొలాలతో సంబంధం ఉన్న వారికి, గ్రామాలలోని రోజువారి కూలీలు పాములు, జంతువులు, అడవి జీవుల మధ్యన, చాలా దగ్గరగా జీవిస్తుంటారు. కావున విషసర్పాలు, జంతువులు, మృగాలనుండి తనను తాను ఏవిధంగా కాపాడుకోవాలో వారికి తెలుస్తుంది. కానీ చేనేత కార్మికులకు ఇదొక కొత్త అనుభవం. వీటిలో దేనితోనూ సంబంధం ఉండదు. కాబట్టి ఈ తుఫానుకు ఇళ్లు చుట్టు ఇంటిలోను ఉన్న నీటికి సంచరించిన పాముల వలన చేనేత కార్మికులు భయాందోళన చెందారు.

**నష్టమెంత జరిగింది**

మగ్గం పూర్తిగా దెబ్బతిన్న కుటుంబాలకు రాట్నం, ఇరిగి, కండెలు తుప్పుపట్టడం, వరదలో కొట్టుకుపోవడం, ఒడి నీటిలో ముద్దవ్వడం, నేతనేస్తున్న అద్దకం చేసిన నూలు నీరు, మట్టి కలసి పనికిరాకుండా పోవడం జరిగింది. మగ్గం కాకుండా, ఇల్లుకూలడం, వంటసామాను, బట్టలు, పుస్తకాలు, సర్టిఫికేట్లు, ఇంటికాగితాలు విలువైన వస్తువులు కొట్టుకుపోవడం, నేలంతా తడిచి బురదవ్వడం కొందరికి మగ్గం కూడా విరగడం వంటి నష్టం పెద్ద మొత్తంలో ఉంది. నష్టాన్ని పూడ్చడానికి ఎటువంటి చర్యలు లేవు.

**షెడ్డు కార్మికుల దీనవస్థ**

చేనేతరంగంలో అట్టడుగు వర్గం షెడ్డు కార్మికులు చేనేతరంగంలో సంక్షోభం పెరుగుతున్నది. గ్రామీణ ప్రాంతాల నుండి వలస వచ్చి చిన్న పట్టణాలైన చీరాల, పెడన, మంగళగిరి వంటి ప్రాంతాలలో మాస్టర్ వీవర్ల దగ్గర నివసిస్తున్నారు. కొంత విస్తీర్ణంలో షెడ్డును ఏర్పాటు చేసి అందులో మగ్గాలు ఏర్పాటు చేసి, నివసించడానికి అగ్గి పెట్టెల్లాంటి గదులు ఉంటాయి. స్నానపు గదులు గానీ, టాయ్‌లెట్లు గానీ, మంచినీటి వసతులు ఏమీ ఉండవు, చీకటి గదుల్లో నివసించే వారికి, సామాజిక భద్రత కూడా కరువే 'షెడ్డు' జీవితం ఒక రకంగా చెప్పాలంటే పారిశ్రామిక బానిస జీవితంలా ఉంటుంది.

కోస్తా తీర ప్రాంతంలో చీరాల, పెడన, మంగళగిరి లో షెడ్డులు విరివిగా ఏర్పడ్డాయి. 'ఓగ్ని' వరదలకు షెడ్డు కార్మికుల పరిస్థితి దుర్భరంగా మారింది. మగ్గం గుంట నిండా నీరు. మగ్గం గుంట గోడలు కూలిపోయి బావిలా తయారయ్యింది. తీరప్రాతంలోని షెడ్డులకు చుట్టుగోడలు ఉండవు. కట్టె బట్టలతో ఏర్పాటు చేస్తారు. పైకప్పు వరిగడ్డి, తడికలు, రేకులతో ఏర్పాటై రేపోమాపో కూలడానికి సిద్ధంగా ఉన్నట్టు కనిపిస్తాయి. ఇటువంటి షెడ్డుల్లో చిన్న జల్లు కురిసినా, గాలివీచినా ఆరోజు పని ఉండదు. చలి ఎక్కువగా ఉంటుంది.

షెడ్డు కార్మికులలో చాలా మందికి, రేషన్ కార్డులు గానీ, చేనేత గుర్తింపు కార్డులు గానీ లేవు. వీరికి స్వంత మగ్గం గానీ, ఇల్లు గానీ లేదు. ప్రభుత్వం ఇచ్చే పరిహారం నేరుగా ఆ షెడ్డు యజమానికి చేరుతుంది. కొన్ని చోట్ల షెడ్డు కార్మికులకు పరిహారం ఇచ్చినప్పటికీ కార్మికులకు సగం, షెడ్డు యజమానికి సగం, మరికొన్ని చోట్ల పూర్తిగా షెడ్డు యజమానులు తీసుకున్న సందర్భాలూ ఉన్నాయి. మగ్గం గుంటను పూడ్చాల్సింది, దెబ్బతిన్న నూలు ఖర్చును భరించేది కార్మికులే షెడ్డు కార్మికులతో బాలకార్మికులు ఇప్పటికే అధికంగా ఉన్నారు. కానీ 'ఓగ్ని' తాకిడితో వీరి సంఖ్య రెట్టింపయ్యే ప్రమాదం ఉంది.

**నీటిలో ఉన్న మగ్గాలు (అంచనా)**

| | జిల్లా | పాక్షికంగా | పూర్తిగా | మొత్తం |
|---|---|---|---|---|
| 1. | ప్రకాశం | 10,000 | 8,000 | 18,000 |
| 2. | గుంటూరు | 5,000 | 7,000 | 12,000 |
| 3. | కృష్ణా | 2,000 | 12,000 | 14,000 |
| 4. | నెల్లూరు | 2,000 | 3,000 | 5,000 |
| 5. | తూర్పు గోదావరి | 3,500 | | 3,500 |
| 6. | పశ్చిమ గోదావరి | 3,000 | | 3,000 |
| | మొత్తం | 25,500 | 30,000 | 55,500 |

**పూర్తిగా నష్టం :** పడుగు పాడవడం, గుంట కూలిపోవడం, గుంటలో నీరు చేరడం, అచ్చు, పన్నె తుప్పు పట్టడం ఇతర మగ్గం పరికరాలు, గుంజలు సీకు పట్టడం

**పాక్షికంగా నష్టం :** గుంటలోకి నీరు చేరడం, పడుగు మాత్రమే పాడవడం.

| **ఉపాధి కోల్పోయిన వారు (అంచనా)** | |
|---|---|
| మగ్గం నేత కార్మికులు | 1,66,500 |
| అనుబంధ వృత్తులు | 20,000 |
| మొత్తం | 1,86,500 |

| **కోల్పోయిన పనిదినాలు (అంచనా)** | |
|---|---|
| కార్మికులకు | 49,95,000 |
| 1కి 30 రోజులు | |
| అనుబంధ వృత్తులు | 4,00,000 |
| 1కి 20 రోజులు | |
| మొత్తం | 53,95,000 |

| **నష్టం (అంచనా)** | **రు. కోట్లలో** |
|---|---|
| 1. మగ్గాలకు | 39.80 |
| 2. మజూరీ నష్టం | 35.06 |
| 3. గోడలు పడిపోయినందుకు గాను నష్టం | 0.60 |
| 4. కూలిపోయిన ఇళ్లకు జరిగిన నష్టం | 1.37 |
| మొత్తం | 70.83 |

**అందుతున్న వరదసహాయం**

మూడు రోజులు తర్వాత చేనేతలు పోరాడితే గ్రామాలకు పులిహోర ప్యాకెట్లు అందిస్తున్నారు. చీరాల పరిసర ప్రాంతాలలో 20 కె.జిల బియ్యం (14-18 కె.జిలు) పంపిణి జరుగుతుంది. చీరాలలో కొంతమంది మాస్టర్‌వీవర్లు వారి దగ్గర పని చేసేవారికి 10 కె.జిల చొప్పున బియ్యం పంపిణి చేసారు. గ్రామ పెద్దలు, వార్డు మెంబర్లు, దాతలు, సానుభూతిపరులు అక్కడక్కడా అన్నం పెడుతున్నారు.

పెడన పరిసర ప్రాంతాలలో మాస్టర్ వీవర్లు కుటుంబానికి 10 కె.జిలు బియ్యం, రు. 25 నగదు చెల్లిస్తున్నారు. ప్రభుత్వం రోజుకు కుటుంబానికి 2 కె.జిలు ఇచ్చే పద్ధతిని ఇప్పుడిప్పుడే ప్రారంభించింది. పోలవరంలోని చేనేత సహకార సంఘాలు సొసైటీ సభ్యులకు కుటుంబానికి 20 కె.జిల బియ్యం, పెడన, పోలవరం, చల్లపల్లి సొసైటీలు సభ్యులకు రు. 400 చొప్పున అప్పులిస్తున్నారు. కానీ కార్మికులకు సరియైన సహాయం అందడంలేదు. మగ్గం దెబ్బతింటే వెయ్యి రుపాయలు, నూలు దెబ్బతింటే వెయ్యిరుపాయలను కుటుంబానికి ప్రభుత్వం అందిస్తుంది.

ఒక్కొక్క కుటుంబంలో 2-4 మగ్గాలు ఉన్నాయి. దీనివలన నష్టపోయిన మగ్గాలకు పరిహారం దొరకదు. నిజమైన బాధితులకు ఉపయోగం జరగదు. కొన్ని చోట్ల మగ్గాలకు ఇచ్చిన నష్టపరిహారాన్ని మాస్టర్ వీవర్స్ తీసుకుంటున్నారు. మరికొన్ని చోట్ల సగం కార్మికుడికి సగం మాస్టవీవర్స్ పంచుకుంటున్నారు. బాధితులకు ఇచ్చే పరిహారం బాధితుల పేరుతో చెక్కు రూపంలో అందించడం జరుగుతున్నది. ఇక్కడ దళారుల ప్రత్యక్షమవుతున్నారు. వెయ్యి రుపాయల చెక్కుకు తొమ్మిది వందలు చెల్లించి వంద రుపాయలు జేబులో వేసుకుంటున్న పరిస్థితి ఉంది.

క్రిష్ణా జిల్లాలో ఎన్యుమరేషన్ చాలా అలస్యంగా 10 రోజుల తరువాత మొదలయ్యింది. వరద బాధిత జిల్లాలలో ఎన్యుమరేషన్ చేయడానికి చేనేత జౌళి శాఖవారు చేనేత సహకార సంఘాలకు బాధ్యతలు అప్పగించడం జరుగుతున్నది. వీటిపట్ల సహకారేతర రంగంలోని వారు అభ్యంతర పెట్టిన సంఘటనలు ఉన్నాయి. చాలా గ్రామాలలో చేనేత జౌళి శాఖ గానీ, ఇతర ప్రభుత్వ సిబ్బంది గానీ ప్రజలను పరామర్శించిన పరిస్థితి కనబడలేదు. వరదలు తగ్గుముఖం పట్టిన తరువాత ప్రతిపక్షాలు, అధికార పక్షాలు ఒకరి తరువాత ఒకరు ప్రధాన రోడ్లపైన పర్యటించారు. కానీ గ్రామంలోనికి వెళ్లి ఇంటి పరిస్థితితులను పరిశీలించలేదు.

**చేనేతకు అందిన వరద సహాయం**

**1977 ఉప్పెనకు అందించిన పరిహారం**

- 1977 ఉప్పెనకు మగ్గం మరమ్మత్తులకు ఒక్కొక్క చేనేత కార్మికుడికి రు. 150, నూలుకు 100 రుపాయలను పరిహారంగా ప్రభుత్వం ఇచ్చింది. వీటిలో 50 శాతం రుణంగాను, మరో 50 శాంత సబ్సిడీగా అందజేసింది.
- పూర్తిగా కూలిన ఇంటికి రు. 150, పాక్షికంగా దెబ్బతిన్న ఇళ్లకు రు. 75 నష్టపరిహారం ఇచ్చారు.
- కుటుంబానికి 10 కె.జిల బియ్యం ఇచ్చారు
- చనిపోయిన ప్రతి ఒక్కరికి రు. 1,000 ఎక్స్‌గ్రేషియా మూలం :

**1990లో ఆంధ్రప్రదేశ్‌లో వచ్చిన తుఫాను సహాయం**

- చేనేత, జౌళి 6.44 కోట్లు
- 25 కె.జిల బియ్యం
- దెబ్బతిన్న మగ్గానికి రు. 500
- నూలు నష్టంకు రు. 200
- ఇతరములు

**2006లో ఆంధ్రప్రదేశ్‌లో వచ్చిన తుఫాను సహాయం**

- ఓగ్ని తుఫానుకు మగ్గం దెబ్బతిన్నందుకు రు. 1,000
- నూలు దెబ్బతిన్నిందుకు రు. 1,000 కుటుంబానికి
- 20 కె.జిల బియ్యం

**గుర్తించిన సమస్యలు**

- ప్రకాశం, గుంటూరు, కృష్ణ జిల్లాలలో సుమారుగా 80 గ్రామాలకు పైగా ఈరోజు వరకు కూడా నీటిలోనే మునిగి ఉన్నాయి.
- సుమారుగా 55 నుండి 65 వేల మగ్గాలకు వరద నష్టం జరిగింది
- ఓగ్ని సృష్టించిన బీభత్సం వలన చేనేత రంగానికి 70.83 కోట్ల నష్టం జరిగింది.
- సుమారు 550 ఇళ్లు వరకు నేల మట్టమయ్యాయి.
- 1,86,500 మంది చేనేత కార్మికులు సగటున నెలరోజుల పాటు పని కోల్పోయారు.
- చీరాలలో ఇద్దరు చేనేత కార్మికులు ఆకలితో చనిపోవడం జరిగింది.
- చాలా మంది చేనేత కార్మికులు అస్వస్థతకు గురయ్యారు.
- నీటిలో మునిగి ఉన్న చేనేత గ్రామాలకు అన్నం, నీళ్లు అందలేక, ఆకలికేకలతో అల్లాడుతున్నారు.
- దాదాపు 20 చేనేత గ్రామాలకు రవాణా స్థంభించిపోయింది.
- ఇంతవరకు చేనేతకు జరిగిన నష్టాన్ని ప్రభుత్వం తరపున అంచనా వేయలేదు.
- ప్రభుత్వ అధికారులు కానీ, చేనేత అధికారులు గానీ, ప్రజా ప్రతినిధులు గానీ చేనేత గ్రామాలకు వెళ్లి పరిశీలించడం గానీ, కార్మికులను పరామర్శించడం గానీ జరగలేదు.
- అనుబంధ వృత్తుల వారికి నష్టపరిహారం చెల్లించడంలేదు.
- చేనేత షెడ్డు కార్మికుల పరిస్థితి అత్యంత దయనీయగా ఉన్నది.
- మగ్గం గుంటలోకి నీరు చేరి, పడుగు పాడైంది, పన్నె, అచ్చు, సంబంధిత మగ్గం పరికరాలు పూర్తిగా పనికి రాకుండా పోయాయి.
- షేర్, స్పందన వంటి మైక్రోఫైనాన్స్ సంస్థలో కార్మికులు అప్పులున్నారు. వాయిదా చెల్లింపులకు చాలా ఇబ్బందికరంగా ఉంది.

**చేనేతలు చేయవలసింది**

- వరదముంపు ఉన్న గ్రామాలలో ప్రకృతి వైపరీత్యాల పర్యవేక్షక కమిటీని ఏర్పాటు చేసుకోవాలి. ఈ కమిటీలో చేనేత కార్మికులు మాత్రమే ఉండే విధంగా చూడాలి.
- మగ్గము, పడుగు, పేక, మగ్గం పరికరాలకు జరిగిన నష్టం ఎంతో అంచనా వేయాలి. వీటిలో మగ్గాల వారి వివరాలు ఉండాలి.
- గ్రామంలో చేనేతరంగానికి జరిగిన నష్టం అంచనా వేయాలి.

అవసరమైన సహాయం ఎంతో పేర్కొనాలి. పూర్తి వివరాలతో నివేదిక తయారు చేసి చేనేత జౌళిశాఖ అధికారులకు, మండల రెవిన్యూ అధికారి, జిల్లా కలెక్టరుకు అందించాలి.

- 'నివాసం' (ఇంటికి) కు జరిగిన నష్టం ఎంతో ప్రత్యేక అంచనా వేయాలి.

**దీర్ఘకాలిక చర్యలు**

- ప్రకృతి వేపరీత్యాల నుండి చేనేత కార్మికులను ఆదుకోవడానికి విధానాన్ని రూపొందించాలి
- గుంట మగ్గాలను లేదా ఫ్రేమ్ మగ్గాల ఏర్పాటుకు ప్రభుత్వమే గ్రాంటుగా ఇచ్చి సహకరించాలి.
- నష్టపోయిన మగ్గానికి 50 కిలోల బియ్యం, 10 లీటర్ల కిరోసిన్, 500 రుపాయలు నగదు ఆహార బత్యం కింద ఇవ్వాల్సి ఉంది.
- చేనేత గ్రామాలను మెరక ప్రాంతాలలో ఏర్పాటు చేయాలి.
- ప్రకృతి వైపరీత్యాల వలన చేనేత ఉత్పత్తి, ఉపాధి ప్రభావాన్ని పరిశోధన చేయాలి.
- పని చేస్తున్న చేనేత సహకార సంఘాలకు రుణాలను రీషెడ్యూలింగ్ చేయాలి.
- ఇళ్లు కూలిపోయిన వారికి, మట్టిగోడలతో ఉన్న ఇళ్లకు పక్కా గృహాలు నిర్మించి ఇవ్వాలి. అంతేకాకుండా వర్క్‌షెడ్‌ను ప్రత్యేకంగా పునాదిని ఎత్తుగా కట్టి నిర్మించాలి.
- ప్రకృతి వైపరీత్యాలనుండి చేనేతను ఆదుకునేందుకు జాతీయ విపత్తు నిధి నుండి ప్రత్యేక నిధిని ఏర్పాటు చేయాలి.
- గ్రామల అభివృద్ధికి మాస్టర్ ప్లాన్ తయారు చేయాలి

**సిఫారసులు**

- ప్రకృతి వేపరీత్యాల నుండి చేనేత రంగం పరిరక్షణకు సమగ్ర విధానం రుపొందించాలి.
- ఇన్సూరెన్సు ప్రవేశపెట్టాలి.
- చేనేత ప్రకృతీ వైపరీత్యాల నివారణ నిధి ఏర్పాటు చేయాలి (హ్యాండ్‌లూమ్ డిసాస్టర్ మేనేజ్‌మెంట్ ఫండ్, ఎచ్‌డిఎంఎఫ్)
- పడుగు చేయడానికి అనువైన స్థలాలు కేటాయించి, వాటిని సిమెంటుతో అభివృద్ధి చేసి, షెడ్డును నిర్మించాలి. దీనికయ్యే ఖర్చు ప్రభుత్వము గ్రాంటుగా అందించాలి.
- చేనేతల నివాసాలు (ఇల్లు) ఎత్తయిన ప్రదేశాలలో నిర్మించాలి లేదా నివాస స్థలాలను అభివృద్ధి పరచాలి.
- చేనేత గ్రామాలలో నీరు నిల్వ ఉండకుండా అంతర్గత రోడ్లను అభివృద్ధి చేయాలి. మురుగు కాల్వలను ఏర్పాటు చేయాలి. ఇప్పటికే ఉన్న కాల్వలను ఆధునీకరించాలి.
- డెల్టా ప్రాంతాలలో ఉన్న చేనేత గ్రామాలలో నీటిపారుదల వ్యవస్థను ఆధునీకరించాలి.
- ప్రజల భాగస్వామ్యంతో నష్టపోయిన కుటుంబాల ఎంపిక చేసినట్లయితే నిజమైన లబ్దిదారులకు ఉపయోగం ఉంటుంది.
- నష్టపరిహారంగా మూడురకాల పద్ధతుల్లో అమలు చేయగలిగితే మంచిది. రాష్ట్రం, జిల్లా, గ్రామ పంచాయితీ సహకారంతో చేనేత అధికారుల సమక్షంలో ఉంటే మంచిది.
- ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు చేనేత జౌళి శాఖ సిబ్బంది చేనేత నష్టపరిహారం, అంచనాలు వేయడానికి పరిస్థితులను పర్యవేక్షించేందుకు మాత్రమే నియమించాలి.

**సూచనలు**

- గ్రామాలలో ఉన్న నీటిని బయటకు పంపేందుకు తగిన చర్యలు తీసుకోవాలి.
- క్లోరిన్ టాబ్లెట్లు, మందులు సరఫరా చేయాలి.
- కార్మికులకు బ్యాంకుల ద్వారా, పొదుపు సంఘాల ద్వారా పావలా వడ్డీ పథకం కింది రుణాలు అందించాలి.
- 'రవాణా' పునరుద్ధరించేందుకు తగిన చర్యలు తీసుకోవాలి.
- ఒక్కొక్క మగ్గానికి (నష్టపోయిన) కనీసం రు. 6,000 నండి 10,000 వరకు నష్టపరిహారం ఇచ్చినట్లయితే మగ్గానికి పని కల్పించినట్లవుతుంది.
- మగ్గాల ప్రాతిపదికన నష్టపరిహారాన్ని చెల్లించాలి.
- సహకారేతర రంగంలో ఉన్న వారికి, పెట్టుబడి సదుపాయాన్ని అందించాలి.
- సంచార వైద్యశాలలను ఏర్పాటు చేసి, వైద్యం అందించాలి. అంతే కాకుండా ఆరోగ్యం, పరిశుభ్రతపైన అవగాహన పెంచాలి. ◆




## సిడిఆర్‌సి - వీక్షణం సారథ్యంలో సామాజిక, రాజకీయార్థిక అంశాల పరిశోధన కోసం స్వల్పకాలిక ఉపకార వేతనాలు

స్వల్పకాలిక ఉపకారవేతనాల కొరకు ప్రతిపాదనలను, దరఖాస్తులను కోరుతూ వీక్షణం అక్టోబర్, నవంబర్, డిసెంబర్ సంచికలలో ఇచ్చిన ప్రకటనకు పరిశోధకుల నుంచి మంచి స్పందన వచ్చింది. దరఖాస్తు చేసిన అభ్యర్థులందరికీ కృతజ్ఞతలు. దరఖాస్తులు ప్రస్తుతం పరిశీలనలో ఉన్నాయి. జనవరి చివరి వారానికల్లా ఎంపికయిన ప్రతిపాదనలకు, అభ్యర్థులకు వ్యక్తిగత ఉత్తరాలు అందుతాయి.

**– సి.డి.ఆర్.సి. – వీక్షణం**

# ప్రజాస్వామ్యం ఉంటేనే మానవ హక్కులా ?

– ఆచార్య వాసిరెడ్డి భాస్కరరావు

**21**వ శతాబ్దం ప్రారంభంలో ప్రజాస్వామ్యం, మానవ హక్కులు సాధారణంగా పరస్పరాధారాలు అనుకున్నారు. దీనిని బట్టి తెలిసేదేమంటే ప్రజాస్వామ్యాన్ని ప్రోత్సహించే న్యాయబద్ధ ప్రభుత్వం వుంటే మాత్రమే విశ్వజనీన మానవ హక్కులను అధికారికంగా పొందే అవకాశం వుంటుంది. కనుక అభివృద్ధి చెందుతున్న, ప్రజాస్వామ్యం లేని దేశాలలో ప్రజాస్వామ్య ప్రోత్సాహానికి కృషి చేయాలి. అయితే ప్రజాస్వామ్యం యొక్క ప్రధాన లక్షణాలను కీలకమైన ప్రపంచీకరణ సందర్భంగా పరిశీలించాలి. అపుడు ప్రజాస్వామ్యానికి మానవ హక్కులకు మధ్యనున్న పరస్పర ఆధారిత సంబంధ ప్రతిపాదనను పరిశీలించవచ్చు. మొదట, ప్రజాస్వామ్యం, ప్రపంచ వ్యవస్థీకరణ మీద చర్చ తర్వాత, అభివృద్ధి, మానవ హక్కుల మీద చర్చ ద్వారా తెలిపేదేమంటే, ప్రజాస్వామ్య ప్రోత్సాహం ప్రపంచ ఆర్థిక ప్రయోజనాలకు ఎక్కువగా ముడిపడి వుందని, సామాన్య జనులకు, పేద దేశాలలో వుండే వారికి మానవ హక్కుల నందించటంలో అంత ప్రాధాన్యం లేదని తేలుతుంది.

సార్వభౌమాధికారం, సార్వత్రిక మానవ హక్కులు సంబంధిత అధికారాల మధ్య ఒక స్పష్టమైన అశాంతి / ఆందోళన వుంది. మానవత్వ దృష్టిలో ప్రతి వాడూ సమానమని ప్రతి వాడూ మానవ హక్కులు అడిగితే, సార్వభౌమాధికారం నిర్వచనాన్ని నిలబెట్టగలగడం, అంటే జోక్యరహితం, దేశపరిధి, స్వీయ–నిర్ణాయాధికారం, జాతి అంతర్గత విషయాలలో జోక్య రహితం యిదంతా సామాన్య విషయం కాదు, ఏమైనా గాని, ప్రచ్ఛన్న యుద్ధం అంతం కావటం, రాజ్యం ప్రపంచీకరణం కావటం, సమాచార సాంకేతిక శాస్త్ర విస్తృతి వలన కమ్యూనికేషన్ల స్థాయి వృద్ధి కావటం వల్ల ముఖ్యంగా తక్కువ అభివృద్ధి చెందిన దేశాలలో, మానవ హక్కుల పరిరక్షణ యింతకు ముందుకంటే అంత ప్రోత్సాహకరంగా లేదన్న విశ్వాసం పెరిగింది. దీనితో ఉదార ప్రజాస్వామ్యం చాలా ఉత్తమమైనదని, నిజానికి అదొక్కటే ఆమోదయోగ్య న్యాయ పూరిత ప్రభుత్వమని దానికి కొందరు వ్యాఖ్యాతలు తమ మద్ధతును తెలిపారు. ఎందుకనగా ఉదార ప్రజాస్వామ్యం, మానవ హక్కులు ఒకే నాణానికి రెండు పక్కలని వారి ఉద్దేశం. ఈ భావాన్ని అప్పటి ఐక్య రాజ్య సమితి సెక్రటరీ జనరల్ బుట్రోస్ ఘలీ, 'మానవ హక్కులు, సమాన హక్కులు, చట్టబద్ధ ప్రభుత్వం, ప్రజాస్వామ్యం యొక్క ప్రధాన లక్షణాలు'గా వాదించటం జరిగింది.

ఈ వ్యాసం 'ప్రజాస్వామ్యం ఉంటేనే మానవహక్కులు' అన్న సాధారణ సమీకరణ లోతుపాతులను తెలుసుకోవటానికి ప్రయత్నించింది. అయితే ఆ సంబంధాన్ని మనం తగు జాగ్రత్తగా పరిశీలించవలసి వుంది. 21వ శతాబ్దం ప్రారంభంలో, ప్రపంచీకరణ సందర్భంగా ప్రజాస్వామ్యం భావాన్ని సాధారణంగా ఎలా అర్థం చేసుకున్నారో చర్చించాం. ప్రజా స్వామ్యానికి, మానవహక్కులకు మధ్యనున్న ప్రతిపాదిత సంబంధాలను పరిశీలించాం. ప్రపంచీకరణ పరిస్థితులలో అసలు ప్రజాస్వామ్యం. మానవ హక్కుల పరిరక్షణ శక్తి ఏమిటి అన్న విషయాలతో, అభివృద్ధి, ప్రజాస్వామ్యం, మానవహక్కులు గురించి చివరి భాగంలో చర్చించాం.

**ఉదార ప్రజాస్వామ్యం**

ఉదార వాదానికి – విభిన్న భాష్యాలున్నప్పటికీ, ఉదార ప్రజాస్వామ్యం వివిధ రకాలుగా అన్వయించబడినప్పటికీ, ప్రచ్ఛన్న యుద్ధ యుగం తర్వాత మామూలుగా ప్రజాస్వామ్యమంటే ఏదో ఒక రూపమైన ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంగా, సోషలిస్టు ప్రత్యామ్నాయాల మీద విజయం సాధించినదిగా భావిస్తున్నారు. ఈ విధంగా విస్తృతంగా భావించబడిన ప్రజాస్వామ్యమంటే ఏమిటో, నాలుగు అంశాలను ప్రధానంగా చర్చకోసం ప్రతిపాదిస్తున్నాం.

**మొదటిది :** ఒకానొక జాతి (కమ్యూనిటీ) ప్రజాస్వామీకరణకై ఒక ప్రాదేశిక రాజ్యం. ఈ ప్రాదేశిక రాజ్యం ఒక ప్రాథమిక వ్యవస్థ, యిది కొన్ని ప్రజాస్వామ్య పరిమితులను విధిస్తుంది. దేశీయులు, విదేశీయులు, పౌరులు, పౌరులు కాని వారులాగా కొన్ని తరతమ బేధాలను రాజ్యాంగం ద్వారా నిర్వచిస్తుంది. సాధారణంగా ఉదార ప్రజాస్వామ్య భావన స్వయంపాలన సమాజం, జాతీయ సార్వభౌమాధికారం చేత నిర్వచింపబడిన పౌరులు, ప్రాదేశిక జాతి–రాష్ట్రం, స్వయం–నిర్ణయాధికారం, మరియు దేశీయ అధికార పరిధితో ముడిపడి వుంది. అంటే ప్రజాస్వామ్యం మరియు జాతి–రాష్ట్రం మధ్య వున్న సంబంధం – ఆజాతి–రాష్ట్రం భాగంలోగానే ప్రజాస్వామ్యాన్ని అర్థం చేసుకోవాలి. అంతర్జాతీయ ప్రజాస్వామ్య సిద్ధాంతానికి – ఆచరణకు సంబంధం లేదు.

**రెండవది :** అన్ని రూపాల ఉదార ప్రజాస్వామ్యాలకు గుండెకాయ లాంటిది జవాబుదారీ సూత్రం ఈ సూత్రం వాక్, సమావేశ, మీడియా స్వాతంత్రం లాంటి పౌరస్వేచ్ఛలకు హామీనిస్తుంది. జవాబుదారీ సూత్రం యొక్క ముఖ్యకర్తవ్యం ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టడానికి ప్రజా ప్రాతినిధ్య సంస్థలకు నియమితకాలంలో సార్వత్రిక ఎన్నికలు నియమంగా నిర్వహించటం. ఎన్నికలు లేకుండా ప్రజాస్వామ్యం వుందనటానికి వీలులేదు. ఈ ప్రాతినిధ్య సంస్థలు (పార్లమెంట్, విధాన సభ, మున్సిపాలిటీ, పంచాయత్) ప్రజలపై పన్నులు విధించడానికి, ప్రజా పనులు నిర్వహించటానికి, ప్రజల ఆశలను తీర్చటానికి, రాజకీయ సమానత్వాన్ని, హక్కులను రక్షించటానికి అధికారాలు, భాధ్యతలు కలిగివుంటాయి.

**మూడవది :** ప్రజాస్వామ్య రాజ్యాలు పెద్ద ఎత్తున స్వయం ప్రతిపత్తిని కొనసాగిస్తాయి. ప్రజా ప్రయోజనాల సాధనకు కావలసిన విధానాలను చేపడతాయి. బ్యాలెట్ బాక్స్ ద్వారా ప్రజలు వ్యక్తపరచిన ఆశలను నెరవేరుస్తాయి. ప్రజా అవసరాలను తీర్చటానికై ప్రభుత్వం సమాజపు సకల వనరులను, ఆస్తులను, ప్రకృతి సంపదలను, ప్రజాస్వామ్య సూత్రాలకు బద్ధులై స్వేచ్ఛగా వినియోగించుకోవచ్చు. విదేశీ బాహ్య శక్తులు వీటిని ఆటంకపరచటానికి కుదరదు. అయితే అంతర్జాతీయ వ్యవస్థలో దేశీయ అధికార శక్తిని బట్టి ఈ స్వయం ప్రతిపత్తి నిలుపుకొనే శక్తి వుంటుంది.

**చివరిది :** ప్రజాస్వామిక రాజ్యం సమస్త ప్రజల ప్రయోజనాలకు చర్యలు తీసుకొంటుంది. అంతేగాని, ఒక ముఠాకో, లేక ప్రత్యేకమైన వర్గానికి, జాతికి మాత్రం కాదు. అయితే ఉదార వర్గాలకు ప్రజాస్వామిక వర్గాలకు మధ్య ఎల్లప్పుడూ కొంత ఆందోళన వుంటుంది. రాజ్యం – పౌర సమాజం, ప్రభుత్వం – ప్రైవేట్, ఆర్థిక – రాజకీయ విషయాల మధ్య కొంత సంవాదం, సంఘర్షణ వుంటుంది. కనుక ప్రజాస్వామ్య రాజ్యం, పరిమిత రాజ్యం. రాజ్య జోక్యంతో దేశసంపదల పెంపుదలలో వ్యక్తిగత స్వేచ్ఛలను

సామాజికవ్యవస్థ నిర్వహణ కోసం అరికట్టవలసి వుంటుంది. సంక్షిప్తంగా ప్రజాస్వామ్య రాజ్యభావనలో సముచితమైన సమాజం, జవాబుదారీతనం, స్వయంప్రతిపత్తి, ప్రయోజనాలు అన్న సూత్రాలున్నాయి. అయితే, యివి ప్రపంచీకరణ యుగంలో ఎలా ఉన్నాయో తెలుసుకోవటం చాలా అవసరం. ఒకానొక దేశం ప్రపంచ దేశాలతో పెట్టుకున్న సంబంధాలతో సమస్యలెదురౌతాయి. ముఖ్యంగా సముచిత/సంబంధిత సమాజం యొక్క ఆమోదం పొందటమన్న విషయం వివాదస్పదమౌతుంది. ఉదా. హక్కుల విషయంలో మానవ హక్కులు, ఆర్థిక సామాజిక, పౌర హక్కులతో సహా-ప్రజాస్వామ్యం ఒకానొక ప్రాదేశిక సమాజానికేనన్న భావానికి సమస్యలు ఎదురౌతున్నాయి. ప్రపంచీకరణ సందర్భంగా రాజ్యం తన ఎల్లలలో అధికారాన్ని నిర్వహించ లేకపోతున్నది. ఆర్థికంగా, భావాల పరంగా, సంస్కృతీ సామాజిక సంపర్కాలు, రాజకీయ అంతర్జాతీయ సంబంధాలు అనేకం రాజ్యం ఎల్లలు దాటి రాజ్యంలోకి ఎవరి అనుమతి లేకుండానే చొచ్చుకొని ప్రవహిస్తున్నాయి. శాస్త్ర సాంకేతిక విజ్ఞానం, ప్రపంచ వాణిజ్యం, మార్కెట్, విదేశీ పెట్టుబడులు, సేవలు అనేక ఖండాంతర సంబంధాలకు దారి తీస్తున్నాయి. కనుక ఈనాడు అంతర్గత-బాహ్య రాజకీయాలకు మధ్య తేడాపోయింది. ప్రజాస్వామికంగా ఎన్నుకోబడిన రాజ్యాలు, ప్రపంచ ప్రభావాలకు లోనుకావటం వల్ల, జాతీయ ప్రజాస్వామిక సమాజంలోని ప్రతి పౌరుడు రాజ్య అశక్తతకు, ప్రజా ఆమోదం లేకుండానే తీసుకున్న / లోబడిన నిర్ణయాలకు సమస్యలను ఎదుర్కొవలసి వస్తుంది. అనగా పౌరుడు, పౌర ప్రయోజనాలు, పౌర ప్రాతినిధ్య ఆమోదం సాంప్రదాయకంగా యింతకు ముందు మనం చర్చించుకున్న ప్రజాస్వామ్య నాలుగు ప్రధాన సూత్రాల విలువలకు ప్రాధాన్యం తగ్గిందని తెలుస్తుంది.

ప్రపంచీకరణతో ఖండాంతర నిర్ణయీకరణ ప్రభావం వలన జాతీయ నిర్ణయీకరణ ప్రక్రియల అధికారం తగ్గిపోయింది. దీనితో జాతీయ ప్రయోజనం, 'అందరి మంచి' దృష్ట్యా రాజ్యం తన పాత్రను క్రమంగా కోల్పోతుంది. ఇంతకు ముందు రాజ్యం తన నిర్ణయానుసారం, అందరి మంచిని ఆశించి తీసుకొన్న నిర్ణయాలు, ఈనాడు ప్రపంచ సంస్థల (ప్రపంచ వాణిజ్య సంస్థ, ప్రపంచ బ్యాంకు లాంటివి) ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న తరుణంలో జాతీయ ప్రజాస్వామ్య సాంప్రదాయక సూత్రాలు నిలువలేక ప్రజాస్వామ్య రాజ్యాలు, ప్రపంచ సంస్థలు తీసుకొన్న నిర్ణయాలకు లోబడి నిబంధనలను అమలుపరుస్తున్న పాలకులుగా మిగిలిపోతున్నారు. (ఉదా. ప్రపంచ వాణిజ్య నిబంధనలు) అనగా జాతీయ ప్రజాస్వామ్య రాజ్యాలు ప్రపంచసంస్థల అధికారానికి సేవలు చేస్తున్నాయి. జాతీయ స్థాయి ప్రజాస్వామ్యం, ప్రపంచస్థాయి ఆధిపత్య ధోరణులకు లోబడుతూ వుంది.

ప్రపంచీకరణ యొక్క మూడవ అంశం ఖండాంతర, బహుళ జాతుల కార్పోరేషన్ల పెరుగుతున్న ఆర్థిక శక్తి, జాతీయ ప్రజాస్వామ్యానికి సవాలుగా నిలిచింది. ఈ కార్పోరేషన్ల వార్షిక అమ్మకాలు కొన్ని అభివృద్ధి చెందిన దేశాల జాతీయ స్థూల ఉత్పత్తి కంటే కూడా ఎక్కువగా ఉన్నాయి. విదేశీ పెట్టుబడులను ఆకర్షించే మోజులో కొన్ని దేశాలు తన స్వంత సమాజపు అవసరాలనే పక్కకునెట్టుతున్నాయి. (ఉదా. కార్మిక సంఘాలు, పర్యావరణం, పన్నులు, మానవ హక్కుల నిబంధనలు) స్థిరమైన పరిస్థితులు నెలకొల్పటానికి అంతర్జాతీయ సంస్థలు విధిస్తున్న షరతులను, సమాజపు ఇబ్బందులను కూడా లెక్కచేయకుండా, అమలు చేయటానికి ప్రభుత్వాలు ఒప్పందాలు కుదుర్చుకుంటున్నాయి. వ్యవస్థాపక సర్దుబాటు కార్యక్రమాలు ఈ తరహాకి చెందినవిగా గుర్తించాలి.

వీటన్నిటి పర్యవసానం సంక్షిప్తంగా రాజ్యం తన స్వయం ప్రతిపత్తిని కోల్పోవటమే. ఇది ప్రజాస్వామ్య సూత్రాలైన ప్రజాస్వామ్య ప్రాతినిధ్యం, ప్రభుత్వ జవాబుదారీతనానికి ఎదురౌతున్న సవాలు. పై స్థాయి ప్రభుత్వాలు ప్రజల ఆకాంక్షలను తీరుస్తాయని, మానవ హక్కులను కాపాడతాయని నమ్మిన స్థానిక ప్రజలు ప్రభుత్వంపై, దాని శక్తిపై విశ్వాసం కోల్పోవటం జరిగింది. తమ రాజ్యం అంతర్జాతీయ శక్తులకు తలొగ్గటం ప్రజలు గమనిస్తున్నారు. ప్రజా ప్రతినిధుల సభల ఆమోదం లేకుండా, చట్ట వ్యతిరేకంగా ప్రభుత్వాలు లోపాయికారిగా కుదుర్చుకుంటున్న అనధికార ఒప్పందాలను ప్రజలు విశ్లేషిస్తున్నారు. మానవ హక్కులు రక్షించటం రాజ్యం యొక్క విధిగా అంతర్జాతీయ న్యాయం ప్రకటించినా, ఆ విధులను సక్రమంగా అమలు చేయగల శక్తి యిపుడు రాజ్యాలకు సన్నగిల్లింది. ప్రజాస్వామ్యం ద్వారా, చట్టబద్ధ పాలన ద్వారా మానవహక్కులను కాపాడటం ప్రచ్ఛన్న యుద్ధం కంటే ముందున్న పరిస్థితులను నెలకొల్పటానికి బదులు, ప్రపంచీకరణ శక్తులు మానవ హక్కులు రాజ్య పరిరక్షణకు వీలుకాని పరిస్థితులను, ఆధిపత్యాన్ని కలుగచేస్తున్నాయి కనుక ప్రజాస్వామ్యం చారిత్రాత్మకంగా అనుకున్నట్లుగా లేదు అనే చెప్పాలి. ప్రజాస్వామ్యానికే రక్షణ లేనపుడు మానవ హక్కులను కాపాడే రాజ్యమెక్కడిది? అటువంటి రాజ్యం ప్రజాస్వామ్యంపై ప్రజలకు ఎలా విశ్వాసం వుంటుంది? కనుక యిటువంటి ప్రజాస్వామ్య రాజ్యాలలో మానవ హక్కుల స్థితిగతులను తెలుసుకోవటం యిపుడు చేద్దాం.

**ప్రజాస్వామ్యం – విశ్వజనీన మానవ హక్కులు**

ప్రజాస్వామ్యం-మానవ హక్కులు గందరగోళంలో వున్న పరిస్థితులను పరిశీలించటానికి లాటిన్ అమెరికాలో, కరీబ్బియన్ దేశాలపై హ్యూమన్ రైట్స్ వాచ్ రిపోర్టు 1999 ఉదాహరణగా తీసుకొంటే బహుళ-పార్టీ ప్రజాస్వామ్యం వున్న రాజ్యాలలో మాత్రమే మానవ హక్కులు మెరుగ్గా వున్నాయని, మిగతా రాజ్యాలలో మానవ హక్కుల ఉల్లంఘన జరుగుతుందని తెలిపింది. కనుక ప్రజాస్వామ్యం, మానవ హక్కులు పరస్పరాధారాలన్న ప్రతిపాదనను చాలా జాగ్రత్తగా పరిశీలించవలసివుంది. కొన్ని ప్రజాస్వామిక దేశాల చరిత్ర పుటలను తిరగేస్తే, అక్కడ అన్ని హక్కులను అందరికి యిచ్చినట్లు సాక్ష్యాలు లేవు. కనుక ప్రజాస్వామ్యానికి కట్టుబడి వుండటమంటే అన్ని హక్కులు అందరికీ సమానమన్నది లేదు కాబట్టి మానవ హక్కులకు కూడా హామీలేదు. ఒక వేళ గట్టిగా న్యాయబద్ధమైన మానవ హక్కుల గురించి వాదిస్తే ప్రజాస్వామ్యంలో వున్న స్వయం ప్రతిపత్తికి, రాజకీయ ఆర్థిక, సామాజిక వ్యవస్థపై స్వయం-నిర్ణయాధికారానికే చేటు వచ్చే ముప్పు వుంది. జాతీయ ప్రజాస్వామ్యం ఒకవేళ మానవహక్కులను కాపాడాలనుకున్నా ప్రస్తుత ప్రపంచీకరణ పరిస్థుతులలో సాధ్యం కాకపోవచ్చునన్న అనుమానం వుంది. అయితే ప్రపంచీకరణ పరిస్థితులు ఎల్లకాలమూ ఉండకపోవచ్చు. ఎందుకంటే అభివృద్ధి, రక్షణ, పర్యావరం, మానవ హక్కులు లాంటివి జాతీయ సమస్యలని ప్రపంచీకరణ అర్థం చేసుకున్ననాడు ఆ విషయాలపై దాని ప్రభావం వుండదు. మానవ హక్కులను రక్షించటం ముఖ్యమైన విషయమని భావిస్తే జాతీయ స్థాయిలో ఉదార ప్రజాస్వామ్య వ్యవస్థలను, వాటి వ్యవహారాలను చక్కదిద్దినంత మాత్రాన సరిపోదు. జాతీయ ప్రజాస్వామ్య వ్యవస్థలను సమర్థిస్తూ, అణగారిన వర్గాలు, అల్పసంఖ్యాకులు, విస్మరింపబడ్డ ముఠాలు ప్రజాస్వామ్యంలో పాలు పంచుకోవటం కోసం పోరాటం చేస్తారని గమనించాలి. ఇంత చేసిన ఆ ప్రపంచ సమాజాన్ని ప్రజాస్వామీకరణ చేయకపోయినట్లయితే పెద్దగా సాధించగలిగేదే వుండదు.

*(మిగతా వచ్చే సంచికలో)*

# స్వాతంత్ర్యానంతరం - టెక్నాలజీ, గ్రామీణాభివృద్ధి

- డా. తోట సత్యనారాయణ

## పరిచయం

అభివృద్ధి మార్గాలన్ని సమానత్వాన్ని కేంద్ర బిందువుగా చేసుకుని గుణాత్మకతకు, వెగిరత (క్వాలిటి, స్పీడ్) కు ఎక్కువ ప్రాధాన్యత నివ్వడం జరిగింది. గ్రామీణాభివృద్ధి సాపేక్ష స్వభావంగల భావన. ప్రపంచ సమాజాల ఆధునీకరణలో భాగంగా గ్రామీణ ప్రజలందరి సంక్షేమ లక్ష్యమైన వ్యవసాయాభివృద్ధి సమాజాభివృద్ధితో కూడినదే గ్రామీణాభివృద్ధిగా పరిగణింపబడేది. గ్రామీణ పేదల ఆర్థిక, సాంఘిక, సాంకేతిక జీవనాన్ని మెరుగుపర్చుటకు ఉద్దేశించిన వ్యూహంగా గ్రామీణాభివృద్ధి నేడు పరిగణించపడుతుంది. అందుకే ఆర్థికాభివృద్ధిలో భారతదేశాన్ని మరింత ముందుకు తీసుకుపోవాలంటే సమగ్ర గ్రామీణాభివృద్ధి (ఇంటిగ్రేటెడ్ రూరల్ డెవలప్‌మెంట్) పై మరింత దృష్టిని కేంద్రీకరించాలి. భారతదేశం అంటేనే గ్రామాలు, వ్యవసాయమని వింటున్నాం. వ్యవసాయాభివృద్ధికి ఎంతో ప్రాధాన్యత ఇస్తున్నట్లు చెప్పుకునే ప్రభుత్వాలు వ్యవసాయమే అన్ని సంస్కృతులకు మూలమని చెప్తున్నాయి. డెబ్బై అయిదుశాతం జనాభా ఆధారపడే వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేయడమంటే మెజారిటీ ప్రజల విధానాన్ని నిర్లక్ష్యం చేయడమే అవుతుంది.

గ్రామీణాభివృద్ధిని దీర్ఘకాలంగా మనగలిగే ప్రగతిగా మార్చాలంటే దేశంలోని ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, పర్యావరణ జనాభాపరమైన, చారిత్రక, సాంకేతిక ప్రాంతీయ కారకాలను గుర్తించి అభివృద్ధి ప్రక్రియలో తగు ప్రాధాన్యతనివ్వాల్సి ఉంటుంది. అయితే, దేశంలోని సమకాలీన భవిష్యత్ మానవ అవసరాలను తీర్చడం కోసం వనరుల వినియోగాన్ని పెట్టుబడుల దిశను, సాంకేతికాభివృద్ధి ధోరణులను, సంస్థాగతమైన మార్పులను, సమతుల్యపర్చడం ద్వారా వచ్చే 'మార్పు' దీర్ఘకాలికంగా మనగలిగితే అది 'అభివృద్ధి' అవుతుంది. ఆర్థికాభివృద్ధి పంపిణీ, సామాజిక న్యాయం కేంద్రంగా చేసుకొని గ్రామీణాభివృద్ధి ప్రక్రియతో సాంకేతిక విజ్ఞాన అంతరాన్ని (టెక్నాలాజికల్ నాలెడ్జ్ గ్యాప్) పూరించి, సాంకేతిక విజ్ఞాన తరలింపు అనేదే ప్రధానమైన పరిష్కార మార్గంగా భావించాలి. ఈ వ్యాసంలో మొత్తం ఐదు భాగాలుగా విభజించడం జరిగింది. పార్ట్-1 లో టెక్నాలజీ ప్రాధాన్యత బదిలి, పార్ట్-2 లో హరిత విప్లవం, వ్యవసాయ యాంత్రీకరణ, పార్ట్-3 లో ప్రపంచ దేశాలలో వ్యవసాయ పరిశోధనలు, విస్తరణ, ప్రైవేటీకరణ, శిక్షణ, క్షేత్రస్థాయి పద్ధతి, పార్ట్-4 శ్వేత విప్లవం, బయోటెక్నాలజీ విప్లవం, పార్ట్-5 లో విమర్శనాత్మక పరిశీలన, ముగింపు.

### పార్ట్-1

### టెక్నాలజీ ప్రాధాన్యత బదిలి

గత 50 ఏళ్ల కాలాన్ని వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన అంశాలు, ప్రధానంగా టెక్నాలజీ బదిలీ సమాజాభివృద్ధి కార్యక్రమాలు, జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాలు, హరితవిప్లవ టెక్నాలజీ నమూనాలు, పేదరిక నిర్మూలనా వ్యూహాలు, శిక్షణ, క్షేత్రస్థాయి సందర్శన విధానం, శ్వేత విప్లవం (పాల ఉత్పత్తిలో) టెక్నాలజీ నమూనా, బయో-టెక్నాలజీ నమూనా, సరళీకృత వ్యూహం మొదలుగు అంశాలు వివిధ సామాజిక వర్గాల ప్రజలపై, ఆర్థికాభివృద్ధి పై ప్రభావం చూపుతున్న విషయ విశ్లేషణ చేయడం ఎంతో అవసరం.

సాంకేతిక అంశాల ఆధారంగా ప్రపంచ దేశాలను మూడు భాగాలుగా విభజించవచ్చని 'ఎకనామిస్ట్' పత్రికలో ప్రచురితమైన పరిశోధన వ్యాసంలో పేర్కొనబడిన అంశాలు ఏమిటనగా :

- విజ్ఞానాన్ని, సాంకేతికతను సృష్టించి వాటిని ఉపయోగించుకోవడం, తెలిపిన అత్యంత సంపన్నదేశాలు మొదటి తరహాకు చెందుతాయి. అమెరికా, రష్యా, జపాన్, జర్మనీ, చైనా మొదలగు దేశాలు సాంకేతిక విజ్ఞానాన్ని సాంకేతికతను కనుగొన్న దేశాలకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఈ దేశాల్లో పేద ప్రజల శాతం నామ మాత్రంగా ఉంటుంది.
- రెండో తరహాదేశాలు, శాస్త్రీయ పరిజ్ఞాన్నాన్ని, సాంకేతిక అంశాలను స్వతహాగా సృష్టించడం తెలియకపోయినా వాటిని ఎలా ఉపయోగించుకోవాలన్నది తెలిసిన దేశాలు. అభివృద్ధి చెందడం కోసం ఇలాంటి దేశాలు సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకొంటూ ఉంటాయి. తూర్పు, మధ్య, ఐరోపా దేశాలు, భారత దేశంలో సగభాగం ఉదాహరణగా చెప్పుకోవచ్చు.
- సాంకేతిక పరిజ్ఞానాన్ని సృష్టించడం గానీ, దానిని ఉపయోగించడం గానీ తెలియని దేశాలు మూడో తరహాకు చెందినవి. ఇవి అత్యంత పేద దేశాలు, ఆఫ్రికాలోని అనేక దేశాలు, భారతదేశంలోని (ఉత్తర, తూర్పు ప్రాంతాలు) ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఈ తరహా దేశాల్లో అధిక జనాభా, పేదరికం, నిరుద్యోగం, తక్కువ స్థాయి జీవన ప్రమాణాలు వంటి అనేక అసమానతలు కలిగి ఉంటాయి. ఈ అంశాలన్నీ దేశసుస్థిరతకు, అభివృద్ధికీ అవరోధంగా నిలుస్తాయి.

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన ఈ ఐదున్నర దశాబ్దాల కాలంలో శాస్త్ర సాంకేతిక రంగాల్లో దేశం గణనీయమైన ప్రగతిని సాధించింది. 1947 సంవత్సరంలో శాస్త్ర సాంకేతిక మౌలిక వసతుల విలువ కేవలం కోటి రూపాయలు కాగా ఇపుడది, మూడు వేల కోట్ల డాలర్లకు చేరింది. అణు, అంతరిక్ష ఎలక్ట్రానిక్స్, రక్షణ రంగాల్లో ప్రగతి సాధించింది. దేశ సామాజిక, ఆర్థికాభివృద్ధిలో శాస్త్ర సాంకేతిక రంగాలు కీలక భాగాలుగా మారాయి. శాస్త్ర సాంకేతిక రంగాల అభివృద్ధికి, సమాజ పరివర్తనకు ఒక సాధనంగా ఉపయోగించుకోవడం కోసం భారత దేశ విశిష్టత, వ్యవసాయం, పరిశ్రమలు, సేవారంగాల్లో శాస్త్ర సాంకేతిక రంగాల ప్రగతిని సమర్థవంతంగా వినియోగించుకుంటున్నారు. ఉత్పాదక పెంపునకు, ప్రజల జీవన ప్రమాణాల పెరుగుదలకు ఒక సాధనంగా ఈ ప్రగతిని వినియోగిస్తున్నారు.

భారత ప్రభుత్వంలో సైన్స్ అండ్ టెక్నాలజీ కార్యకలాపాలు వివిధ స్థాయిల్లో పలు యాజమాన్యాల కింద కొనసాగుతున్నాయి.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఆద్వర్యంలో ఈ పరిశోధన సంస్థలు లాభాపేక్ష లేనివిగా వివిధ పరిశోధన కార్యకలాపాలను నిర్వహిస్తున్నాయి. అవి ఏమనగా, కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చ్,

ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసెర్చ్, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్ మొదలగునవి. ఇవే కాకుండా వివిధ మంత్రిత్వ శాఖలు, ప్రయోగశాలలు కూడా శాస్త్ర సాంకేతిక అభివృద్ధికి పాటు పడుతున్నాయి.

శాస్త్ర–సాంకేతిక భావాలు, సాధనాలు మనిషి మార్పును కోరుకునే వాతావరణానికి సహాయపడతాయి. సైన్సు అనేది విజ్ఞానం యొక్క సంచయనానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. టెక్నాలజీ అనేది టూల్స్‌లో రిఫైన్‌మెంటుకు ప్రాతినిధ్యం వహిస్తుంది. గత 200 సంవత్సరాలలో మానవ జీవితం యొక్క నాణ్యతను ఎంతో ప్రగతి కావించేందుకు శాస్త్ర–సాంకేతిక విజ్ఞానం సహాయం చేస్తుంది. ప్రధానంగా శీఘ్రగతిన ఆర్థిక ప్రగతికి, వ్యవసాయాభివృద్ధికి, పారిశ్రామిక, రవాణా రంగాల్లో, ఇతర ఆర్థిక, ఆర్థికేతర కార్యకలాపాల్లో అత్యవసరంగా మారింది.

శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానంలో మారుతున్న ధోరణులకనుగుణంగా నూతన విజ్ఞానం, నూతన టెక్నాలజీని ఉపయోగిస్తూ అనేక దేశాలు ముఖ్యంగా అమెరికా, రష్యా, జర్మనీ, జపాన్, మొదలగు దేశాలు బ్రహ్మాండమైన ఆర్థిక ప్రగతిలో అనుభవాన్ని కలిగి ఉన్నాయి. హరిత విప్లవంతో వ్యవసాయంలో అనేక మార్పులు ప్రవేశపెట్టి ప్రజల మౌలిక అవసరాల్లో, వారి నాణ్యమైన జీవన శైలిని మెరుగుపరిచింది.

**శాస్త్ర సాంకేతిక విధాన లక్ష్యాలు**

- స్వచ్ఛమైన అనుబంధమైన విద్యా విషయాల్లో సమతుల్యమైన, సామర్థ్యపు సాధనాలతో శాస్త్ర సాంకేతిక పరిశోధనకు అభివృద్ధి పర్చడం.
- జాతి నిర్మాణంలో శాస్త్రవేత్తల నాణ్యమైన పరిశోధనా ఫలితాలను గుర్తించి దేశాభివృద్ధిలో భాగస్వామ్యం చేయడం.
- దేశ అవసరాల కనుగుణంగా సాంకేతిక సిబ్బందికి రక్షణ, పరిశ్రమ, వ్యవసాయ, సైన్సు అండ్ ఎడ్యుకేషనల్ విషయాల్లో శిక్షణా కార్యక్రమాలకు ప్రోత్సాహం, చొరవతో అన్ని స్థాయిల్లో కార్యక్రమాలను వేగవంతం చేయడం.
- దేశ ప్రజలందరికి శాస్త్రీయ విజ్ఞాన పరమైన అన్ని రకాల ప్రయోజనాలను అందించాలి.

పైన పేర్కొనబడిన శాస్త్ర సాంకేతిక విధాన ప్రకటనా లక్ష్యాల కనుగుణంగా భారత ప్రభుత్వం 1983 సంవత్సరంలో టెక్నాలజీ విధానాన్ని ప్రకటించింది.

**ప్రధాన విధాన ప్రకటనా లక్ష్యాలు**

- దేశీయమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని వృద్ధి చేసుకోవడం.
- దిగుమతి చేసుకున్న టెక్నాలజీని అందుబాటులో ఉన్న వనరులను బట్టి జాతీయ ప్రాధాన్యత కనుగుణంగా దత్తత చేసుకొని సొంతం చేసుకోవడం అనే లక్ష్యంతో రూపొందించుకోవడం.
- స్వయం సంవృద్ధితో సాంకేతిక రంగాల్లో ఎదురయ్యే పోటీని తట్టుకుని నిలబడడం.
- కీలక రంగాల్లో ముఖ్యంగా రక్షణ, పరిశ్రమ, వ్యవసాయం, విజ్ఞాన విద్యావిషయాల్లో వ్యూహాత్మకంగా ఎదురుదెబ్బలను తట్టుకోవడం.
- దేశీయ వనరులను సాధ్యమైనమేర వినియోగంలోకి తీసుకురావడం.
- సంప్రదాయ నైపుణ్యాన్ని, సామర్థ్యాన్ని వాణిజ్యపరంగా పోటీని తట్టుకునేట్టు చేయడం, దేశీయమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని, నైపుణ్యాన్ని వెలుగులోకి తేవడానికి, సాంకేతిక రంగాలలో దేశాన్ని స్వయం సంవృద్ధి చేయడం.

పైన పేర్కొనబడిన విధాన ప్రకటన లక్ష్యాలను ప్రధానంగా వ్యవసాయ రంగంలో ఉత్పాదకతను పెంపొందించేందుకు వ్యవసాయ విద్య, పరిశోధన, విస్తరణల్లో శిల్ప పద్ధతులను అభివృద్ధి పరచడం, కొత్త విత్తనాలు, వంగడాలను కనుగొని వాటి వినియోగ, పురుగుమందుల వాడకం నియంత్రణ మొదలగు విషయాల్లో జాగ్రత్తలు సూచించడం, సాగునీటి యాజమాన్య పద్ధతుల్లో రివర్ వ్యాలీ ప్రాజెక్టులు, వాటి కార్యకలాపాల్లో పరిశోధన, దర్యాప్తు సంబంధిత అంశాలను గరిష్ట స్థాయిలో ఉపయోగంలోకి తేవడం.

**చారిత్రకంగా వ్యవసాయం – టెక్నాలజీ బదిలీ**

పూర్వ కాలంనుండి భారత సమాజంలో ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయం ఒక ప్రత్యేక స్థానం కలిగివుండి, గ్రామీణ ప్రజల జీవితాలతో సన్నిహిత సంబంధాన్ని కలిగి ఉంది. ఒక జీవనాధార వృత్తిగా జీవన విధానంగానే కాక వ్యవసాయం మన ప్రజల సామూహిక జీవనానికి పునాది కూడా. వ్యవసాయం, కుటీర పరిశ్రమలు, చేతివృత్తుల మధ్యన ఉండే సన్నిహిత సంబంధం, భూమిపై సామూహిక ఆధిపత్యం ఈ సామూహిక జీవనాన్ని బలోపేతం చేయడమే కాకుండా, గ్రామ ప్రజలకు కావలసిన తిండి, బట్ట, ఇల్లు ఇతర వస్తువులను ఉత్పత్తి చేసుకొంటూ స్వయం సంవృద్ధిని చేకూర్చేవి.

బ్రిటిష్ పరిపాలనాకాలంలో మన వ్యవసాయ రంగంలో ప్రముఖమైన మార్పులు వచ్చినాయి. భూస్వామ్య సంబంధాలు, అప్పటికే కొన్ని దశాబ్దాలుగా కొంత వరకు వృద్ధి చెందినా కూడా బ్రిటిష్ వారు తమ పాలనా ప్రయోజనాల కొరకు ఒక సాధారణ వ్యవస్థగా భూస్వామ్యాన్ని మన దేశంలో చట్టపరంగా స్థాపించారు. ఫలితంగా, సామూహిక ఆధిపత్యం, గ్రామ కమిటీల పర్యవేక్షణలో ఉండే వ్యవసాయ భూములు చాలా వరకు రాచరిక కుటుంబాలు, జమీందార్లు, భూస్వాముల యాజమాన్యంలోకి వెళ్ళిపోయినాయి. దీంతో కొద్దిమంది భూస్వాముల వద్ద భూ కేంద్రీకరణ జరిగి, అనేక మంది సాగుచేసే ప్రజలకు భూమిలేక కౌలుదార్లుగా మారినారు. భూమిలేని నిరుపేదలు పేదరికంలోకి నెట్టివేయబడ్డారు. పై చారిత్రక క్రమం ద్వారా మన దేశంలోనూ లక్షలాది చిన్న సన్నకారు రైతులు, మధ్యతరగతి రైతులతో కూడిన రైతాంగ వ్యవసాయం (పీసంట్ అగ్రికల్చర్) ఏర్పడింది.

పై నేపథ్యాన్ని దృష్టిలో ఉంచుకొని స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వం నూతన సవాళ్లను ఎదుర్కొనేందుకు ముఖ్యంగా గ్రామీణ ప్రజల జీవన పరిస్థితులను మెరుగు పర్చేందుకు, పేదరిక నిరుద్యోగ నిర్మూలన, సామాజిక ఆర్థిక అసమానతలు, ఆహార ధాన్యాల కొరత, తక్కువ స్థాయిలో సాంకేతికతలను ఉపయోగించడం మొదలగు అనేక సామాజిక, ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలను ప్రవేశపెట్టింది. వీటితో పాటు గ్రామీణ పారిశ్రామిక, వ్యవసాయాభివృద్ధి కొరకు టెక్నాలజీని బదిలీ చేయాలనీ ప్రయత్నం చేశారు.

మరో వైపు అనేక మంది పాశ్చాత్య శాస్త్రవేత్తలు, రెండవ ప్రపంచ యుద్ధానంతరం అభివృద్ధి చెందుతున్న దేశాల్లో సాంప్రదాయ వ్యవసాయ పద్ధతుల్లో అనేకమైన శాస్త్ర సాంకేతిక విజ్ఞా విషయాల్లో పరిశోధనా ఫలితాలను అందించారు. దీనికి తోడు అనేక పరిశోధన సంస్థలు, విద్యావేత్తలు, రచయితలు టెక్నాలజీ యొక్క ఆవశ్యకతను తెలియపర్చారు.

యూరోపియన్ దేశాలు, అమెరికా సంయుక్త రాష్ట్రాల మద్దతుతో మూడవ ప్రపంచ దేశాలలో అనేకమైన పరిశోధన సంస్థలు, వ్యవస్థలను

నెలకొల్పడం జరిగింది. మొదట్లో ప్రైవేటు, ద్వైపాక్షిక సంస్థల సహాయం, అటు తర్వాత బహుళార్థక సహాయ సహకారాలను అందించినాయి. పైన పేర్కొనబడిన దేశాల సహాయంతో 19వ శతాబ్దంలో మూడవ ప్రపంచ దేశాల్లో వ్యవసాయాభివృద్ధిలో అనేకమైన ప్రభావిత అంశాలు చోటు చేసుకున్నాయి. ముఖ్యంగా భారతదేశంలో ఇదే సమయంలో (1950) లో సమాజాభివృద్ధి, జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాల్లోను ఆధునిక టెక్నాలజీ బదిలీ, వ్యవసాయాభివృద్ధి కొరకు అమెరికా సంయుక్త రాష్ట్రాలు సహాయ, సలహాలను అందించినాయి. 1950-60 మధ్యకాలంలో అనేక నూతన పంటల విధానాలను, విత్తనాలను ప్రవేశపెట్టడం జరిగింది. ముఖ్యంగా సెంట్రల్ అమెరికా, తూర్పు ఆఫ్రికా దేశాల్లో పలు ఎరువుల రకాలు, తూర్పు ఆసియాలో వరి రకాలు, నార్తరన్ మెక్సికో, పంజాబ్ ప్రాంతాల్లో (ఇండియా), పాకిస్తాన్ ప్రాంతాల్లో అనేకమైన కొత్త వంగడాలను ప్రవేశపెట్టడంతో ప్రపంచ ఆహార సమస్యకు కొంత మేరకు పరిష్కార మార్గం కనుగొన్నవారైనారు.

**పార్ట్ 2**

**హరితవిప్లవం - టెక్నాలజీ**

మొదటి విడత భూ సంస్కరణల వైఫల్యం తర్వాత ప్రత్యామ్నాయం కోసం వెదుకుతున్న కేంద్ర ప్రభుత్వానికి నూతన సాంకేతిక పద్ధతులతో కూడిన ఒక వ్యవసాయక వ్యూహం కనిపించింది. అధిక దిగుబడి వంగడాలు, రసాయనిక ఎరువులు, క్రిమిసంహారక మందులు, నీటి పారుదల యంత్రాలతో కూడిన వ్యూహం వల్ల దిగుబడులు ఉత్పత్తి పెరగడంతో దీన్ని హరితవిప్లవం అన్నారు. ఇది మొదట పంజాబ్, హర్యానా, తమిళనాడు వంటి రాష్ట్రాల్లో వరి పంటలో వచ్చింది. అటు తర్వాత క్రమంగా అన్ని పంటల్లో సంకర విత్తనాలు వచ్చాయి. దాంతో వ్యవసాయం బాగా వ్యాపారీకరించబడింది. ఉత్పత్తులు, ఆదాయాలు పెరగడం వల్ల హరిత విప్లవ ప్రభావం ఉత్పత్తి సంబంధాలపై కూడా పడి నీటి పారుదల ఉన్న ప్రాంతాల్లో పెట్టుబడిదారీ సంబంధాలు వృద్ధి చెంది, అధిక మిగులును పొందే పెట్టుబడిదారీ వర్గం ఏర్పడిందని అశోక్‌రుద్రా, ఉత్సాపట్నాయక్, రంజిత్‌సావు, ప్రణబ్‌బర్ధన్ మొదలగు ఆర్థిక శాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు. వర్గ సంబంధాల మార్పుతో కొత్తగా ఏర్పడ్డ వర్గాలు, కులాలు, కలగలిపి ఉన్నాయని జోన్ మెంచర్, ప్రధాన్‌ప్రసాద్ వంటి ఆర్థిక వేత్తలన్నారు. అయితే, హరిత విప్లవం వల్ల వచ్చిన కొద్దిపాటి పెట్టుబడిదారీ అభివృద్ధి ప్రభావం వల్లెనే వర్గ అసమానతలు - రైతులకు వ్యవసాయకూలీలకు మధ్యన, అలాగే, ధనికరైతులకు, చిన్న రైతులకు మధ్యన. అలాగే ప్రాంతీయ అసమానతలు, నీటి పారుదలవున్న ప్రాంతాలకూ, వర్షాధార ప్రాంతాలకూ మధ్యన పెరిగిపోయినాయని సి.ఎచ్. హనుమంతరావు (1975), జి.ఎల్. భల్లా (1979), ఫ్రాన్సిస్ ఫ్రాంకెత్ (1971), కేత్ గ్రిఫిన్‌ల విశ్లేషణల్లో తేలింది.

హరితవిప్లవం భూమి వినియోగంలో ఎన్నో మార్పులను తెచ్చింది. పెట్టుబడులు పెద్దగా అవసరమయ్యే సాంకేతిక అంశాలు, గిట్టుబాటు కాగల అధిక ఆదాయం వల్ల భూ పంపకం, యాజమాన్య హక్కులలో ఎన్నో మార్పులు వచ్చాయి. హరిత విప్లవం ఆహారధాన్యాల కొరత తీర్చినప్పటికీ, హరిత విప్లవం ప్రాంతాల్లో ఎరువులు, సస్యరక్షణ మందులు ఎక్కువగా వాడటం వల్ల, ఒకే పంటను పలుమార్లు వేయటం వల్ల భూమి యొక్క ఉత్పాదకశక్తి క్షీణించిందని ఇటీవల గమనించబడింది. ఈ క్షీణత 1990 వ దశకంలో సరళీకరణ విధానాలు చేపట్టిన తర్వాత మరింత వేగంగా కొనసాగింది. ఈ క్షీణతను అరికట్టకపోతే వాతావరణ సమతుల్యత దెబ్బతినడమే కాక, ఆహార భద్రత కూడా దెబ్బతినే ప్రమాదం ఉంది. భూమి మీద జనాభా వత్తిడి పెరుగుతున్న కొలది, ఉత్పత్తి ఖర్చులు, భూమి ఉత్పాదకతను కాపాడటానికి అయ్యే ఖర్చులు బాగా పెరుగుతున్నాయి. అయితే, చౌకగా లభ్యమయ్యే శ్రమజీవులు, ట్రాక్టర్ సాగు, నీరు, ఎరువులు మొదలగు సాంకేతిక సౌకర్యాల లభ్యత వల్ల పై యాజమాన్యపు ఖర్చులు తగ్గవచ్చు. భూమి క్షీణత ప్రధానంగా నేలకోత రూపంలో నీటి ద్వారా జరుగుతుంది. వరదలు, వర్షపు నీటివల్ల నేలకోత, అశాస్త్రీయ నీటి వాడకం వల్ల సాగునేల క్షీణిస్తుంది. పారిశ్రామిక కాలుష్యం కూడా నేల ఉత్పాదకత శక్తిని తగ్గిస్తుంది. సేద్యంలో వాడే వివిధ రసాయనాల వల్ల (ఎరువులు, సస్యరక్షణ మందులు, కలుపు మందులు) కూడా నేల ఉత్పాదకత శక్తి తగ్గుతుంది. పంజాబ్, హర్యానా రాష్ట్రాల్లో ఎరువులు, సస్యరక్షణ, కలుపు మందులు అధికంగా వాడటం వల్ల నేలలు క్షీణిస్తున్నాయి. గాలి, తుఫానుల వల్ల కూడా కొంత మేర నేల క్షీణిస్తుంది.

**వ్యవసాయ యాంత్రీకరణ**

ప్రపంచ మార్కెట్‌లో పోటీ పడాలనే పేరుతో వ్యవసాయరంగాన్ని పెద్ద ఎత్తున యాంత్రీకరించ బూనడం దురదృష్టకరం. ఒక పక్క అభివృద్ధి చెందిన దేశాలు మన దేశంలో కారు చౌకగా లభించే కార్మిక శక్తిని ఉపయోగించుకునే ప్రయత్నంలో ఉంటే, మనం మాత్రం ఉత్పత్తి రంగాన్నుండి కార్మికులను తొలగించే యాంత్రీకరణ పద్ధతుల్లోను అవలంభించడం శోచనీయం. పోటీ పడగల శక్తి మనకున్న తరగని శ్రామిక శక్తిలోనే ఉంది. అలా కాకుండా, యాంత్రీకరణను పెంచితే ట్రాన్స్ ప్లాంటర్లు, రీపర్లు, డికార్టికేటర్లు, షెల్లర్లు లోతుగా దున్నే యంత్రాలు వగైరా ఉత్పత్తి ఖర్చులు పెరుగుతాయి. దాని వలన లాభపడేది వ్యవసాయ యంత్రాల ద్వారా వ్యాపారం చేసే బహుళజాతి కంపెనీ (ఎం.ఎన్.సి.లు) లే. ఆ టెక్నాలజీ మన దేశంలో లేదు. కాబట్టి, మన పెట్టుబడీదార్లకు కూడా దీనివల్ల ప్రయోజనమేమి ఉండదు (ప్రొ. కె.ఆర్. చౌదరి, డా. ఎ. ప్రసాదరావు - 2000)

90వ దశకంలో ఉద్యోగ అవకాశాలు బాగా తగ్గిపోయాయి. (దేవ్, 2000) ముఖ్యంగా ఈ మధ్య కాలంలో గ్రామ సీమల్లో కూలీల సంఖ్య విపరీతంగా పెరిగిపోతూ ఉంది. (నాగరాజన్, పట్నాయక్ 1999) దీనికి తోడు ఇదే కాలంలో పని వేతనాల పెరుగుదల రేటు కూడా పడిపోతూ ఉంది. (దేవ్ 2000). దాంతో వ్యవసాయరంగంలో మార్జినలైజేషన్ వస్తుందా అని భయపడుతున్నారు (రావు, హనుమంతప్ప 1999). ఈ క్రమాన్ని సరిచేయన్ని అట్టడుగు జనానికి ఉపయోగపడే వ్యవస్థాగత మార్పులు తేవాలి. దానికి తోడు యాంత్రీకరణను అభివృద్ధి చేసే విధానం మనకెన్నడూ లేదు. డిమాండును బట్టి ట్రాక్టర్లు, త్రేషర్లు, కంబైన్స్ వాడుతున్నారు. గత రెండు దశాబ్దాల నండి పంజాబ్‌లో రైతులు త్రెషర్లు, హార్వెస్టు కంబైన్లు వాడుతూ ఉంటే, మిగతా రాష్ట్రాలు ట్రాక్టర్ల వాడకాన్ని దాటి పోలేదు. కారణం ? అవసరమైనంత కారు చౌకగా దొరికే కూలీలు ఉన్నారు. వారి స్థానంలో యంత్రాలను వాడడం గిట్టుబాటు కాదు. లాభాలు పెంచుకోవడానికి యాంత్రీకరణ తోడ్పడుతుందని రైతులే భావించనపుడు, ఆధునిక పనిముట్లు వాడకంతో వ్యవసాయ రంగాన్ని మనమెట్లా ప్రపంచ పోటీలో నిలబెట్టగలం? దానికి తోడు ఈ పనిముట్లన్న కూలీలను తొలగించేవే కాబట్టి మనకున్న ఏకైక మార్గం సబ్సిడీలను పెంచడం. ఆ సబ్సిడీలు కూడా రైతాంగాని కంటే పెట్టుబడిదార్లకే ఎక్కువగా ఉపయోగపడతాయి.

*(మిగతా వచ్చే సంచికలో)*

# అమిత్ భాదురి - గౌరవ ప్రదమైన అభివృద్ధి

- ఆర్.ఎస్. రావు

**భా**రత ఆర్థిక వ్యవస్థ పనితీరు పైనా, ప్రభుత్వం ఇక ముందు తీసుకు రానున్న మార్పుల దిశపైనా ఆసక్తి చాల పెరుగుతోంది. వ్యవసాయేతర రంగాలలో ఇటీవలి కాలంలో కనబడిన హెచ్చుస్థాయి పెరుగుదల ఆర్థిక సంస్కరణల మీద దృష్టి ఉన్న ప్రభుత్వానికి ప్రోత్సాహకరంగా ఉంది. ఆ ప్రోత్సాహంతో అది కొత్త రంగాలలో సంస్కరణలు అమలు చేయడానికి ప్రయత్నిస్తోంది. అంతర్జాతీయ ద్రవ్య రంగంలో పూర్తి కన్వర్టబిలిటీని అనుమతించడం విషయంలో ప్రభుత్వం కొంత ఆలోచనలో ఉంది గాని, వ్యాపారం, ద్రవ్యరంగం, సేవారంగం, ఉత్పత్తి రంగాలలో అంతర్జాతీయ పెట్టుబడి ప్రవేశానికి తలుపులు బార్లా తెరిచే ఉన్నాయి. అంతర్గతంగా కూడా, మరీ ముఖ్యంగా వ్యవసాయరంగంలో, వ్యవసాయ-సంబంధిత వ్యాపారంలో ఆర్థిక సంస్కరణలకు మార్గం సుగమంగా ఉంది.

సంస్కరణలను సమర్థించే, సమర్థించని మేధావులందరూ కూడ అనేక కారణాల వల్ల వ్యవసాయ రంగం మీద దృష్టి కేంద్రీకరిస్తున్నారు. ప్రభుత్వరంగ పెట్టుబడులు తగ్గినందువల్ల, తత్ఫలితంగా ప్రైవేటు పెట్టుబడులు కూడా తగ్గినందువల్ల సంస్కరణల కాలంలో వ్యవసాయ రంగంలో పెరుగుదల కనబడలేదు. విస్తరణ సేవల, మార్కెటింగ్ సౌకర్యాలు, పరపతి సౌకర్యాలు ప్రభుత్వరంగం నుంచి ప్రైవేట్ రంగానికి మారిపోయినందు వల్ల కూడ రైతాంగంలో అనిశ్చిత పరిస్థితులు తలెత్తాయి. ఈ అనిశ్చిత స్థితి మరీ తీవ్రంగా మారినప్పుడు రైతాంగం ఆత్మహత్యల వంటి చర్యలకు పూనుకుంటోంది. లేదా మార్కెట్ నుంచి పక్కకు తప్పుకుని కేవలం సొంత వినియోగం కోసమే ఉత్పత్తి చేస్తోంది. ఒక రకంగా రైతాంగానికి ఆహారభద్రతనిచ్చే బీమా సౌకర్యంగా ఇది పని చేస్తోంది. దీనిక తోడు, విశాల వ్యవసాయ క్షేత్రాలు రక్షిత నీటి పారుదల వ్యవస్థలకు బైట ఉన్నందు వల్ల, వ్యవసాయ రంగం ఎక్కువగా ప్రకృతి మీదనే ఆధారపడవలసి వస్తోంది. అంటే వ్యవసాయ రంగపు అస్థిరత్వానికి ప్రకృతి కూడ దోహదం చేస్తోంది. హరిత విప్లవ కాలంలో రక్షిత నీటి పారుదల సౌకర్యం ఏర్పడి, వ్యవసాయరంగంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ప్రవేశించిన చోట ఎక్కువ శక్తినీ, ఎక్కువ ఎరువులనూ ఉపయోగించే పంటలు పర్యావరణ సంక్షోభానికి దారితీస్తున్నాయి. వ్యవసాయరంగంలో వృద్ధి వెనుకపట్టు పట్టడంతో, ఆ వృద్ధి సహాయంతో దారిద్ర్యాన్ని తగ్గించాలనే ప్రయత్నాలు కూడా వెనుక పట్టు పడుతున్నాయి. అందువల్ల వ్యవస్థలో పేదరికం సమస్య మరింత తీవ్రమవుతోంది. ఈ సమస్యనే చాలమంది వ్యవసాయ సంక్షోభంగా అభివృద్ధి వర్ణిస్తున్నారు. రైతాంగ సంక్షేమానికి తీసుకోవలసిన చర్యలను సూచించడం కోసం ప్రభుత్వం కేంద్రంలో స్వామినాథన్ కమిటీనీ, ఆంధ్రప్రదేశ్‌లో జయతీ ఘోష్ కమీషన్ కూడ నియమించింది.

ప్రభుత్వం తన విధానాలు రూపొందించేటప్పుడు ఉత్పత్తి విధానంలో సంక్షోభం కొనసాగింపుతో పాటుగా, నక్సలైట్ ఉద్యమ ఉనికిని కూడా పరిగణలోకి తీసుకుంటుంది. వ్యవసాయ రంగంలో స్థిరమైన అభివృద్ధి పథంలో పయనించక పోవడానికి వ్యవస్థాగత కారణాలే ఆటంకమని నక్సలైటు ఉద్యమం భావిస్తుంది. వ్యవస్థాగత పరివర్తన కోసం నక్సలైటు ఉద్యమం ప్రత్యామ్నాయ రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక చట్రాన్ని ప్రతిపాదిస్తుంది. దాని స్వభావం వల్ల ఆ ఉద్యమం శాంతిభద్రతల సమస్యలను కూడ లేవనెత్తుతుంది. హింసాత్మక పరిణామాలు అభివృద్ధి రాహిత్యానికి ఫలితాలుగా రాజ్యం చూసినప్పటికీ, అవి వ్యవసాయ సంక్షోభపు నాణానికి మరో ముఖమే. అందరూ మరిచిపోయిన భూ సంస్కరణల కార్యక్రమాన్ని పునరుద్ధరించడానికి ఇటీవల జరుగుతున్న ప్రయత్నాలు నక్సలైటు చట్రం లేవనెత్తిన సమస్య తీవ్రంగా పరిశీలనలో ఉన్నదనడానికి సూచనే.

వ్యవసాయ సంక్షోభాన్ని పరిష్కరించడానికి రెండు విధాన పరమైన ప్రయత్నాలు చలామణీతో ఉన్నాయి. మొదటి ప్రయత్నం ఆ రంగంలో పెట్టుబడి ఆధారిత వృద్ధిని సాధించడం. వ్యవసాయ రంగంలో చిన్న రైతులు ప్రధఆన స్థానంలో ఉన్నారు గనుక, ఈ వృద్ధికి అవసరమైన పెట్టుబడులు నీటిపారుదల సౌకర్యాల కల్పన వంటి పనుల ద్వారా రాజ్యం వైపు నుంచయినా రావాలి. లేదా జాతీయ, అంతర్జాతీయ ప్రైవేటు రంగపు కార్పొరేటు పెట్టుబడి రూపంలో నయినా రావాలి. దీనిలో ఒక పద్ధతి కార్పొరేట్ వ్యవసాయాన్ని ప్రోత్సహించడం (దానికే ఒక స్వల్ప స్థాయి ఉదాహరణ కుప్పం ప్రయోగం). రెండో పద్ధతి కాంట్రాక్టు వ్యవసాయాన్ని ప్రోత్సహించడం. ప్రత్యక్షంగా చిల్లర వ్యాపారంలోకి పరోక్షంగా మార్కెట్ అనుకూల పంటల విధానం ద్వారా వ్యవసాయ రంగంలోకి కార్పొరేట్ పెట్టుబడిని ఆహ్వానించడం.

రెండో విధానపరమైన ప్రయత్నం మెట్ట ప్రాంతాలలో పండించే పంటలను చేర్చిన రెండో హరిత విప్లవాన్నీ ప్రవేశపెట్టే అవకాశం ఉందా అని అన్వేషిస్తుంది. వరి, గోధుమలతో పాటు కొత్త పంటలలోకి నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని విస్తరించడం కొత్త పంటలపై అది కేంద్రికరిస్తుంది. సాంప్రదాయక విత్తన సాంస్కృతిక వ్యవస్థను మార్చివేసి జన్యుపరంగా మార్పులు చేసిన విత్తనాలను ప్రవేశపెట్టడం గురించి అది ఆలోచిస్తుంది. ఈ కొత్త వ్యూహాన్ని అమలు చేసే వ్యవస్థగా రాజ్యం మీద అది ఎక్కువగా ఆధారపడుతుంది. ఆర్థిక, సామాజిక మౌలిక సాధనా సంపత్తి సౌకర్యాలను, బహుశా సబ్సిడీలతో సహా, రాజ్యమే అందించాలని, చిన్న రైతుల ప్రాంతాలకు వల్ల అది ప్రధాన పాత్ర వహిస్తాయని ఈ ధోరణి భావిస్తుంది. స్వామినాథన్ కమిటీ, జయతీఘోష్ కమీషన్ స్థూలంగా ఈ సాంకేతిక మార్పే వృద్ధి సాధించే వ్యూహంగా భావించాయి.

ఈ నేపథ్యంలో అమిత్ భాదురి రచించిన 'గౌరవ ప్రదమైన అభివృద్ధి' అనే పుస్తకాన్ని నేషనల్ బుక్ ట్రస్టు ప్రచురించడం ఉపశమనం కలిగిస్తుంది. ఈ పుస్తకం భారత ఆర్థిక వ్యవస్థపైన సంస్కరణల ఆధారిత

విశ్లేషణ కన్న భిన్నమైన, ప్రత్యామ్నాయ విశ్లేషణను అందిస్తుంది. తొలుత ఇంగ్లిషులో ప్రచురితమైన ఈ పుస్తకానికి ఆర్.వి. రామారావు చేసిన తెలుగు అనువాదాన్ని కూడా ఎన్.బి.టి. 2006లో ప్రచురించింది. ఇంగ్లిషు, తెలుగు పుస్తకాలు రెండు కూడ రు. 45లకే లభ్యమవుతున్నాయి. పాపులర్ సోషల్‌సైన్స్ ప్రచురణలలో భాగంగా అచ్చయ్యాయి. పారిభాషిక పదజాలం లేకుండా రాసిన ఈ పుస్తకం చాలా వరకు సంక్లిష్ట అర్థశాస్త్ర క్రమాన్ని దాని సందర్భశుద్ధితో సమీక్షించడం ఈ సమీక్ష లక్ష్యం. ఈ పుస్తకం మూడు కారణాల వల్ల ముఖ్యమైనదవుతుంది. మొదటి కారణం దాని రచయిత, రెండవది ఆ పుస్తకంలో ముందుకు తెచ్చిన వాదన, మూడవది దాని విధాన సూత్రీకరణలు.

భాదురి ఒక సాంప్రదాయిక ఆర్థశాస్త్రవేత్త కాని ఆయనకు సాంప్రదాయికంగా ఉండకపోవడం వల్ల ఎక్కువ ఆసక్తి. 1960ల చివరిలో భారత వ్యవసాయ రంగం గురించి చర్చలో పాల్గొన్న ప్రముఖులలో ఆయన ఒకరు. ఆ చర్చ 'ఉత్పత్తి విధానం పై చర్చ' గా సుప్రసిద్ధమైనది. ఆ సందర్భంలో ఆయన రాసిన వ్యాసం 'అర్థ భూస్వామ్య విధానం కింద వ్యవసాయ వెనుకబాటుతనం – ఒక పరిశీలన' ఒక ప్రతిష్ఠాత్మక ఆర్థిక పత్రికలో ప్రచురితమయింది. వ్యవస్థ, భూస్వామి, వడ్డీ వ్యాపారి, వ్యాపారిల ఆధిపత్యం కింద ఉండడం వల్ల వ్యవసాయంలో కొత్తదనం కోసం అన్వేషన గాని, అందువ్ల కొత్త పెట్టుబడి గాని కరువయ్యాయని ఆ పత్రం వాదించింది. మార్క్సిస్టు విశ్లేషణగా చట్రం లోపల ఈ సూత్రీకరణ అర్థ భూస్వామ్య విధానం గురించి చాల చర్చకు దారి తీసింది. అది ప్రధాన స్రవంతి అర్థ శాస్త్రవేత్తలు కూడా, ముఖ్యంగా సంవిధాన పరంగానే వ్యక్తి వాదులయిన వాళ్లు కూడా – కొత్త పరిశోధనా కార్యక్రమాలు నిర్వచించుకోవడానికి కారణమయింది. ఆ పత్రంలోని వాదనలనే కొనసాగిస్తూ ఆయన 'వెనుకబడిన వ్యవసాయపు ఆర్థిక వ్యవస్థ' పేరుతో ఒక పుస్తకం రాశారు. ఆ పుస్తకం వెనుకబడిన వ్యవసాయంలోని మితిమీరిన వడ్డీ, రుణభారం సమస్యలను, బలవంతపు వాణిజ్య వ్యవసాయపు ఫలితాలను, భూపరాయీకరణను, పెట్టుబడి సంచయనాన్ని అర్థం చేసుకోవడానికి ఒక క్రమబద్ధమైన పరిశీలనా చట్రాన్ని అందజేసింది. ఒక నిర్దిష్ట వాస్తవికతను అర్థం చేసుకోవడంలో వ్యవస్థాత్మక అంశాలు అనే విశ్లేషణా సాధనాన్ని వినియోగించే ఆర్థిక శాస్త్రవేత్తలలో ఆయన ఒకరు. "వ్యవసాయ రంగ మార్పులకు పునాది వైరుధ్యమే తప్ప సమన్వయం కాదు" అని ఆ పుస్తకం వాదించింది. అందువల్ల ‘‘వ్యవసాయ సంస్కరణ విధానం వ్యవస్థాత్మక పరివర్తనను సాధించదలచినట్టయితే బలవంతపు వాణిజ్యానికీ, ఉత్పత్తిదాయకమైన సంచయనానికీ మధ్య ఘర్షణను సృష్టించాలి, వైరుధ్యాన్ని తీవ్రతరం చేయాలి" అని ఆ పుస్తకం సూచించింది.

అలా ఒక సాంప్రదాయిక అసాంప్రదాయిక వాదిగా భాదురి తన ఈ కొత్త పుస్తకం కథకి శీర్షికగా అభివృద్ధిని ఎంచుకున్నారు. అందులోనూ గౌరవప్రదమైన అభివృద్ధి అన్నారు. సాంప్రదాయికమైన మేధస్సుగాని, ఇప్పుడు చలామణీలో ఉన్న నినాదాలుగాని వృద్ధి, సమానతతో కలిసిన వృద్ధి, న్యాయబద్ధమైన పంపిణీతో కూడిన వృద్ధి, అందరినీ సంలీనం చేసుకునే వృద్ధి, వగైరా మాటలే మాట్లాడుతున్నాయి. వలసాధిపత్యం నుంచి బైటపడిన ఆర్థిక వ్యవస్థలు తలెత్తడంతో ఆర్థిక శాస్త్ర పదజాలంలోకి ప్రవేశించిన అభివృద్ధి అనే మాట కచ్చితమైన నిర్వచనానికి లొంగనిది. తమను వలసలుగా మార్చుకున్న ఆర్థిక వ్యవస్థలను అందుకోవాలనే కోరిక నుంచి పుట్టిన ఈ భావన అభివృద్ధి చర్చకు దారి తీసింది. వ్యవసాయరంగంలో మార్పులు తేవడానికి రాజ్యం గతంలో చేసిన ప్రయత్నాలు, ముఖ్యంగా మొదటి, రెండవ పంచవర్ష ప్రణాళికలలో జరిగిన ప్రయత్నాలు, పాత వ్యవస్థల స్థానంలో కొత్త వ్యవస్థలను ప్రవేశపెట్టడానికి తలపెట్టినవి. భూసంస్కరణ కార్యక్రమాలు, సహకార పరపతి వ్యవస్థ రూపకల్పన, వ్యవసాయోత్పత్తుల అమ్మకం, కొనుగోళ్లకు నియంత్రిత మార్కెట్ల ఏర్పాటు వంటి చర్యలు ఈ కొత్త వ్యవస్థలను సృష్టించాయి. అంతే వృద్ధికి పాత వ్యవస్థలు ఆటంకంగా ఉన్నాయని, వృద్ధికి సానుకూలం చేసే కొత్త వ్యవస్థలు కావాలని గుర్తించడం జరిగిందన్న మాట. అభివృద్ధి అంటే సాంప్రదాయిక ఆర్థిక సామాజిక వ్యవస్థలను పరివర్తన చెందించి వృద్ధిని ప్రోత్సహించే ఆధునిక వ్యవస్థలుగా మార్చడం, వ్యక్తుల చైతన్యాన్ని తదనుకూలంగా మార్చడం. మారిన ఆర్థిక సామాజిక వ్యవస్థ వ్యక్తి చైతన్యంలో మార్పు తేగలుగుతుందని ఆశించడం జరిగింది. ఆ క్రమం, వ్యక్తి చైతన్యం మారేక్రమం, ఆర్థిక వ్యక్తిలో ఒక గుణాత్మక మార్పుగా ఉంటుంది. ఆ మార్పు వ్యక్తి భౌతిక కార్యక్రమాలలో మార్పు గానూ, ఆర్థిక వ్యవస్థకు అవసరమైన వనరులను విలువ కట్టడంలో మార్పుగానూ ఉంటోంది. అటువంటి పరివర్తనా నిర్మాణాన్ని సామాజిక శాస్త్రవేత్తలు సాంప్రదాయికత నుంచి ఆధునికతకు మార్పుగా గుర్తిస్తారు. ఆర్థర్ లూయిస్, జోసెఫ్ స్టిగ్లిట్జ్ లాంటి అర్థశాస్త్రవేత్తలు కూడా ఆ మార్పును అదే పద్ధతిలో వ్యాఖ్యానిస్తారు. కాని ఒక రాజకీయార్థిక శాస్త్రవేత్తకు ఆ మార్పు భూస్వామ్య ఉత్పత్తి విధానం నుంచి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి మార్పుగా ఉంటుంది. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం నుంచి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానమంటే వనరులను వ్యక్తుల మధ్య పున:పంపిణీ చేయడంలో మార్కెట్లు ప్రధాన పాత్ర వహించే ఉత్పత్తి విధానం. తొలినాటి ప్రణాళికలలో అభివృద్ధి అనేది ఒక పరివర్తన క్రమంగా రాజ్యపు కర్తవ్యాలలో ఒకటిగా ఉండింది. కాని కాలం గడిచిన కొద్దీ, ఆ పరివర్తనా క్రమం పూర్తి కాకుండానే, అభివృద్ధి స్థానాన్ని వృద్ధి ఆక్రమించింది. రాజ్యం స్థానాన్ని మార్కెట్ ఆక్రమించింది. అటువంటి పూర్వరంగంలో మళ్లీ ఒకసారి భాదురి ప్రజా చర్చా వేదిక మీదికి అభివృద్ధి భావనను తీసుకురావడం సంతోషదాయకం.

భాదురి స్థూల ఆర్థిక శాస్త్రవేత్త. ఆయన ప్రామాణిక రాజకీయార్థిక శాస్త్రంలో గట్టి పునాదిలో స్థూల ఆర్థిక శాస్త్రం మీద ఒక అద్భుతమైన పాఠ్యపుస్తకం రాశారు. ప్రామాణిక రాజకీయార్థ శాస్త్రమంటే సరుకుల ఉత్పత్తి సాగిన కొద్దీ, ఆ సరుకులను మార్కెట్ తయారవుతూ, విస్తరిస్తూ ఉంటే, పెట్టుబడిదారీ భూమినే, శ్రమకూ, పెట్టుబడికీ కూడ మార్కెట్లు రూపొందుతూ ఉంటాయి. సరిగ్గా అది పౌరసమాజం రూపొందుతూ రాజ్యంతో తన శత్రుత్వాన్ని స్థిరపరచుకుంటూ ఉండిన కాలం. (పౌర సమాజం కూడ లోలోపల పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థతో కలిసే ఉంటుంది). అప్పుడు తలెత్తుతున్న పెట్టుబడి ఒకవైపు భూస్వామ్య ప్రభువర్గం తోనూ సమస్యలు ఎదుర్కొంది. మరొకవైపు సాంప్రదాయిక వడ్డీ వ్యాపార పెట్టుబడి తోనూ సమస్యలు ఎదుర్కొంది. ఆ సమస్యల

అధ్యయనమే రాజకీయార్థిక శాస్త్రం. ఆ సమయంలో అభివృద్ధి చెందుతుండిన మార్కెట్ నిర్మాణాలకు తమను తాము సవరించుకునే లక్షణాలుండేవి. అవి కొన్నిసార్లు అధికోత్పత్తి ద్వారానూ, మరి కొన్నసార్లు అల్పోత్పత్తి ద్వారానూ సవరించుకుంటూ ఆర్థిక వ్యవస్థలో ఊగిసలాటల వలయాలను సృష్టిస్తుండేవి. అంటే ఆర్థిక వ్యవస్థ ఒక్కోసారి పూర్తి ఉద్యోగ స్థాయికీ, ఒక్కోసారి తక్కువ ఉద్యోగ స్థాయికీ మధ్య ఊగిసలాడుతుంది. కాబట్టి పూర్తి ఉద్యోగ స్థాయిని సాధించడం ఎట్లా, దాన్ని నిలిపి ఉంచడమెట్లా అనే ప్రామాణిక రాజకీయార్థిక శాస్త్ర చర్చా విషయం అవుతుంది. అయితే ఈ మార్కెట్ స్వీయ సవరణా శక్తి, పూర్తి ఉద్యోగ స్థాయి సాధించే శక్తి సరళ ఉత్పత్తికి సంబంధించిన తొలి దశలో ఉంటునిది గాని, విస్తృత పునరుత్పత్తి దశలో, పెద్ద ఎత్తున సంచయనం జరిగేటప్పుడు ఆ శక్తి ఎప్పుడో మినహాయింపుగానే ఉంటొంది. ఈ దశలో పెట్టుబడి కేంద్రీకరణ పెరుగుతుంది. పెట్టుబడి ఉత్పాదక పెట్టుబడి, ద్రవ్య పెట్టుబడిగా చీలిపోయే దశ అది. ఈ దశలో మార్కెట్లో, ముఖ్యంగా శ్రమశక్తి మార్కెట్లు ఈ స్వీయసవరణా శక్తిని కోల్పోయాయి గనుక, సూక్ష్మ ఆర్థిక శాస్త్రం స్థానాన్ని కీన్స్ అర్థశాస్త్రం లేదా స్థూల అర్థశాస్త్రం చేజిక్కించుకుంది. స్థూల అర్థశాస్త్రపు లక్ష్యం ఆర్థిక వ్యవస్థను మొత్తంగా అధ్యయనం చేయడం. అది మొత్తం అన్నప్పుడు విడివిడి వ్యక్తిగత భాగాల సమ్మేళనం అని అర్థం చేసుకోదు. విడిభాగాలు ఒక సమస్య మొత్తంలో కలిసిపోయి ఏర్పడేదే అని అర్థం చేసుకుంటుంది. మామూలుగా ముక్కలన్నిటినీ కలిపితే మొత్తంలో తయారవుతుందనే తప్పుడు అభిప్రాయానికి ఇది మినహాయింపు. ఒక మొత్తంలోని ప్రతి ఒక్క ముక్క ఇతర ముక్కలతో సంబంధంలో ఉన్నదని గుర్తించినప్పుడు ప్రతి వ్యక్తిగత చర్యకూ ఉండే అనేక కోణాలను అర్థం చేసుకునే అవకాశం కలుగుతుంది. అప్పుడు ఆర్థిక కార్యకలాపాల్ని ఒక వలయాకారపు ప్రవాహంలో భాగంగా గుర్తించే వీలు కలుగుతుంది. అటువంటి పరిస్థితిలో ఒక వ్యక్తికి ఆదాయమయినది మరొక వ్యక్తికి ఖర్చు కావచ్చునని, ఒకరికి ఆదా అయినది మరొకరికి పెట్టుబడి కావచ్చునని, ఒకరికి వినియోగం అయినది మరొకరికి ఉత్పత్తి కావచ్చునని గుర్తించడానికి వీలు కలుగుతుంది.

ఒక ఆర్థిక వ్యవస్థలోని వ్యక్తులందరూ తమ ఉత్పత్తిని పెంచితే అది ధరల తగ్గుదలకు దారి తీసి ఉత్పత్తి విలువను రాబట్టలేని స్థితికి చేరుతుంది. అప్పుడిక మార్కెట్‌కు ఏ స్వీయ సంస్కరణ శక్తి ఉందని శుద్ధ మార్కెట్ వాదులు, సంస్కరణ వాదులు భావిస్తారో ఆ శక్తి నిజమయ్యే కల కాకుండా పోతుంది. అప్పుడు సమతూకాన్ని నిలిపి ఉంచడానికి రాజ్యపు జోక్యం అవసరం అవుతుంది. మార్కెట్‌ను సవరించడానికి గోతులు తవ్విపూడ్చమని రాజ్యానికి సలహా ఇచ్చే సుప్రసిద్ధ కీన్స్ వాద ఉదాహరణ ముందుకు వస్తుంది.

ఈ పుస్తకంలో భాదురి ఈ స్థల ఆర్థికశాస్త్ర దృక్పథాన్ని, ప్రామాణిక రాజకీయ అర్థ శాస్త్ర లక్ష్యాన్ని కలగలుపుతారు. అందువల్ల ఈ పుస్తకాన్నికి రెండు పరస్పర సంబంధం ఉన్నా లక్ష్యాలున్నాయి. రాజ్యం విస్తారంగా నమ్ముతున్న మార్కెటల్ భావజాలాన్ని సైద్ధాంతికంగా ఖండిస్తూ, ఆర్థిక వ్యవస్థ సమస్యకు ఒక ప్రత్యామ్నాయ పరిష్కారం చూపడానికి ఈ పుస్తకం ప్రయత్నిస్తుంది. ఇక మనం మన దృష్టిని రచయితేపై నుంచి పుస్తకం పైకి తిప్పుదాం.

స్వాతంత్ర్యానంతర కాలంలో అభివృద్ధి చెందిన రాజకీయ, ఆర్థిక వ్యవస్థల సలుచి ఈ పుస్తకం ఒక ఆసక్తిదాయకమైన వ్యాఖ్య చేస్తుంది. మతం, కులం, భాష, ఆర్థిక విషయాలలో ప్రజలలో బ్రహ్మాండమైన వైవిధ్యం ఉన్నప్పటికీ, గత ఆరు దశాబ్దాలలో రాజకీయ వ్యవస్థ మన జాతి రాజ్యాన్ని సుస్థిరంగా ఉంచడంలో విజయం సాధించింది. ఇది చరిత్రలో పోల్చడానికి వీలులేని విజయం. రచయిత మాటల్లో చెప్పాలంటే ఇది, మహాద్భుతమైన విజయం. మరొక వైపు, ఆర్థిక వ్యవస్థ పనితీరు అటు వంటి విజయాన్ని చవి చూడలేదు. దారిద్ర్య, అభాగ్యుల ఉనికి, నిరుద్యోగం వంటి సమస్యలు కొనసాగుతున్నాయి. కొంచెం వేరే రకంగా వ్యాఖ్యానం చెప్పాలంటే వివిధ రాజకీయ పార్టీ నిర్మాణాలలో వ్యక్తీకరణ పొందిన కులం, మతం, ప్రాంతం, వగైరా ఆకాంక్షలను సంలీనం చేసుకోవడంలో మన రాజకీయ వ్యవస్థ తగినంత వెసులుబాటును, ఔదార్యాన్ని ప్రదర్శించింది. ఏక పార్టీ పాలన నుంచి బహుళపార్టీ మిశ్రమ పాలనకు మారడమే రాజకీయ వ్యవస్థ పునర్నిర్మాణానికి సూచన. కాని మరొక వంక, ఆర్థిక వ్యవస్థ పనితీరుపైన దారిద్ర్యం, దౌర్భాగ్యం పంపుతున్న ఏ సూచననూ గ్రహించి ప్రతిస్పందించడానికి ఆర్థిక వ్యవస్థ సిద్ధంగా లేదు. 1960ల చివర కెలువడిన గరీబీ హఠావో నినాదమే, ఇంకా ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించకుండానే, ఇవాల్టికీ ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తోంది. ఈ కాలంలో జరిగిన రెండు ముఖ్యమైన వెనుకడుగులు ఈ నిర్ధారణకు తగిన ఆధారాన్ని సుకూరుస్తాయి.

మొదటిది, 'మరొక ప్రత్యామ్నాయం లేదు' అనే భావజాలంలో భాగంగా ఆర్థిక సంస్కరణలను ప్రవేశపెట్టిన కాంగ్రెస్ ప్రభుత్వం ఎదుర్కొన్న వెనుకడుగు. ఐదు సంవత్సరాలు అధికారం నిర్వహించిన తర్వాత పి.వి. నరసింహారావు ప్రభుత్వం ఎన్నికలలో ఓడిపోయింది. దానితో ఒక మధ్యంతర ప్రభుత్వం, యునైటెడ్ ఫ్రంట్ పేరిట మిశ్రమ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది గాని అది ఎక్కువ రోజులు మన లేకపోయింది. ఆ తర్వాతి ఎన్నికలలో యునైటెడ్ ఫ్రంట్ ఓడిపోయి, భారతీయ జనతాపార్టీ నాయకత్వంలోని ఎన్‌డిఎ కూటమి అధికారంలోకి వచ్చింది. ఐదు సంవత్సరాలు పూర్తి కాలం పాలించిన తర్వాత ఎన్‌డిఎ ప్రభుత్వం కూడ ఎన్నికల్లో ఓడిపోయి కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఎ కూటమి అధికారానికి వచ్చింది. మొత్తంగా రాజకీయ వ్యవస్థ ఏక పార్టీ పాలన నుంచి బహుపార్టీల మిశ్రమ ప్రభుత్వాలకు మారింది. ఏ పార్టీగాని, కూటమిగాని అధికారంలోకి వచ్చినా ఆర్థిక వ్యవస్థలో సంస్కరణలు యథాతథంగా కొనసాగాయని ఎవరయినా గుర్తించగలరు. ఆ సంస్కరణలు కొన్ని సార్లు మానవ ముఖంతో, కొన్ని సార్లు రక్షణ కవచాలతో వచ్చిం ఉండవచ్చు. రాజకీయ పరమైన ఓటు సంస్కరణల పట్ల అసమ్మతిగా ఆర్థిక పరిపాలన మాత్రం సంస్కరణలకు అనుకూలంగా సాగిందని భాదురి సూచిస్తారు. మన దగ్గరే చూసుకుంటే, ఎన్‌టిఆర్ నాయకత్వంలోని తెలుగుదేశం పార్టీ రెండు రుపాయలకు కిలో బియ్యం పథకం, మద్యనిషేధం హామీలపై రెండోసారి అధికారంలోకి వచ్చింది. ఆ హామీలు సంస్కరణలకు వ్యతిరేకమయినవి గనుక చంద్రబాబు నాయుడు నాయకత్వంలోని తెలుగు దేశం పార్టీ అధికారంలోకి రాగానే ఆ చర్యలను తారుమారు చేసింది. రాజకీయ వ్యవస్థకూ ఆర్థిక వ్యవస్థకూ మధ్య అంటే ప్రభుత్వం అంటే ఉండే సర్వజన అభిప్రాయాలకూ, వాస్తవంగా ప్రభుత్వం అనే దానికీ మధ్య ఉండే అంతరం పూడకుండా

పెరిగిపోతోంది. కొనసాగుతున్న మార్కెట్ కేంద్రక వాతావరణంలోని భావజాలలో రాజకీయాలు అనేది ఒక పనికి మాలిన మాటగా, ఆర్థిక వ్యవస్థను రాజకీయాల నుంచి విడుదల చేయవలసిన అవసరం ఉన్నట్టుగా చూస్తారు. అలాంటప్పుడు ఆర్థిక వ్యవస్థా సంస్కరణలపైన రాజకీయ వ్యవస్థ సాపేక్షిక విజయాలు సాధించిందని భాదురి ఎత్తిపడుతున్న అంగం భారత రాజ్యానికీ ప్రజలకు ఉన్న సార్వభౌమాధికారాన్నీ, వృద్ధి-అభివృద్ధిల గురించి ప్రత్యామ్నాయ చట్రం అన్వేషించడానికి ప్రజలకు ఉన్న హక్కునూ గుర్తుస్తుంది. రాజ్య విధానాలను ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థ వంటి ప్రాంతేతర సంస్థలు నిర్ణయిస్తున్నప్పుడు, రాజ్యానికి ఉన్న సార్వభౌమాధికారం గురించీ, విధానాలను రూపొందించడంలో దాని స్వతంత్ర ప్రతిపత్తి గురించీ మాట్లాడడం, చర్చను ఒక మెట్టుపైకి తీసుకుపోతుంది. ఒక ప్రపంచ మార్కెట్ కోసం సాగుతున్న అన్వేషణను స్థానిక, దేశీయ మార్కెట్ కోసం అన్వేషణగా మారుతుంది.

ఏ ఆర్థిక వ్యవస్థ అయినా తన వనరులనూ వాటిని పంపిణీ చేసే పద్ధతినీ నిర్వచించుకుంటుంది. ఉత్పత్తిని సుసాధ్యం చేయడం కోసం వనరులను ఒక చోటి నుంచి మరొక చోటికి బదిలీ చేసే పద్ధతులను అభివృద్ధి చేస్తుంది. ఒక అర్థంలో ఉత్పత్తి క్రమమే పంపిణీ క్రమాన్ని కూడ నిర్ణయిస్తుంది. మార్కెట్ పూర్వ ఆర్థిక వ్యవస్థలలో ఈ వనరుల బదిలీ పద్ధతుల ప్రధానంగా వ్యక్తిగతంగా ఉంటాయి. అందువల్ల ఆ ఆర్థిక వ్యవస్థ పూర్తి ఉద్యోగ స్థాయిలోనే పని చేస్తుంది. పంపిణీ కూడ వ్యక్తిగత పునాది పైననే సాగుతుంది. మార్కెట్ ఆర్థిక వ్యవస్థలలో మాత్రం, వ్యవస్థలో పూర్తి ఉద్యోగ స్థాయి రావడమనేది ప్రమాదవశాత్తు, యాదృచ్ఛికంగా జరిగే పరిణామమే. పూర్తి ఉద్యోగ స్థాయి వచ్చినప్పుడు కూడ, అది ఆ రాజ్యపు ప్రయత్నాల వల్లనే వస్తుంది. అందువల్ల మనుషులు బలవంతాన నిరుద్యోగ స్థితిలో ఉండవలసి వస్తుంది. మనుషులు ఉద్యోగం చేయాలనీ, పని చేయాలనీ ఎంతగా ప్రయత్నించినప్పటికీ నిరుద్యోగులుగా ఉండక తప్పని స్థితి వస్తుంది. మార్కెట్ సంస్కరణల ఆధారిత విధానం ఏదయినా తాను ఆశించే వృద్ధిని పూర్తి లక్ష్యం ద్వారా సాధించాలని అనుకోదు. సాధారణంగా వృద్ధిని పెట్టుబడి మదుపు ఫలితంగా గుర్తిస్తుంది. కాని భాదురి పూర్తి ఉద్యోగ స్థాయి ద్వారా వృద్ధి సాధించాలని సూచిస్తారు. దాన్నే ఆయన గౌరవప్రదమైన అభివృద్ధి అని అభివర్ణిస్తారు. అంటే, మనిషి మరొకరు చేసే దాన ధర్మాల మీద ఆధార పడకుండా, తన శ్రమ ద్వారా జీవనోపాధి సంపాదించుకుంటాడు. ఆ మేరకు అది శ్రమ గౌరవానికి గుర్తింపు అవుతుంది. దారిద్ర్యం అనేది, ఉద్యోగ కల్పన అనేది ఆర్థిక వ్యవస్థకూ, సమాజానికీ సమస్యలు కావని, వ్యవస్థను మార్చడంలో భాగమైన పరిష్కారాని ఈ పుస్తకం భావిస్తుంది.

ఈ మధ్యనే చట్టాలుగా మారిన ఉపాధి హామీ పథకం, పాలనా సమాచారాన్ని ప్రజలకు అందుబాటులో ఉంచడం, పంచాయతి రాజ్ సంస్థలకు హెచ్చు అధికారాలు ఇవ్వడం ద్వారా వికేంద్రీకరణ అనే మూడు చర్యలు రాజకీయ వ్యవస్థకూ ఆర్థిక వ్యవస్థకూ మధ్య అంతరాన్ని పూడ్చడంలో ఉపయోగకరమైన సాధనాలని భాదురి భావిస్తారు. స్థానిక స్థాయిలో నిరుద్యోగులను, ప్రజలను సమీకరించడం ద్వారా పంచాయత్ అనే స్థానిక స్వపరిపాలనా సంస్థ ఆర్థిక ఉత్పాదక శక్తిని పెంపొందించడానికి ప్రయత్నించడం, రహదారులు, నీటిపారుదల సౌకర్యాలు, ఇంత భారీ నిర్మాణ కార్యకరాపాలు సాధించడం ఇందులో భాగం. ఈ కార్యకలాపాలన్నింటినీ పంచాయత్ స్థాయిలో సమర్థంగా నిర్వహించడం సాధ్యమవుతుంది. అంతేగాక, పంచాయత్ స్థాయిలోనే ఆ పనులను పారదర్శకంగా అమలు చేయడం, పర్యవేక్షించడం సాధ్యమవుతుంది. అయితే అందుకు స్థానిక స్వపరిపాలనా సంస్థలకు అధికారాల బదిలీ జరగవలసి ఉంటుంది. సక్రమంగా అమలయిన ఉపాధి హామీ పథకం, అవసరమైన మౌలిక సాధన సౌకర్యాలను కల్పించడంతో పాటు, స్థానిక ఆర్థిక వ్యవస్థ ఉత్పాదక శక్తిని పెంచగలుగుతుంది. వ్యవసాయంలో వినియోగ వస్తువుల గిరాకీని పెంచుతుంది. పారిశ్రామిక వస్తువుల గిరాకీనీ పెంచుతుంది. అంటే దేశీయ మార్కెట్‌ను విస్తరిస్తుంది. ఈ వ్యయాన్నంతా భరించడం ఎట్లా అని వివరించడానికి భాదురి చాల స్థలం కేటాయించారు. లోటు బడ్జెట్ విధానం ద్వారా ప్రభుత్వం పెట్టే ఖర్చును అరికట్టే ద్రవ్య బాధ్యతా చట్టం వంటి వాటిని స్థూల ఆర్థికవేత్తగా భాదురి ఖాతరు చేయరు. అందువల్లనే ఉపాధి హామి పథకాన్ని క్రియాశీలంగా అమలు చేయదానికి ద్రవ్యాన్ని అచ్చువేసే రిజర్వ్ బ్యాంకునూ పంచాయతీ రాజ్ సంస్థలను సమన్వయ పరచాలనే కొత్త సూచనను భాదురి ముందుకు తెచ్చారు.

ఉపాధి హామీ పథకాన్ని సమర్థంగా అమలు చేయాలంటే, ఉపాధి కల్పనలో మాత్రమే గాక గౌరవప్రదమైన అభివృద్ధిని సాధించడంలో సమర్తంగా ఉండాలంటే, నిరుద్యోగులు ఒక సుస్థిరమైన సంస్థాగత నిర్మాణంలో ఉండడం అవసరం. ఉపాధి హామీ పథకాన్ని దగ్గరి నుంచి పర్యవేక్షించేందుకు, దానిలోని అంశాల ప్రాధాన్యతను నిర్ణయించేందుకు, పంచాయత్‌ను జవాబుదారీ చేసేందుకూ వారికి అవకాశం ఉండాలి. కాని ఈ పుస్తకం చాల వరకు గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో ఉండే అధికార సంబంధాలను, భూయాజమాన్యం చుట్టూ ఉండే అధికార సంబంధాలను విస్మరించింది. అటువంటి ఏ పథకాలనయినా ఈ అధికా సంబంధాలు తలకిందులు చేయగలవు. ఆ తర్వాత ఆ పథకం అమలులో విఫలమయిందని అంటుంటారు. ఇటువంటి పథకాలను ఉనికిలో ఉన్న అధికార సంబంధాలను బలోపేతం చేసేందుకే ఆర్థిక వ్యవస్థలు వాడుకుంటుంటాయి. లేదై సాంఘిక పరివర్తన లక్ష్యంగా గల సుశిక్షితులైన కార్యకర్తలున్న రాజకీయ పార్టీ ఉంటే ఈ పథకంతో అద్భుతాలు కూడ సాధించవచ్చు. కాని అటువంటి కార్యకర్తలున్న రాజకీయ పార్టీలేవీ కనుచూపు మేరలో లేవు. ఆర్థిక నిర్మాణాల బలోపేతం విషయం చెప్పాలంటే ఉదాహరణకు, వేతన ఆదాయం పెంచడం ద్వారా ఈ పథకం గ్రామాలలో కౌలు వ్యవసాయం పద్ధతిని పెంచే అవకాశం ఉంది. కూలిలతో వ్యవసాయం చేయించుకునే రైతులు, పెరిగిన కూలిరేట్ల వల్ల, వ్యవసాయం చేయడం కన్న కౌలుకు ఇవ్వడం లాభసాటి అనుకోవచ్చు. నిరుద్యోగులయిన కూలీలు అనిశ్చితంగా ఉన్న ఈ పథకపు ఉపాధి కన్న తామే కౌలుదారుగా మారితే ఎంతోకొంత ఆదాయం, ఆహార భద్రత దొరుకుతుందనుకోవచ్చు. అయితే, ఇటువంటి విషయాలను స్థానిక స్థాయిలో సూక్ష్మంగా పరిగణనలోకి తీసుకోవాలసి ఉంటుంది. కాని పేదరిక నిర్మూలననూ అభివృద్ధినీ సమన్వయపరిచే ఒక ప్రత్యామ్నాయ కార్యక్రమంగా ఈ పుస్తకం చేసిన సూచన చాల ఆహ్వానించదగినది. రచయిత అభినందనీయుడు. అసలు

ప్రత్యామ్నాయాలు ఉన్నాయని ఆలోచించినందుకే ఈ పుస్తకం ఆహ్వానించదగినది. సంస్కరణలు తప్ప గత్యంతరం లేదని నిరాశావాదం వ్యాపిస్తున్నప్పుడు, ప్రత్యామ్నాయాల కోసం, వీలయిన ప్రత్యామ్నాయాల కోసం, అమలు చేయగల ప్రత్యామ్మాయాల కోసం అన్వేషణ మేధావులు చేయవలసిన పని. ఈ పుస్తకం ఆ పని చేసింది.

భాదురి సూచించిన ప్రత్యామ్నాయపు అనుకూల పాత్ర గురించి చెప్పిన తర్వాత ఒక తాత్విక సందేహాన్ని లేవనెత్తకపోతే ఈ సమీక్ష సంపూర్ణం కాదు. నిరుద్యోగులకు ఉద్యోగం కల్పించాలనే వాదన మనిషిలో పనిచేసే వినియోగించే పునరుత్పత్తి చేసే భౌతిక శక్తి ఉన్నదనే గుర్తింపుకు నిదర్శనం. కాని ఈ వాదన మనిషిలో సృజనాత్మక మానసిక శక్తులుంటాయనే విషయాన్ని చాల వరకు విస్మరిస్తుంది. అసలు నిరుద్యోగానికి కూలాలు ఎక్కడున్నాయని ఆలోచిస్తే, గత సంవత్సరాలలోని భూ పరాయీకరణ ఫలితాలుగానో, అప పారిశ్రామికీకరణ ఫలితంగా చేతి వృత్తుల వారిని తమ సృజనాత్మక నైపుణ్యాల నుంచి బైటికి తోసివేసినందు వల్లనో నిరుద్యోగం సంభవించింది. ఈ నిరుద్యోగ సృజనాత్మక సామర్థ్యాలను సామాజిక పరివర్తన కోసం ఉపయోగించవచ్చు. మార్క్సిస్టు పదజాలంలో చెప్పాలంటే, వారి ఉత్పాదక శక్తులు నిరుపయోగంగా ఉన్నందువల్ల, కొనసాగుతున్న రాజకీయార్థిక వ్యవస్థలో ఒక సుసాధ్యమైన ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను అమలు చేయడం సాధ్యం కాదు. అందువల్ల ఆ ఉత్పత్తి శక్తుల పునాది పై రాజకీయాలను, ఆర్థిక వ్యవస్థనూ పునర్నిర్మించ వలసి ఉంటుంది. అటువంటి పని సాధ్యమేనని చైనాలో మావో రుజువు చేశాడు. ఆ క్రమం మనిషిని సృజనాత్మక జీవిగా పరిగణిస్తుంది గనుక అది గౌరవప్రదమైన అభివృద్ధిని సాధించగలదు. ◆

---

*(...17వ పేజీ తరువాయి)*

వెనుకబడిన జిల్లాల్లో ఫ్యాక్టరీ పెట్టమని కోరినా, ఆరు వేర్వేరు స్థలాలు చూపించినా నిరాకరించిన టాటాలు కలకత్తాకు దగ్గరగా ఉన్న సింగూరినే ఎందుకు ఎన్నుకున్నారో తెలియకుండానే "పరిశ్రమలు కేవలం చారిటీ కోసం రావుకదా. వారికి ఎవరు ఎక్కువ సదుపాయాలు కల్పిస్తే వారి దగ్గరికే వస్తారు" అని పరిశ్రమల శాఖ మంత్రి నిరుపమసేన్ అనడం, బెంగాల్ ప్రభుత్వం ప్రైవేట్ పెట్టుబడిదార్ల అవసరాలు తీర్చటం కోసం ఎంత ముందు ఉందో తెలుస్తుంది.

భూములంటే కేవలం పరిశ్రమలకు పనికివచ్చే వస్తువు కాదు. అవి మనుషులకు ఆహారధాన్యాలు, పరిశ్రమలకు అవసరమైన ముడిసరకులు, పశువులకు ఆహారాన్ని అందిస్తున్నాయి. అనేక రకాల జీవపదార్థాలను తనలో ఇమిడ్చుకొంటుంది. వెలకట్టలేని వాతావరణ సౌకర్యాన్ని, ప్రకృతిని, మనుషులకి అందిస్తుంది. నీటిని తనలో ఇమడ్చుకొని తద్వారా పంటలకు, ప్రకృతికి సహకరిస్తుంది. అలాంటి ప్రజల జీవనాధారమైన పంట భూముల్ని అమ్మేసే ముందు వాటి స్థానంలో వచ్చే పరిశ్రమలు అక్కడ నివసిస్తున్న ప్రజలందరికి సరైన న్యాయం చేయగలుగుతుందని మన దేశంలో ఎక్కడైనా రుజువయిందా? బడా పెట్టుబడిదార్లకు పంటభూములు అంపకం ద్వారా వాటిని నాశనం చేసేబదులు, వ్యవసాయ సంబంధిత పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు నెలకొల్పి ఉద్యోగ అవకాశాలు ఎందుకు పెంచకూడదంటూ నాగరిక్ మంచ్ కి చెందిన సామాజిక కార్యకర్తలు ప్రశ్నిస్తున్నారు.

"పశ్చిమ బెంగాల్‌లో వామపక్ష కూటమి కుడివైపు జరిగిపోతుంది. చిరకాలంగా కొన ఊపిరితో ఉన్న తన ఆర్థికతకు ప్రైవేట్ పెట్టుబడి ద్వారా ప్రాణం పోసింది. కానీ తన సిద్ధాంత వ్యక్తిత్వాన్ని బలిపెట్టింది. తాను పెట్టుబడిదారీ నమూనాను అనుసరిస్తున్నట్లు ముఖ్యమంత్రి బుద్ధదేవ భట్టాచార్య చెప్పకొన్నారు. అసంఖ్యాక ప్రజానీకాన్ని దుర్భర దారిద్ర్యంలోకి నెట్టడం ద్వారా కూడబెట్టిన సంపదపై ఆధారపడిన నమునా అది. మురికివాడలను నిర్మూలించి నగరాలను శుభ్రపరచడం, కార్మికచట్టాలను నీరుకార్చి, ప్రత్యేక ఆర్థిక మండలాలను సృష్టించడం వంటి చర్యలు ఈ పెట్టుబడిదారీ నమునాలో భాగమే. మొత్తం మీద 2006 ఎన్నికల్లో సంపన్నవర్గాల నుండి 17-18 శాతం ఓట్లు అధికంగ తెచ్చుకొన్న వామపక్ష ప్రభుత్వం పేదవర్గాలలో 5 శాతం ఓట్లు కోల్పోయింది" అని వామపక్ష రాజకీయాలకు మద్దతునిస్తున్న మేధావి ప్రఫుల్ బిద్వాయ్ చేసిన విశ్లేషణ, రవి గారన్నట్లు లోతుల్లోకి వెళ్లకుండా చేసే విమర్శ కిందే వస్తుందా?

ప్రశ్నిస్తున్న వారినందరినీ బెంగాల్ అభివృద్ధిని వ్యతిరేకిస్తున్న శక్తులుగా కొట్టిపారేస్తుంది బెంగాల్ ప్రభుత్వం. టాటా కార్ల ఫ్యాక్టరీ మొదలైతే దేశంలోనే ప్రజానుకూల పారిశ్రామికీకరణకు కొత్త మార్గం చూపినట్ల వుతుందంటున్నారు తెలగపల్లి రవి గారు. మరి బెంగాల్‌లో వ్యవసాయ రంగంలో విజయాలు సాధించక భూమిలేని నిరుపేదల సంఖ్య 49 లక్షల నుండి 74 లక్షలకు ఎందుకు పెరిగింది? అదే సమయంలో వ్యవసాయ భూమి ఒక లక్ష ఇరవై వేల ఎకరాలకు ఎందుకు తగ్గిపోయిందో, అలాగే నేడు భూముల కోసం జరుగుతున్న పోరాటంలో ప్రధానంగా నిరుపేద రైతులు, స్త్రీలూ ఎందుకు ముందుకు వస్తున్నారో? అవి ఆచరణా లోపాల ఫలితమా లేక విధాన ఫలితమా అన్నది వివరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. (1953లో బిమల్‌రాయ్ తీసిన సినిమా "దో బీఘా జమీన్" లో బెంగాల్‌లోని పల్లెటూరి పేదరైతు శంభూని తనకున్న రెండు బీఘాల భూమి అమ్మేయమని ఆ స్థలంలో ఫాక్టరీ కడతానని భూస్వామి అంటాడు. దానికి శంభూ "భూమి అంటే తల్లి కదా, తల్లిని ఎలా అమ్మగలను" అంటాడు నీబాకీ నే మాఫీ చేసి, అదనంగా డబ్బు ఇస్తాను, భూమిని వదిలేస్తే అందులో పెద్ద మిల్లు కడతాను అప్పుడు అమ్మే నాన్న కింద మారిపోతాడు" అంటాడు భూస్వామి. "చెట్టు మట్టిలో పెరుగుతుందికదా దానిని బంగారంలో పాతిపెడితే చెట్టు పెరుగుతుందా" అంటాడు శంభు.

- 1959 మాస్కో చలనచిత్రోత్సవంలో బిమల్‌రాయ్ "ఎక్కడ జరిగినా మానవ హక్కుల కోసం సాగించే పోరాటాన్ని విస్మరించకూడదు, మనిషి పై జరిగే దోపిడీ అంతంకావాలనీ, ఏ రకమైన యుద్ధాన్నైనా రూపుమాపాలనీ, మనుషుల దుస్థితిని మార్చేందుకు ప్రతీ మనిషీ కృషి చేయాలనీ ప్రజలు, ఇప్పుడు గ్రహిస్తున్నారు. నిజమైన అభివృద్ధి మానవుడి కనీస హక్కులను సాధించడం మీదే పూర్తిగా ఆధారపడి ఉందనేదే మనం గ్రహించాలి" అంటు ప్రసంగించారు.

ఈ సారాన్ని గ్రహించే స్థితిలో మనం ఉన్నామా? ◆

# 'కొండను తవ్వి...'

– దుప్పల రవికుమార్

వైద్యశాస్త్రంలో అద్భుతమైన యాంటిబయాటిక్ మందుగా పేరుపొందిన 'పెన్సిలిన్' పేరు చెప్పగానే అలెగ్జాండర్ ఫ్లెమింగ్ దాన్ని కనిపెట్టినట్టు గుర్తొస్తాడు. 1945లో వైద్యశాస్త్రానికి నోబెల్ బహుమానం ఈ పెన్సిలిన్ కనుగొన్నందుకు ఫ్లెమింగ్‌తో పాటు హోవార్డ్ ఫ్లోరే, ఎర్నెస్ట్ చెయిన్ అనే మరో ఇద్దరు శాస్త్రవేత్తలకు కూడా ఇచ్చారు. ఆ విషయం చాలా మందికి తెలియదు. "ది మౌల్డ్ ఇన్ డాక్టర్ ఫ్లోరేస్ కోట్ : ది రిమార్కబుల్ ట్రూ స్టోరీ ఆఫ్ ది పెన్సిలిన్ మిరకిల్" అన్న పుస్తకం (2004) లో ఎరిక్ లాక్స్ పెన్సిలిన్ తయారీ కృషిలో నార్మన్ హీట్‌లే పాత్ర కూడా మరువలేనిదని చెప్తాడు. 1928లో అలెగ్జాండర్ ఫ్లెమింగ్ ఆ పెన్సిలిన్ తెట్టు వలయాన్ని మొదటిసారి చూసి, నోట్ చేయడం తప్ప ఏమీ చేయలేకపోయాడు. ఒక దశాబ్దం తర్వాత ఫ్లోరే, అతడి సహచరుల సమష్టి కృషితో పెన్సిలిన్ తయారయిందని ఎంతమందికి తెలుసు? రెండో ప్రపంచ యుద్ధం నుంచి పెన్సిలిన్ విరివిగా వాడకంలోకి వచ్చాక కతంతా మనకు తెలిసిందే.

❀ ❀ ❀ ❀ ❀

1724 నుంచి 1948 వరకు హైదరాబాద్ రాజ్యాన్ని పాలించిన ఏడుగురు ప్రభువుల్లో చివరి నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ ఏలుబడిలో కేవలం పది సంవత్సరాల (1938 సత్యాగ్రహ ఉద్యమం నుంచి 1948 రజాకార్ ఉద్యమం వరకు) దుర్మార్గ పాలనను మొత్తం అతడి పరిపాలనకు, అంతకంటే అన్యాయంగా మొత్తం నిజాముల పాలనకు అంటగడుతున్నాం.

"ముల్కి : ముస్లిం సాహిత్య సంకలనం" లో 'వక్రీకరణకు గురైన ముస్లిం పాలకుల చరిత్ర – నిజాం చరిత్రకు చెదలు' అన్న వ్యాసంలో సంగిశెట్టి శ్రీనివాస్ ఇంకా ఎన్నో ఆసక్తికరమైన విషయాలు చెప్తారు. చిత్రమేమిటంటే ఆ 'దుర్మార్గ', 'నిరంకుశ' ఏడో నిజాం 1967లో మరణించినపుడు శవయాత్రలో లక్షలాది జనం పాల్గొన్నారు. అంతకంటే వింత – నిజాంకు సంతాపం ప్రకటించిన నిండు శాసనసభలో పోటీలు పడి కాంగ్రెస్, రిపబ్లిక్, కమ్యూనిస్ట్, జనసంఘ్ నాయకులు ఆయనను, ఆయన సేవలను కొనియాడడం. ఈ వ్యాసంలో శ్రీనివాస్ ఒక అప్పీల్ చేస్తారు. చరిత్రగతిలో వక్రీకరణకు గురైన, తెరమరుగైన తెలంగాణ ముస్లిం సాహిత్య వికాసాన్ని, సాంస్కృతిక పునరుజ్జీవనాన్ని, ప్రజా చైతన్యానికి వారధులుగా నిలిచిన యోధులను నేటి తరానికి సమగ్రంగా పరిచయం చెయ్యాలంటారు.

❀ ❀ ❀ ❀ ❀

రష్యాను ఏలిన పాలకుల్లో అత్యంత క్రూరుడిగా ముద్రపడిన జోసెఫ్ స్టాలిన్ మరీ అంత 'పచ్చి నెత్తురు తాగే రకం' కాదంటూ తోలేటి జగన్మోహనరావు మనకీ 'రెండో ప్రపంచ యుద్ధంలో రష్యా' పుస్తకంలో చెప్తారు.

❀ ❀ ❀ ❀ ❀

ఇదంతా చరిత్ర రచనాక్రమంలో జరిగిన తప్పిదాలను (!) దిద్దుబాటు చేసే ప్రయత్నం. ఇదో నూతన సాహిత్య ప్రక్రియగా ఇప్పుడిప్పుడే బలం పుంజుకుంటోంది. కొన్నిసార్లు తప్పుడు వ్యూహాలతో, మరికొన్ని సార్లు ఒక వర్గ ప్రయోజనాన్ని కాపాడే ముందస్తు జాగ్రత్తలతో, అరుదుగా ఇంకొన్నిసార్లు అప్పటి ప్రపంచానికి వాస్తవాలు తెలియక చరిత్ర రచనలో ఏర్పడిన మకతికలను తొలగించి తిరిగి రాయాలంటే... వాస్తవాలు తెలియ జెప్పాలంటే ఆ పని కత్తిమీద సాములాంటిదే. ఎందుకంటే ఆయా సంఘటనల మీద, వ్యక్తుల మీద, సిద్ధాంతాల మీద పాత అభిప్రాయాలు, పాద వాదనలు, పక్షపాత నిందలు, దుష్ప్రచారాలు అప్పటికే జనబాహుళ్యంలో విస్తృతంగా ప్రచారమై ఉంటాయి. నిశితమైన పరిశోధన చేసి, నికరమైన ఫలితాలను పొంది, నిష్పక్షపాతంగా కొత్త వాదన (పాయింట్ ఆఫ్ వ్యూ) ను కొత్త తరం పాఠకులకు తెలియజెప్పాల్సి ఉంది. అంత కంటే ముందుగా, ముఖ్యంగా ఏ వర్గం, ఏయే ప్రయోజనాలను ఆశించి ఆ పాత ప్రచారం ముమ్మరంగా గావించిందో వివరించాలి. ఆ విషయాల పట్ల కొత్త చూపు పొందడం వల్ల పాఠకుడికి చేకూరే ప్రయోజనమేమిటో స్పష్టపరచాలి. ఇదంతా చేయగలిగితేనే చరిత్ర దిద్దుబాటు రచనలు తమ ప్రయోజనాన్ని సాధించినట్టు. ప్రక్రియాపరంగా తెలుగు సాహిత్యానికి కొత్తదేమీ కాకపోయినప్పటికీ అరుదుగా జరిగే ప్రయత్నమిది.

ప్రపంచీకరణ నేపథ్యంలో మన జీవితంలో ఏర్పడిన అల్లకల్లోలాన్ని, గందరగోళాన్ని, ఆయోమయాన్ని, విలువలలో దిగజారుడుతన్నాన్ని చక్కటి వ్యంగ్య అధిక్షేపణలతో 'లక్ష్మీకటాక్షం', 'కప్పడాలు' వంటి కథలతో చిత్రించిన తోలేటి తెలుగు సాహితీప్రియులకు చిరపరిచితులు. తన శైలికి భిన్నంగా ఈమారు ఒక బృహత్తర బాధ్యతను తన భుజాన వేసుకుని, చరిత్రలో జరిగిన ఒక పక్షపాత ప్రచారాన్ని సమర్థంగా తిప్పికొట్టడానికి లోతైన పరిశోధన చేశారు. ఫలితాలు ఈ 'రెండో ప్రపంచ యుద్ధంలో రష్యా' పుస్తకం ద్వారా వెల్లడించారు. బూర్జువా చరిత్రకారులు స్టాలిన్‌కు అంటించిన బురదను కడగడానికి చేసే ప్రయత్నమే ఈ పుస్తక రచన.

'తొలిపలుకు'లోనే ఈ పుస్తకం ఉద్దేశం స్పష్టంగా చెప్పారు. ఇదంగా స్టాలిన్ గురించి కాదు. పెద్ద ఎత్తున సైన్యంతో, ఆయుధాలు, బలగంతో జర్మనీ రష్యాపై యుద్ధానికి తెగబడింది. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ తదితర 'పెద్ద' దేశాలకు 'కమ్యూనిస్టు రష్యా' అసలు నచ్చుడమే లేదు. ఎటునుంచీ, ఎటువంటి సహకారమూ లేని స్టాలినిస్టు రష్యా మొదట్లో ఓడిపోయి(నట్టయి), మళ్లీ ఒక్కసారి తన శక్తులన్నింటినీ కూడ దీసుకుని యుద్ధ రంగంలో విజృంభించి ఎలా జర్మనీని ఓడించ గలిగిందనేది చెప్పడమే ఈ పుస్తకం ఉద్దేశం. కళ్లు మిరుమిట్లు గొలిపే రష్యా విజయం వెనుక, అసాధ్యాన్ని సుసాధ్యం చేసిన అప్పటి ఆ దేశపు ఏలిక స్టాలిన్ కృషి, శ్రమ ఎంతో ఉంటుంది. వాటిని అంచనా వేయడం ద్వారా స్టాలిన్‌కు పునర్వైభవం కల్పించినట్టవుతుందని రచయిత ఆశ.

# భగత్‌సింగ్

-

"మనం ఖైదు చేయబడగానే అంతా అయిపోయిందని భావించకూడదు. ఇక మనం చేయవలసిందేమీ లేదనే నిర్ణయానికి వచ్చేయకూడదు. వీలయినంత మంది కామ్రేడ్స్‌ను విడుదల చేయించడానికి ప్రయత్నిస్తూనే ఒక రాజకీయోద్దేశంతో, ఒక రాజకీయ పంథాలోనే పోరాడాలి. శతృవుల కోర్టుల పట్ల ఆశలు పెంచుకోవడం బుద్ధిహీనతే అవుతుంది. కాబట్టి మనం విదేశీ ప్రభుత్వం ఆడే ఈ న్యాయస్థాన నాటకాన్ని బట్టబయలు చేసి, విప్లవకారుల అజేయమైన మానసిక శక్తిని ప్రదర్శించాలి" అని వివరించాడు భగత్‌సింగ్. అతను కోర్టులను విప్లవకారుల ఆదర్శాలను ప్రచారం చేసుకునే వేదికలుగా మలచుకోవాలనేవాడు. దానితోపాటు మేము జైళ్లలో రాజకీయ ఖైదీల హక్కుల కోసం నిరంతరం పోరాటం జరుపుతుండాలని ఉద్బోధించేవాడు. ప్రభుత్వం, దాని కోర్టులు, దాని విధానాలు - అన్నింటిపట్లా మన ద్వేషాన్ని, అసహ్యాన్ని అవకాశం దొరికినప్పుడల్లా వ్యక్తం చేస్తూ కడపటి ప్రకటన ఇవ్వడానికి అనుమతి లభిస్తే ఆ ప్రకటనలో రాజకీయ దృక్పథంతో వ్యవస్థ మొత్తంపై దెబ్బ తీయాలనేవాడు భగత్‌సింగ్.

సర్దార్ భగత్‌సింగ్ చెప్పిన విషయాలనన్నింటినీ కామ్రేడ్స్ అందరూ సమర్థించారు. ఈ ప్రణాళికననుసరించి ముద్దాయిలందరూ మూడురకాలుగా విభజింప బడ్డారు. న్యాయవాదుల ద్వారా కేసులు నడపవలసినవారు మొదటి రకానికి చెందుతారు. వీరు ఐదుగురు : దేశరాజ్ భారతి, ప్రేమ్‌దత్, మాస్టర్ ఆజ్ఞారాం, అజయఘోష్[1], కిశోరీలాల్. శతృవుల న్యాయస్థానాన్ని అంగీకరించనివారు రెండవ రకంవారు. అవకాశం దొరికినపుడల్లా మోసపూరితమైన న్యాయవిధానాన్ని సైద్ధాంతికంగా తూర్పారపట్టడం వీరి పని. ఈ కామ్రేడ్స్ ట్రిబ్యునల్ ఎదుట మొదటిరోజే ఇచ్చిన ప్రకటన గురించి న్యాయమూర్తులిలా రాశారు. "ఆ ప్రకటన బ్రిటిష్ ప్రభుత్వం పై దౌర్జన్య పూరితమైన రాజకీయ దాడి. బహిరంగ న్యాయస్థానంలో రాజద్రోహాన్ని ప్రచారం చేసే ఈ ప్రకటన చదవడం చాలా అనుచితమైంది. అందువల్ల ట్రిబ్యునల్ ఆ ప్రకటనను చదవడం నిలిపివేసంది" ఈ కామ్రేడ్స్ వారి ప్రకటన చివర "ఈ కారణాలవల్ల మేము హాస్యాస్పదమైన ఈ నటనలో భాగస్వాములుగా నిరాకరిస్తున్నాము. ఇక ఈ న్యాయస్థాన కార్యకలాపాలలో ఏ విధంగానూ పాల్గొనబోము" అని ఉద్ఘాటించారు. ఈ రకానికి చెందినవారు : మహావీరసింగ్, బి.కె.దత్, డాక్టర్ గయాప్రసాద్, కుందన్‌లాల్, యతీంద్రనాథ్ సాన్యాల్. తమ కేసును తామే వాదించుకునేవారు మూడవ రకానికి చెందినవారు. ప్రభుత్వం తరపు సాక్షులను తోసిపుచ్చడం, అప్రూవర్ల, సాక్షుల నోటినుండే తమ వాదనలను వినిపించడం వారి పని. వారు ప్రతిచర్యనూ ప్రచారం దృష్టితోనే తీసుకుంటారు. ఈ గ్రూపులోనే కామ్రేడ్స్ భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురు, శివవర్మ[2] జయదేవకపూర్, విజయకుమార్ సిన్హా, కమలనాథ్, తివారి, సురేంద్రనాథ్ పాండే మున్నగువారు.

న్యాయస్థానాన్ని ప్రచారవేదికగా ఉపయోగించుకోవాలనే మా ప్రణాళిక బాగా విజయవంతమైంది.

జూలై పదవ తేది మా కేసు విచారణ ప్రారంభమైన రోజున భగత్‌సింగ్, దత్ ఇద్దరూ నిరాహారదీక్షలో ఉన్నారని ముందే చెప్పాను. 1929 జూలై 13న మిగతా కామ్రేడ్స్ కూడా భగత్‌సింగ్, దత్తులను

---

ఇందుకుగాను తాను చెప్పదలచుకున్న అంశాన్ని పది అధ్యాయాలుగా విభజించుకున్నారు. యువ విద్యార్థులకు పాఠం చెప్పే తరహాలో సరళాతిసరళంగా విషయాన్ని వివరించుకుంటూ వచ్చారు. ఇందువల్ల అక్కడక్కడా పునరుక్తులు తప్పలేదు. ఈ విషయాలు మనకిలా అందివ్వడానికి మార్షల్ ఝుకోవ్ లాంటి 'లోపలి' మనుషుల రచనల మీదా, జోసెఫ్ డేవిస్ లాంటి 'బయటి' మనుషుల మీద కూడా ఆధారపడ్డారు.

సోషలిస్టు రష్యా విజయగాథను వర్ణించడంలో లీనమైన రచయిత తనకు తెలుస్తూనో, తెలియకుండానో స్టాలిన్ ఆరాధనలో పడిపోతారు. ఇదే ఈ పుస్తకంలో కనిపించే పెద్ద లోపం. ఇలా తన్మయంగా చేసే స్టాలిన్ భజనవల్లే 'తొలిపలుకు'లోని ఉద్దేశం పక్కదారి పట్టడమే కాకుండా ఎలాంటి వాక్యాలు రాయవలసి వచ్చిందో చూడండి. "శత్రువుతో చేతులు కలిపి సోవియట్ ప్రభుత్వాన్ని కూలదొయ్యడానికి ప్రయత్నించిన వారిని (స్టాలిన్) నిర్దాక్షిణ్యంగా అణచి వెయ్యడం జరిగింది... శత్రు పంచమాంగదళ నిర్మూలన కార్యక్రమంలో అనివార్యంగా కొంతమంది నిరపరాధులు కూడా బలయ్యారు" (పేజీ vi). 207వ పేజీలో పోల్చి చూపించిన రాజకీయ ఖైదీల వివరాలున్నాయి. "1939లో మొత్తం ఖైదీల సంఖ్య 20 లక్షలు మాత్రమే. ఇందులో 4,54,000 మంది మాత్రమే రాజకీయ ఖైదీలు. 1937-39 కాలంలో లేబర్ క్యాంపుల్లో మరణించిన ఖైదీల సంఖ్య 1,60,000" మాత్రమేనట. అయితే వాక్యం ప్రారంభంలో 'ప్రభుత్వ లెక్కల ప్రకారం' అని రచయిత చేర్చడం మరిచిపోలేదు. ఈ పుస్తకం చదవడం పూర్తిచేశాక స్టాలిన్ మీద తప్పక సానుభూతి కలుగుతుంది. అంతవరకు రచయిత సఫలమైనట్టే, ఆనక జార్జి ఆర్వెల్ రాసిన 'ఏనిమల్ ఫామ్' నవలను చదవడం వల్ల పాఠకులకు వింత అనుభవం కలగడం తథ్యం.

పిఎస్ : ఎంతో శ్రమకోర్చి వేలాది పుటలు చదివి, గాలించి, సేకరించిన సమాచార గుచ్ఛమంతా చివర్లో చేర్చిన 'ముఖచిత్రం గురించి' అన్న రెండు పేజీల వ్యాసం ముందు తేలిపోతుంది. అందులోనూ చివరి రెండు పేరాగ్రాపులు అక్షరసత్యాలు.

❁ ❁ ❁ ❁ ❁

(రెండో ప్రపంచ యుద్ధంలో రష్యా (తోలేటి జగన్మోహనరావు, సూర్య ప్రచురణలు, హైదరాబాద్. పేజీలు 294, వెల రు. 150) ◆

ఉంచిన డిమాండ్ల కోసం నిరాహార దీక్ష ప్రారంభించాలని నిశ్చయించాము. జైళ్లలో అధికారులు రాజకీయ ఖైదీలతో అమానుషంగానూ, అవమానకరంగానూ ప్రవర్తిస్తున్నారు. మనం అరెస్టయితే వీటికి వ్యతిరేకంగా కూడా పోరాడాలి. పార్టీ కేంద్రకమిటీ వెలుపల ఉండగానే ఈ నిర్ణయం తీసుకుంది. ఈ నిర్ణయానుసారం 1929 జూలై 14న భగత్‌సింగ్ ప్రభుత్వ హోం మెంబరుకు రాసిన ఉత్తరంలో ఈ కింది కోర్కెలున్నాయి.

1. మేము రాజకీయ ఖైదీలం, కాబట్టి మాకు మంచి భోజనం ఇవ్వబడాలి. అది యూరోపియన్ ఖైదీలకిచ్చే స్థాయిలో ఉండాలి.
2. 'పని' అనే పేరుతో రాజకీయ ఖైదీలను జైళ్లలో హీనమైన పనులు చేయమని నిర్బంధించరాదు.
3. పుస్తకాలు, రాత సామాగ్రి ఏ ఆటంకం లేకుండా లభింపజేయాలి.
4. ప్రతి రాజకీయ ఖైదీకి ప్రభుత్వ ఖర్చుతోనే ఒక్కొక్క దినపత్రిక ఇప్పించాలి.
5. రాజకీయ ఖైదీలకై ప్రత్యేకమైన ఒక శ్రేణిని ఏర్పరచాలి. ప్రతి చెరసాలలోను రాజకీయ ఖైదీల కోసం ఒక ప్రత్యేకమైన వార్డు ఏర్పర్చాలి. అందులో యూరోపియన్ ఖైదీలకున్న సౌకర్యాలన్నింటినీ కలుగజేయాలి. ఒక జైలులో ఉన్న రాజకీయ ఖైదీలందరినీ ఆ వార్డులోనే ఉంచాలి.
6. స్నానవసతీ, ధరించడానికి మంచి బట్టలూ ఇవ్వాలి.
7. ఉత్తరప్రదేశ్ జైలు సంస్కరణ సంఘ సభ్యులైన శ్రీ జగత్ నారాయణ్, ఖాన్‌బహదూర్ హాఫీజ్ హిదాయత్ హుసేన్ రాజకీయ ఖైదీలను ఉన్నత శ్రేణి ఖైదీలవలె పరిగణించాలని సిఫారసు చేశారు. ఆ సిఫారసును మాకు కూడా అన్వయింపజేయాలి.

ఈ నిరాహార దీక్ష 63 రోజులు కొనసాగింది. భగత్‌సింగ్, దత్తుల దీక్ష మూడు నెలలు కూడ దాటింది. ఈ మూడు నెలలు కూడ భగత్‌సింగ్ తన పనులను – అంటే రాయడం, చదవడం, స్నానం చేయడం, కోర్టులో ప్రకటనలు ఇవ్వడం, చిత్తు ప్రతులు తయారు చేయడం, ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం – అన్నీ స్వయంగానే చేసుకునేవాడు. కేసు విచారణ జరుగుతుండగా భగత్‌సింగ్‌నూ, దత్తునూ లాహోర్ సెంట్రల్ జైలులో ఉంచారు. మిగతా ముద్దాయిలను బోర్‌స్టల్ జైల్లో ఉంచారు. కేసు విచారణకుగాను పరస్పరం చర్చించుకోవాలనే నేపంతో వారిద్దరూ ప్రతి ఆదివారం బోర్‌స్టర్ జైలుకు వచ్చేవారు.

చెరసాల్లో పుస్తకాలుండేవి. ప్రారంభంలోనే పుస్తకాధ్యయనం చేసే వాతావరణం నెలకొంది. మాలో మేము సిద్ధాంత, రాజకీయ చర్చలు సాగిస్తూండేవారం. కానీ భగత్‌సింగ్ వచ్చిన తర్వాత ఒక కొత్త ఉత్సాహం పెల్లుబికింది. భగత్‌సింగ్ వచ్చినరోజు ఏ విషయాన్ని మేము చర్చించుకోకుండా వదలేవారం కాము. ఆ వారం మేము చదివిన గ్రంథాలు – మార్క్సిజం, సోవియట్ యూనియన్ ప్రగతి, ఆఫ్ఘనిస్తాన్ లోని మార్పులు, మీరట్ కుట్రకేసు, కార్మికుల పోరాటాలు, భారత పెట్టుబడిదారీ వర్గ పాత్ర, కాంగ్రెస్ కార్యకలాపాలు, లాహోరు కాంగ్రెస్ మహాసభలో లక్ష్యం మార్చడం వంటి అన్ని విషయాలనూ మేము చర్చించేవారం.

ఈ విధంగా మా కేసుకు సంబంధించిన కామ్రేడ్స్ అందరికీ గ్రంధ పఠనంలో ఆసక్తి ఉన్నప్పటికీ, భగత్‌సింగ్‌కు ఈ ఆసక్తి మరీ ఎక్కువ, అతనికి 'సామ్యవాదం' చాలా ఇష్టమైన విషయమైనప్పటికీ రాజకీయ, ఆర్థిక సమస్యలు ఆధారంగా రచించబడ్డ నవలలంటే కూడ ఇష్టమే. ఆంగ్లంలో ఛార్లెస్ డికెన్స్, అప్టన్ సిన్‌క్లేయర్, హార్‌కేన్, విక్టర్ హ్యూగో, మాక్సింగోర్కి, స్టేపనియెక్, ఆస్కార్ వైల్డ్, లియోనాయిడ్ ఆండ్రీవ్ మొదలగువారి రచనంటే అతనికి మరీ ఇష్టం. భగత్‌సింగ్ లియోనాయిడ్ ఆండ్రీవ్ నవల "సెవన్ దట్‌వర్ హేంగ్డ్" నవలను మాకు కోర్టులో చదివి వినిపించాడు. అ నవలలో వచ్చే ఒక పాత్రకు ఉరిశిక్ష విధించబడింది. అయితే అతడు 'నన్ను ఉరీ తీయకూడదు", "నన్ను ఉరి తీయకూడదు" అని చెబుతూ ఉంటాడు. అతన్ని ఉరికంబానికి తీసుకెళ్లేటప్పుడు కూడా "నన్ను ఉరి తీయకూడదు" అనే చెబుతూ ఉంటాడు.

భగత్‌సింగ్ ఈ ఘట్టం వర్ణించేటప్పుడు అతని కళ్లల్లో కన్నీళ్లు తొణికాయి. మృత్యువును జయించే తమ కామ్రేడ్ మరణ భయంతో వణికే ఒక నవలాపాత్ర కోసం కన్నీరు కార్చే దృశ్యం చూచి మేమంతా ఆశ్చర్యపడ్డాము.

మా కేసు జరుగుతుండిన కాలంలో ప్రతి రెండు, మూడు రోజులకొకసారి పోలీసులతోనో, లేక జైలు అధికారులతోనో మా కొట్లాటలు జరుగుతుండేవి. ఆ కొట్లాటల్లో నా వంటి బలహీనులు ఒకటి, రెండు దెబ్బలతోనే తప్పించుకునేవారు. తన్నులు, గుద్దులు, లాఠీదెబ్బలు మాలో ఐదారుగురికే ఎక్కువగా పడేవి. ధృఢకాయులైన ఆ కామ్రేడ్స్‌ను అధికారులు కొట్టడానికే ఎన్నుకొన్నట్లు తోచేది. రాజకీయ చర్చల్లో పాల్గొనే వారిలో మాత్రమే కాక, దెబ్బలు తినేవారి పట్టికలో కూడ జయదేవ్ కపూర్, మహావీర్‌సింగ్, కిశోరీలాల్, గయాప్రసాద్‌ల కంటే కూడ భగత్‌సింగ్ ముందుండేవాడు.

చివరకు తీర్పు చెప్పేరోజు వచ్చింది. భగత్‌సింగ్‌కు ఉరిశిక్ష విధిస్తారని మాకు ముందేతెలుసు కానీ అది విన్నదే నాకు కళ్లు బైర్లు కమ్మాయి. నిన్నటివరకు ఉండిన అనుమానం ఈ రోజు యదార్థమై మాముందుకు వచ్చి నిలబడింది.

శిక్షపడిన తర్వాత మమ్మల్ని కూడా బోర్‌స్టల్ జైలునుంచి సెంట్రల్ జైలుకు మార్చారు. అక్కడ ఉరిశిక్ష పడ్డ ఖైదీలనుంచే పాత, కొత్త బ్లాక్‌లు ఒకదాని పక్క ఒక్కటి ఉన్నాయి. భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురు కొత్త 'బ్లాక్'లో ఉన్నారు. మేము పాత 'బ్లాక్'లో ఉన్నాము. ఒకరోజు రాత్రి అకస్మాత్తుగా మా కొట్టుల తాళాలు తెరవబడ్డాయి. మమ్మల్ని అక్కడినుంచి బయలుదేరమన్నారు. మా కామ్రేడ్స్‌ను ఉరి తీయకముందే మమ్మల్ని అక్కడనుంచి తొలగించ బూనుకుంది ప్రభుత్వం.

జైలు సూపరింటెండెంట్ తన సిబ్బందితో మమ్మల్ని ముఖద్వారం వైపు తీసుకువెళ్లాడు. కొంతదూరం వెళ్లిన తర్వాత అతడు "మీ కామ్రేడ్స్‌ను కలుసుకుంటారా?" అని అడిగాడు. మా కృతజ్ఞతలను అందుకుని అతడే కొత్త 'బ్లాక్' గేటును తెరిచాడు. మమ్మల్ని భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురు గదులముందుకు తీసుకువెళ్లి నిలబెట్టారు.

జీవితంలో ఈ కామ్రేడ్స్‌ను మరెన్నడూ చూడలేమనే భావంతో మా ముఖాలన్నీ చింతా క్రాంతమైన ఉన్నాయి. వారినుంచి సెలవు తీసుకొని బయలుదేర బోతుండగా మాలో ఒకరైన జయదేవ్ కపూర్ భగత్‌సింగ్‌ను "సర్దార్, నీవు చనిపోవడానికి సిద్ధంగా ఉన్నావు, ఇందుకై నీవేమి విచారపడ్డంలేదు కదా?" అని అడిగాడు.

ఈ ప్రశ్న విన్నదే భగత్‌సింగ్ బిగ్గరగా నవ్వి గంభీరంగా అన్నాడు. "విప్లవ పథంలో నేను అడుగిడేటప్పుడే, నా ప్రాణాలర్పించి దేశమంతటా 'ఇంక్విలాబ్ జిందాబాద్ : విప్లవం వర్ధిల్లాలి' అనే నినాదాన్ని వ్యాపింపజేయ గలిగానంటే, నా జీవితమే ధన్యమైతుందనుకున్నాను. ఈనాడు ఈ జైలుగదిలో ఉన్నప్పటికీ, ఇనపకమ్మీల వెనుక కూర్చున్నప్పటికీ కోట్లాది మన ప్రజల కంఠంనుంచి మార్మోగుతున్న ఆ నినాదాన్ని వినగలుగుతున్నాను. నా ఈ నినాదం స్వాతంత్ర్య సంగ్రామాన్ని ఉద్దీపింపజేసే శక్తిగా సామ్రాజ్యవాదులను చివరి వరకు దెబ్బతీస్తూనే ఉంటుందనే నమ్మకం నాకుంది. ఇంత చిన్న జీవితానికి ఇంతకంటే మరేం కావాలి!" ఇలా చెప్పి అతను చిరునవ్వు నవ్వాడు.

నేను అందరికన్నా వెనుక నిలబడి ఉన్నాను. భగత్‌సింగ్ సెలవు తీసుకున్నపుడు నేను కన్నీటి నాపుకోలేక పోయాను. అతను నన్ను చూచి "భావావేశానికి లోనయ్యే సమయం ఇంకా రాలేదు ప్రభాత్[3] నేను కొన్నిరోజులలోనే ఈ జంజాటం నుంచి తప్పించుకుంటాను. కానీ మీరు దీర్ఘమైన ప్రయాణం సాగించవలసి ఉంది. బాధ్యతనే పెద్ద బరువున్నప్పటికీ ఈ దీర్ఘ ప్రయాణంలో నీవు అలసిపోవనీ, నిరాశ చెందవనీ, పరాజితుడవై చతికిలబడిపోవనీ నా నమ్మకం" అని అన్నాడు.

జైలు సూపరింటెండెంట్ మా వద్దకొచ్చి, "ఇక బయలుదేరండి" అని మెల్లగా అన్నాడు. భగత్‌సింగ్‌ను అదే మేము చివరగా కలుసుకోవడం. ◆

1. అజయ్‌ఘోష్ : స్వాతంత్ర్యానంతర భారత సమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు.
2. శివవర్మ : ఈ గ్రంథ రచయిత – అనువాదకుడు
3. శివవర్మకు విప్లవ పార్టీలో మారుపేరు 'ప్రభాత్'

*(...13వ పేజీ తరువాయి)*

ఇంతవరకు కె.సి.ఆర్. గానీ, ఆయన సలహాదారు ప్రొ. జయశంకర్ గాని తెలంగాణ రాష్ట్రంలో తాము అమలు చేయబోయే ఆర్థిక, రాజకీయ, సామాజిక విధానాల గురించి ఎక్కడా మాట్లాడ లేదు. ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణకు అన్యాయం జరిగిందని, విడిపోవడం మంచిదనీ చెబుతున్నారు తప్ప. ప్రత్యేక రాష్ట్రంలో సామాన్య ప్రజలకు ఒరిగేదేమిటో చెప్పడం లేదు. కేవలం దళితుల్ని ముఖ్యమంత్రి చేస్తాననే కె.సి.ఆర్. హామీ, అదెంతవరకు సామాన్య దళితులకు మేలు చేస్తుందో? నాటి సంజీవయ్య, జగజ్జీవన్‌రాంల నుండి నేటి మాయావతి వరకూ సాగిన పాలనలే సాక్ష్యం. వెలమదారుల ఆధిపత్యం కింద దళితుడు ముఖ్యమంత్రి పీఠం అధిష్టంచినంత మాత్రాన, ఆయన చేసేదేమి ఉండదు. ఆ విషయం నేడు దళిత, మహిళా రిజర్వుడు పంచాయితీ పాలనలు చెబుతూనే ఉన్నాయి.

మరి 'ప్రత్యేక రాష్ట్రం' ఒక ఎజండాగా పెట్టుకొని సాధిస్తే అది భౌగోళికంగా మరొక రాష్ట్రం, ఉత్తరాంచల్, చత్తీస్‌ఘఢ్, ఝార్ఖండ్ తీరుగా ఉండదని హామీ ఏమిటి? ప్రత్యేక తెలంగాణలో చేనేత కార్మికులు, రైతన్నల ఆత్మహత్యలుండవా? 'మోతుకు' జిల్లా ప్రజల జీవన పరిస్థితులు మారుతాయా? ప్రజలు నిర్భయంగా రాత్రుళ్లు పొలాలకు వెళ్లగలరా? యువకులు బూటకపు ఎన్‌కౌంటర్ల భయంలేకుండా బతకగలరా? భూ సంస్కరణలు అమలవుతాయా? పౌరహక్కులకు ఏలాంటి ఇబ్బందులుండవా? ఇలాంటి వాతావరణాన్ని సృష్టించేందుకు, ప్రత్యేక తెలంగాణను డిమాండ్ చేస్తున్న రాజకీయ పార్టీలు, తమ 'మేనిఫెస్టో' (ఎన్నికల ప్రణాళికను) ప్రకటించాలని ప్రత్యేక రాష్ట్రాన్ని సమర్థిస్తున్న గద్దర్, కోదండరాం, సిధారెడ్డి, పాశం యాదగిరి లాంటి కళాకారులు మేధావులు, జర్నలిస్టులు కె.సి.ఆర్. పైన ఒత్తిడి తేగలరా? ఇంతవరకు, ఆ కోణంలో ఒక ప్రత్యామ్నాయ వాతావరణాన్ని డిమాండ్ చేస్తూ, నీకెవ్వరూ తమ వాణిని విన్పించనట్టు కనపడలేదు, వినపడ లేదు.

కరీంనగర్ జయత్సోహంతో మిగతా తెలంగాణ జిల్లాల్లో తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర వాదాన్ని బలోపేతం చేసేందుకు టి.ఆర్.ఎస్. శ్రేణులు కదలినపుడు, తెలంగాణ ప్రజల ఆకాంక్ష కేవలం భౌగోళికంగా ప్రత్యేక రాష్ట్రం కాదని, 'ప్రజాస్వామ్య తెలంగాణ' అని ఈ మేధావులు, రచయితలు, కళాకారులు, ప్రజల ఆకాంక్షలను బలంగా విన్పించక పోతే, పార్లమెంటరీ రాజకీయాల అవకాశవాదంలో వీరికి నిరాశ (తెలంగాణ ప్రజలతో పాటే) తప్పదు. ఆ దిశలో ప్రజల వాణిని విన్పించి, తమవంతు చారిత్రక కర్తవ్యం నెరవేరుస్తారని, వారి నేపథ్యం బట్టి, ఆశించవచ్చునుకుంటా. ◆

**వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.**

# కేంద్ర ప్రభుత్వ పన్ను బకాయిలు లక్షా అరవై మూడు వేల కోట్లు

**– వి. హనుమంతరావు**

రామాయణంలో అంతా 'కట్టె, కొట్టె, తెచ్చె' అని మూడు ముక్కల్లో చెప్పేయవచ్చునాన్నట్లు మన కేంద్ర ప్రభుత్వం గురించి చెప్పాలంటే రెండే రెండు మాటల్లో చెప్పేయవచ్చు. "నిధుల కొరత, అప్పులు"..

నిధుల కొరత ఎందుకేర్పడిందో, అప్పులేందుకు చేయాల్సిందోనని చూడబోతే ప్రభుత్వరంగ బ్యాంకులు బడాబాబులకిచ్చిన రుణాలు, వాళ్లు కట్టాల్సిన పన్నులు వసూలు చేయలేక పోవటం ప్రధాన కారణాలని తేలిపోతుంది. బ్యాంకులు ఇచ్చిన రుణాలు పోరు బాకీలుగా తయారవుతుంటే, వాళ్లందరిని పిలిచి బాబ్బాబూ చెల్లించండి మీరు వడ్డీ కట్టనక్కర్లేదు, అసలు చెల్లించండి అనో, పోనీ మీరెంత చెల్లిస్తారో చెప్పండి, మాట్లాడుకుందాం అని బుజ్జగించి ఆ మేరకు బ్యాంకులు నష్టపడి, బడా బాబులకు లాభం చేకూర్చిపెట్టింది ప్రభుత్వం.

ఇప్పుడు తాజా లెక్కల ప్రకాలం పారిశ్రామిక వేత్తలు, కార్పొరేట్ సంస్థలు, బడావ్యాపారస్తులు వాళ్లు చెల్లించాల్సిన పన్ను బాకీ రు. 1.60 లక్షల కోట్లు (మార్చి 31, 2005 నాటికి) అని ప్రభుత్వ గణాంకాలు తెలియజేస్తున్నాయి. దేశంలో మిలియనీర్లు, బిలియనీర్లు ఉన్నారంటే ఉండరూ? 'మీరు అప్పులు తిరిగి చెల్లించకండి, పన్నులు కట్టకండి' అని ప్రభుత్వం పాఠాలు నేర్పుతుందన్నమాట. అంతే కదండీ మన్‌మోహన్‌జీ? మీరు వ్యక్తిగతంగా కడిగిన అణిముత్యమే, కాని దేశ ప్రధానిగా బురద అంటించుకొంటున్నారు.

కాగ్ నివేదికలు ప్రతి సంవత్సరం ప్రభుత్వ శాఖలను చాకిరేవు పెడుతుంటాయి. ప్రభుత్వ అకౌంట్లను తనిఖీ చేసి లోటుపాట్లు ఎత్తి చూపించి ఏమిటి ఇలా జరిగింది? ఏమిటి నీ జవాబు? అని ఆయా శాఖాధిపతులకు 'శుభలేఖలు' పంపుతారు. ఇలాంటి లేఖల్లో చిక్కుకొన్న మొత్తం రు. 20994 కోట్లు. ఇది పైన పేర్కొన్న మొత్తానికి అదనం. మామూలుగా జరిగేమేమంటే తేలుకుట్టిన దొంగల్లా ఈ దొరలు జవాబివ్వకుండా నెలలు, సంవత్సరాలు తాత్సారం చేస్తుంటారు. ఒకటికి రెండుసార్లు మళ్లా మళ్లా గుర్తు చేసినా, అధికారులు ఉలకరు, పలకరు. ఉదాహరణకు మార్చి 2004 నాటికి ఈ పన్ను బాకీల్లో నాలుగోవంతు అయిదు సంవత్సరాలపైగా చెల్లించకుండా పడిఉన్నాయి. కాగా నిధులు లేకపోవడమేమిటి? ఎగవేతదారులకు, ఉన్నతాధికారులకు, మంత్రిపుంగవులకు ఉన్న చుట్టరికం అలాంటిది.

(మాజి పార్లమెంట్ సభ్యుడు ఎరా సెజియన్ వ్యాసం ఆధారం)

| **పన్ను బాకీలు** | **(కోట్ల రు.)** |
|---|---|
| ఆదాయ పన్ను | 83977 |
| కార్పొరేషన్ పన్ను | 39204 |
| ఆస్తి పన్ను | 1148 |
| ఎక్సైజ్ సుంకం | 34249 |
| కస్టమ్స్ సుంకం | 1806 |
| వృత్తి పన్ను | 3064 |
| **మొత్తం** | **1,63,448** |

*(...8వ పేజీ తరువాయి)*

ఇక కేంద్రం స్పాన్సర్ చేసిన స్కీంల అమలు సంగతి సరేసరి. అవి ఏ స్కీం కింద ఎన్ని నిధులు వస్తున్నాయి సరి అయిన సమాచారం ప్రజలకు ఉండదు. కేంద్ర ఖాదీ కమీషన్ ద్వారా రాష్ట్ర ఖాదీ బోర్డులకు ప్రతి సంవత్సరం కోట్లాది రుపాయలు సబ్సిడీల రూపంలో గ్రాంట్ల రూపంలో వస్తున్నాయి. కానీ గ్రామీణ పరిశ్రమలలో గాని గ్రామీణ వృత్తులలో కాని పెద్ద పురోగతి లేదు. ఇట్టి నిధులన్నీ మధ్య దళారీలు, అధికార్ల జేబులలోకి ఎక్కువగా జారుకుంటున్నాయి. ఇలాంటి స్కీంల అమలు విషయంలో స్వచ్ఛంద సంస్థలు కల్పించుకొని ఆర్.టి.ఐ. చట్టం కింద సమాచారం లాగి సోషల్ ఆడిట్ చేయకపోతే ఈ స్కీంల అమలులో పురోగతి ఉండదు. ఇందిర పథకాలు కాని జాతీయ గ్రామీణ ఉపాది పథకం అమలు కాని సరి అయిన పర్యవేక్షణ సమీక్షలు లేనచో పెద్ద పురోగతి సాధించలేదు. ఈ సంవత్సర కేంద్ర బడ్జెటులో 71996 కోట్ల రుపాయలు కేటాయిస్తున్నట్లు పదకొండవ పంచ వర్ష ప్రణాళిక చిత్తులో చూపనయినది.

విదేశి ప్రత్యక్ష పెట్టుబడుల వలన, భారతీయ స్టాక్ మార్కెట్‌లోకి ప్రవహిస్తున్న విదేశి వ్యవస్థీకృత పెట్టుబడుల వలన భారతీయ పరిశ్రమలు, భారతదేశంలో నడుస్తున్న దేశీ కంపెనీల పరిశ్రమలు ముఖ్యంగా ఐటి, పార్మా, ఆటోమొబైల్, స్టీల్ రంగాల లాంటి వాటిలో ఉత్పత్తి ద్విగుణీకృతం అయింది. దీని వలన ఈ దేశపు జి.డి.పి. ప్రస్తుతం 8 శాతం వరకు అభివృద్ధి అయిందని చెప్పబడుతున్నది. 70 శాతం ప్రజలు ఆధార పడుతున్న వ్యవసాయ రంగం మాత్రం 1.4 శాతం మాత్రమే సదరు జి.డి.పి.కి పోది చేస్తున్నట్లు చెప్పబడుతున్నది. దీనిని 4 శాతంకు పెంచాలని ప్రధాని అంటున్నాడు కాని అమలులో శూన్యం. పారిశ్రామిక రంగపు ఉత్పత్తి పెరగటం సంతోషమే కాని, ఈ ఉత్పత్తికి తగ్గట్టుగా విదేశి మారక ద్రవ్యపు నిలువలు పెరగడం లేదు. దానికి కారణం ఎగుమతులు సరిగ లేకపోవటమే. ఇంకొకవైపు అంతర్జాతీయ చమురు ధరలు బాగా పెరగటం వలన దిగుమతుల చెల్లింపుల మూలాన మన దేశ విదేశీ మారక ద్రవ్య నిలువలలో 31 బిలియన్ డాలర్లు తగ్గిపోయినవి. ఈ తరుగుదల వలన ఆర్థిక వ్యవస్థకు వచ్చె నష్టమేమి లేదు అని ప్రభుత్వం అంటున్నది. బహుశా ఈ తరుగుదల నష్టం దేశంలో విస్తరిస్తున్న ఎస్.ఇ.జెడ్‌ల వల్ల ఏర్పడె ఎగుమతుల పెరుగదల వలన పూడ్చుకోవచ్చని ప్రభుత్వం అంచనా కావచ్చును. కానీ ప్రభుత్వం యొక్క ఈ ఎస్.ఇ.జెడ్. (ప్రత్యేక ఆర్థిక మండళ్లు) విధానం వల్ల రైతులు, ఆహార భద్రత దెబ్బతినవచ్చని దేశంలో ఆందోళనలు జరుగుతున్నవి. సింగూర్ రైతుల ఆందోళన దీనికి తార్కాణం. ఏది ఏమైనప్పటికీ, ఇటు పారిశ్రామిక రంగంను అటు వ్యవసాయ రంగాన్ని సమ ఉజ్జీగా అభివృద్ధి పరచవలసిన బాధ్యత కేంద్ర రాష్ట్రాల ప్రభుత్వాల పై ఉంది. ◆

# అసహజ మరణాల సూచి

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు/కారణాలు తెలియని | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 26-12-2006 నుండి 1-1-2007 | 19 | - | 16 | 1 | - | - | 4 | 8 | - | 27 | 7 | - | 5 | - | - | 2 | - |
| 2-1-2007 నుండి 8-1-2007 | 12 | - | 16 | - | - | - | 15 | 8 | - | 25 | 9 | - | - | - | - | 3 | - |
| 9-1-2007 నుండి 15-1-2007 | 12 | - | 29 | - | - | - | 2 | - | 12 | 29 | 12 | - | - | - | - | - | - |
| 16-1-2007 నుండి 25-1-2007 | 23 | - | 34 | 2 | - | - | 24 | 12 | 5 | 26 | 73 | - | 1 | - | - | - | - |
| కడప | 2 | - | 2 | - | - | - | 1 | 1 | - | 17 | 5 | - | - | - | - | - | - |
| **మొత్తం** | **68** | **-** | **97** | **3** | **-** | **-** | **46** | **29** | **17** | **124** | **106** | **-** | **6** | **-** | **-** | **5** | **-** |

గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.

PRINTED BOOK

RNI Regn. No. APTEL/2003/11482 Published on 27-01-2007




ముఖ్యమంత్రి డా. వై.యస్. రాజశేఖర రెడ్డి గారి నాయకత్వంలో ఆంధ్రప్రదేశ్ అన్ని రంగాలలో పురోభివృద్ధిని సాధించింది. వ్యవసాయం మరియు నీటిపారుదల రంగాలలో ప్రత్యేక శ్రద్ధ చూపుతూ ఆంధ్రప్రదేశ్‌ను హరితాంధ్రప్రదేశ్‌గా తీర్చిదిద్దాలన్నదే ఈ ప్రభుత్వం ఆశయం. భూమిలేని నిరుపేదలకు భూమి పంపిణీ వంటి పథకాలే కాకుండా పంటపొలాలకు నీటిని అందించే ప్రక్రియలో భాగంగా రాష్ట్రంలో 51 భారీ, మధ్యతరహా మరియు చిన్నతరహా నీటి ప్రాజెక్టులను నిర్మించాలని లక్ష్యంగా పెట్టుకుంది. అప్పుడే ఆంధ్రప్రదేశ్ దేశానికే 'అన్నపూర్ణ'గా నిలుస్తుంది.

## రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన కొన్ని సంక్షేమ పథకాలు

- **51** భారీ మరియు మధ్యతరహా సాగునీటి ప్రాజెక్టులను **60** వేల కోట్ల రూపాయలతో చేపట్టి, రాబోయే **5** సం.లలో పూర్తి చేయడం. వీటి ద్వారా కోటికి పైగా ఎకరాల ఆయకట్టు సాగులోకి వచ్చే అవకాశం
- అతిపెద్ద మల్టీ నేషనల్ కంపెనీస్‌తో పాటు **Microsoft, IBM, Motorola, GE, HSBC, DELL, Satyam, Infosys** మొదలైన **Fortune 500** కంపెనీలకు నిలయంగా మారింది. **IT/ITES** ఎగుమతులలో **2005-2006** సం॥లో రూ.**12,521**లతో, **51%** వృద్ధితో దేశంలోనే ఆంధ్రప్రదేశ్ మొదటి స్థానంలో నిలిచింది
- నాలెడ్జ్ కారిడార్, బ్రాడ్‌బాండ్, జవహర్ నాలెడ్జ్ సెంటర్, ఇ-ప్రొక్యూర్‌మెంట్, బహుళ ప్రయోజన కార్డులు వంటి ప్రాధాన్యతలు
- ఎస్.సి., ఎస్.టి., బి.సి.మరియు ఇతర భూమి లేని **3,14,685** లక్షల మంది నిరుపేదలకు **4,37,019.86** ఎకరాల భూమిని మూడు విడతలుగా పంపిణీ చేయడం జరిగింది
- దేశంలోనే మొట్టమొదటిసారిగా పట్టణ నిరుపేదలకు అందించే గృహ సౌకర్యం '**రాజీవ్ గృహకల్ప**'
- రాష్ట్రంలో పేదలకు గత ఏడాది **6.54** లక్షల గృహాల నిర్మాణం చేపట్టడం జరిగింది. ఈ ఏడాది **12.50** లక్షల గృహ నిర్మాణం చేపట్టాలన్నది లక్ష్యం
- **అగ్రికల్చరల్ టెక్నాలజీ మిషన్** – వివిధ పంటలలో దిగుబడి లోపాలను గుర్తించడం, ప్రత్యామ్నాయ వ్యవసాయ విధానాల ద్వారా వాటిని ఎదుర్కోవడం. నీటి సామర్థ్యాన్ని పెంపొందించడం. మెట్ట వ్యవసాయానికి కావలసిన విధానాలు మరియు పంటమార్పిడి విధానాలను పెంపొందించడం
- స్వయం సహాయక బృందాలలోని మహిళలకు '**ఇందిరా క్రాంతి పథం**' ద్వారా పావలా వడ్డీకే రుణాలు
- రూ.**500** కోట్లతో ఎస్.సి., ఎస్.టి.,బలహీన వర్గాల సమగ్రభూమి అభివృద్ధి ప్రాజెక్టు '**ఇందిర ప్రభ**'.

**ప్రతి క్షణం... ప్రతి పదం... ప్రజల కోసం**

R.O.NO. 338/SOU/ADVT.I/2006-07

Owned, Printed and Published by V. Hanumantha Rao at 301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayat Nagar, Hyderabad - 500 029. Ph : 66843495. Printed at Charita Impressions, Azamabad, Hyderabad. For Nutan Art Printers, Hyderabad. Working Editor : N. Venugopal

VEEKSHANAM
301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayatnagar, Hyd-29.